# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## కామినీ పిశాచి

రచన: వసుంధర

## చావు చెప్పిరాదు

రచన : సికిందర్

## బర్త్‌డే కానుక

రచన: వాణిశ్రీ

## హంతకుడి వేట

రచన: ప్రతాప రవిశంకర్

పొగమంచు — తొమ్మిదవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 81**
సెప్టెంబర్, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# కామినీ పిశాచి

## వసుంధర

"నమస్కారం వెంకన్నగారూ!" అన్నాడా యువకుడు.

"కూర్చోండి" అన్నాడు వెంకన్న.

"ఇదివరలో మీరు నన్ను ఓ హత్యకేసు నుండి రక్షించారు. మీ దయవల్ల జైలుబాధ తప్పించుకున్న నేను ఓ యింటివాణ్ణి కాబోతున్నాను" అంటూ ఆ యువకుడు వెంకన్నకు ఓ శుభలేక అందించాడు. వెంకన్న అది అందుకుని చదువుకున్నాడు. ఆ యువకుడి పేరు జనార్దనరావు. అతని కాబోయే భార్య పేరు రాధ. వివాహానికింకా పది రోజులు వ్యవధి వుంది.

"అంటే పదిరోజుల్లో మీ అంతట మీరే జైలుకు వెడుతున్నారన్న మాట!" అన్నాడు వెంకన్న.

యువకుడు ఆశ్చర్యంగానూ, కంగారుగానూ "ఏం?" అన్నాడు.

"పెళ్ళయ్యేంతవరకే ఇల్లు ఇల్లు. ఆ తర్వాత నుంచి

అది జైలు. ఆ జైలుకు జైలరు భార్య" అని వెంకన్న ఏదో అనబోతూండగా బల్లమీద ఫోన్ మ్రోగింది.

"నేను వంటింట్లోంచి మాట్లాడుతున్నాను. మీ మాటలు నాకు వినబడుతున్నాయి. నేను మీకు జైలర్నా" అని పద్మావతీదేవి గులి పెసింది ఫోన్‌లో.

వెంకన్న ఫోన్ క్రింద పెట్టేసి స్వరం తగ్గించి "నా మాటలు వంటింట్లోని నా భార్యకు వినబడ్డాయి. వెంటనే తిడుతూ ఫోన్ చేసింది. చూశారా—పెళ్ళయ్యాక వాక్స్వాతంత్రం కూడా వుండదు" అన్నాడు.

వెంకన్న అసిస్టెంట్సు సీతమ్మ, రాజమ్మ ముసిముసిగా నవ్వుకున్నారు.

జనార్దనరావు కూడా నవ్వి "రాధతో నేను ప్రారంభించబోయే జీవితాన్ని జైలు జీవితంతో పోల్చకండి. అసలు నాకు జీవితం మీద ఆశ పుట్టించినదే రాధ పైన ప్రేమ. లేకపోతే నేను ఏ నాడో చచ్చిపోయి వుండేవాణ్ని" అన్నాడు.

వెంకన్న అతన్ని వివరాలడగలేదు. ప్రతి ప్రేమికుడూ ప్రియురాలి కారణంగానే తన శూన్యజీవితం నిండుగా అయిందని అనుకుంటాడు. అది పెద్దగా పట్టించుకోవాల్సిన విషయంగాదు.

"మీ ఆహ్వానానికి థాంక్స్!" అన్నాడు వెంకన్న.

ఆ యువకుడు వెళ్ళిపోయాడు.

"ఈ కుర్రాడికి భయమూ, కంగారూ యెక్కువ. ఓ హత్యకేసులో పోలీసులు ఇతన్ని ప్రశ్నించారు. దానికే భయపడిపోయాడు. అతనికేం ప్రమాదం లేదని నేను చెప్పినా తనా హత్యకేసులో ఇరుక్కున్నాననే భావించాడు. కేసు ముగిశాక తను పెద్దగండం తప్పించుకున్నా

నని—అదీ నా కారణంగానేనని నమ్మాడు. ఇలాంటి వాడు ఎప్పుడైనా నిజంగా తనే హత్యచేస్తే యెలా ప్రవర్తిస్తాడో?" అన్నాడు వెంకన్న.

## 2

"శవాన్ని చూస్తావా?" అనడిగాడు ఇనస్పెక్టర్ శంకర్రావు.

వెంకన్న తలాడించాడు. ఇద్దరూ వెళ్ళి శవాన్ని చూశారు:

నీటిలో నానడంవల్ల శవం బాగా ఉబ్బి వుంది.

"ఇది హత్యేనా అయుండాలి. ఆత్మహత్యేనా అయుండాలి!" అన్నాడు శంకర్రావు.

"అయ్‌సీ - మరింకే అవకాశమూ లేదా?" అన్నాడు వెంకన్న వెటకారంగా.

శంకర్రావు నాలిక్కరుచుకుని "నా ఉద్దేశ్యమేమి టంటే ఇది ప్రమాదవశాత్తూ అనుకోకుండా జరిగిన సంఘటన కాదని!" అన్నాడు.

"వివరాలు చెప్పగలవా?" అన్నాడు వెంకన్న.

"హతురాలి పేరు రాధ...."

"హతురాలు అంటే హత్య చేయబడిందనే నువ్వు నమ్ముతున్నావన్న మాట!" అన్నాడు వెంకన్న సాలో చనగా.

"పోనీ....చనిపోయిన అమ్మాయి పేరు రాధ. ఆమె వివాహానికింక మూడురోజులు వ్యవధి వుంది. వారిది ప్రేమ వివాహం. వివాహానికి ముందే ఇద్దరికీ బాగా పరి చయం వుంది. ఇద్దరికీ ఒకరంటే ఒకరికి ప్రాణం అని రాధ ఇంట్లోని వారంటున్నారు. రాధ చనిపోయిన సమ యంలో ఆమెకు కాబోయి ఆగిపోయిన భర్త జనార్దన

రావుకు పటిష్టమైన ఎలిబీ వుంది. అతన్ని ప్రశ్నిద్దామను కుంటే మనిషి మెంటల్ షాక్ తిన్నవాడిలా అయి పోయాడు. కానీ" ....అని ఆగాడు శంకర్రావు.

"కానీ....?!" అన్నాడు వెంకన్న కుతూహలంగా.

"రాధ చనిపోవడానికి రెండు మూడు రోజుల ముందునుంచీ ఆ యింటి వాతావరణం హఠాత్తుగా మారిం దనీ—అంతవరకూ ఉత్సాహంగా ఉండేవారంతా మౌనంగా గంభీరంగా అయినారనీ చుట్టుపక్కల వాళ్ళు చెప్పారు. రాధ రేపు చనిపోతుందనగా జాబోలు— జనార్దనరావు, రాధ కలిసి ఒక నర్సింగ్ హోంకు కూడా వెళ్ళినట్లు తెలిసింది. అక్కడ ఎంక్వయిరీ చేయగా ఏమీ సమాచారం లభించలేదు. ఇంతకీ విషయం రాధ శీలానికి సంబంధించినదని మాకో అనుమానం వచ్చింది. ఎందు కంటే...." మళ్ళీ ఆగాడు శంకర్రావు.

"ఎందుకంటే....?!" అనడిగాడు వెంకన్న.

"రాధ కన్య కాదనీ....మరణించడానికి పూర్వం ఆమెకు పురుషుడితో కనీసం ఒక్కసారైనా అనుభవం అయివుండాలనీ డాక్టరు అంటున్నాడు...." అన్నాడు శంకర్రావు.

"వాట్!" అన్నాడు వెంకన్న. ఇటువంటిది అత నూహించినట్లులేదు. ఒక్కక్షణం ఆలోచనలో పడి పోయాక "సరే నీ పూర్తి కథ చెప్పు!" అన్నాడు.

"చెప్పడానికేముంది? రాధ, జనార్దనరావు ఒక రొన్నకరు ప్రేమించుకున్నారు. కలిసి మెలిసి తిరిగారు. ఇంటిల్లపాదికీ ఈ ప్రేమ ఇష్టంకాగా అది వారి పెళ్ళికి దారి తీసింది. అయితే జనార్దనరావుకు ఏ కారణంగానో రాధ శీలంపైన అనుమానం కలిగింది. అతని అనుమానానికి

స్పష్టమైన ఆధారం ఏదో లభించింది. అది రాధ ఇంట్లో చెప్పాడు. దాంతో ఆ ఇంటి వాతావరణం మారిపోయింది. అందరికీ రాధ భవిష్యత్తు గురించి బెంగపట్టుకుంది.

అప్పుడు జనార్దనరావు తన అనుమానాన్ని పూర్తిగా బలపర్చుకోవడంకోసం ఆమెను ఓ నర్సింగ్ హోంకు తీసుకు వెళ్ళి పరీక్ష చేయించాడు. అతడి అనుమానం బలపడింది. ఆ నర్సింగ్ హోం నడిపే లేడీ డాక్టరు రాధ గురించి తన కేమీ తెలియదనడానికి కారణం అదే! జనార్దనరావు రాధతో తెగతెంపులు చేసుకోవాలనుకున్నాడు. మర్నాడామె చనిపోయింది. ఊరి చివరకు వెళ్ళి నదిలో దూకింది. తన ప్రేమ విఫలమైందన్న విరక్తితో ఆమె నదిలో దూకిందా—లేక తన నామె మోసం చేసిందన్న కసితో, ఆమెపై పగబట్టి జనార్దనరావామెను హత్య చేశాడా అన్న విషయం కాలమే తేల్చాలి. ఇప్పుడు జనార్దనరావుకున్న ఎలిబీని ఛేదించడం మావల్ల కాదు. అందువల్ల మాకు ఆత్మహత్యే గత్యంతరమయింది—" అన్నాడు శంకర్రావు.

"మధ్య మీ రెండుకూ ఆత్మహత్య చేసుకోవడం?" అన్నాడు వెంకన్న నవ్వుతూ.

"అంటే నా ఉద్దేశ్యం—ఇది హత్యా, ఆత్మహత్యా అన్న విషయం తేల్చడంతో మా కిప్పుడు ఆత్మహత్య మాత్రమే యెన్నుకోవాలని వుంది అని. అయినా కేసులో అడుగు ముందుకు వెయ్యని పరిస్థితుల్లో యిలాంటి నిర్ణయాలు తీసుకోవడం ఆత్మహత్యతో సమానమే గదా—" అన్నాడు శంకర్రావు.

వెంకన్న అక్కణ్నించి రాధ యింటికి వెళ్ళాడు. వాళ్ళంతా దుఃఖ సముద్రంలో ఉన్నారు. శవం తమకు

అప్పగించబడగానే అంత్యక్రియలు జరిపించడానికి కూడా యేర్పాట్లు చేస్తున్నారు. ఇంట్లో యెవ్వరికీ కూడా జనార్దనరావు మీద అనుమానం లేదు. పైగా అంతా అతన్ని దేవుడని అంటున్నారు.

ఇది చాలా విడ్డూరంగానే తోచింది వెంకన్నకు.

ఇంట్లో ఒక్కరు కూడా జనార్దనరావును అనుమానించడం లేదు. వాళ్ళ ఆదరాభిమానాలు పొందడానికి జనార్దనరావు ఏం చేశాడు? రాధ శీలవతికాదని తెలిసి కూడా ఆమెను క్షమించేడా? ఆమెను వివాహం చేసుకునేందుకు సిద్ధపడ్డాడా? అది భరించలేకనే రాధ ఆత్మహత్య చేసుకుందా? లేదా జనార్దనరావు నయవంచన చేసి రాధను చంపేశాడా?....

మరి అతడికున్న ఎలిబీ....?

దాందేముంది! రాధ నతను స్వయంగా చంపనవసరం లేదు. ఎవరిద్వారానైనా చంపవచ్చు.

ఎవరిద్వారానైనా అన్న ఆలోచన రాగానే వెంకన్న వులిక్కిపడ్డాడు.

శంకర్రావుకీ ఆలోచన ఎందుకు రాలేదు?

శంకర్రావుకా ఆలోచన యెందుకు రాలేదో—వెంకన్నకు వెంటనే స్ఫురించింది.

వెంకన్నకే కాదు. ఒక్కసారి జనార్దరావు ముఖం స్ఫురిస్తే యెవరికైనా అతను హత్యలు చేయడానికి మనుషులను నియోగించగల సమర్థత ఉన్నవాడన్న ఆలోచన రాదు.

అలాంటివాణ్ని హంతకుడని మాత్రం యెలా అనుకునేది?

హత్య సంగతి వేరు. తాత్కాలికావేశంలో మనిషి

యెంత ఘోరమైనా చేయగలడు. కానీ హత్యలు చేయించ డానికి తాత్కాలిక ఆవేశం చాలదు.

అందువల్ల జనార్దనరావు హత్య చేసి వుండవచ్చు. కానీ చేయించి వుండడు.

## 3

"హలో!" అందా అమ్మాయి.

"ఎవరు మీరు?...." అన్నాడు ఆ అబ్బాయి ఆశ్చర్యంగా.

"వయసులో ఉన్న అబ్బాయిని—వయసులో వున్న అమ్మాయి పలకరిస్తే—నువ్వు జవాబివ్వాలి గానీ మీరని జవాబిచ్చేవాళ్ళంటే నాకు గిట్టదు. నా పేరుతో పిలిస్తే యింతా సంతోషిస్తాను. నా పేరు ప్రభ!" అందా అమ్మాయి.

"హాయ్ ప్రభా! నా పేరు సురేష్‌కుమార్!" అన్నాడు ఆ అబ్బాయి.

"చెప్పాలంటే నా పేరూ పెద్దదే. వీర వెంకట జనార్దన లక్ష్మీప్రభ! మనలాంటివాళ్ళు కలుసుకున్నప్పుడు పేర్లు పిల్చుకోడానికే సమయమంతా గడిచిపోకూడదని నా పేరు సింపుల్‌గా చెప్పాను. నువ్వూ సింపుల్‌గా సురేష్ అనో, కుమార్ అనో చెబితే సంతోషించేదాన్ని-" అంది ప్రభ.

"పోనీ—నీ యిష్టం అలాగే పిలు...." అన్నాడు సురేష్‌కుమార్ లోలోపల ఈ పరిచయానికి యెంతగానో ఆనందిస్తూ. ప్రభ చాలా చాలా చాలా అందంగా వుంది. కావాలని తన్ను పలకరించి నర్మగర్భంగా మాట్లాడుతోంది. అసలీమె ఉద్దేశ్యమేమిటో తెలుసుకోవాలి!

"నీ పేరు నాకు నచ్చలేదు. నిన్ను నేను విజయ్ అని

పిలిస్తే అభ్యంతరమా?" అంది ప్రభ.

"అభ్యంతరం లేదు. ఆ పేరంటే నీ కిష్టమా?" అన్నాడు సురేష్‌కుమార్.

"ఆ పేరంటే నాకు పెద్ద యిష్టమేం లేదు!" అని నవ్విందామె—"నాకు అమితాబ్‌బచ్చనంటే చాలా యిష్టం. అమితాబ్‌బచ్చన్ పేరు సాధారణంగా అన్ని సినిమాల్లోనూ విజయ్ అనే ఉంటోంది మధ్య. అందుకని నా కిష్టమైన వాళ్ళందర్నీ ఆ పేరుతో పిల్చుకుంటాను. నువ్వు అమితాబ్‌బచ్చనంత స్మార్టుగా ఉన్నావు—"

సురేష్‌కుమార్ సిగ్గుతో మెలికలు తిరిగి—"నాకంటే నువ్వే అందంగా వున్నావు—" అన్నాడు.

"మగాడి కళ్ళకు ఆడది అందంగా కనబడ్డం సాధారణం. ఆడదాని కళ్ళకు మగాడు కనబడ్డం అసాధారణం—" అని ముగ్ధమోహనంగా నవ్వింది ప్రభ—"మా యింటి కొస్తావా?"

"ఆడపిల్ల పిలిస్తే కాదనకూడదని మా తాత అంటూంటాడు. నాకు మా తాత మాట వేదవాక్కు—"

"తాతగారి మాట వినే కుర్రాడివా నువ్వు—ఇదో వెరైటీ—" అందామె.

ఇద్దరూ ఓ రిక్షా ఎక్కారు. ఇద్దరూ ఒకరికొకరు తగుల్తూ కూర్చుంటే అతడికి చాలా హాయిగా ఉంది. "ఈ రోజు నక్కను తొక్కొచ్చాను—" అనుకున్నాడతను.

రిక్షాలో ఆమె చాలా సరదాగా మాట్లాడిందతనితో. రిక్షాను ఒకచోట ఆపమని ఆమే చెప్పింది. రిక్షాకు డబ్బులు అతనే ఇచ్చాడు.

ఆమె ముందుకు దారితీస్తూంటే అతనామెను అనుసరిం

చాడు. ఇద్దరూ అలా నడుచుకుంటూ ఒక ఏకాంత ప్రదేశంలోని బంగళా దగ్గరకు వచ్చారు.

"ఇదే మా యిల్లు" అందామె

అంతవరకూ ఆమె మాటల మైకంలో వున్న సురేష్ కుమార్ ఉలిక్కిపడి ఆ బంగళాను, పరిసరాలను పరీక్షగా చూశాడు.

బంగళా అందంగా వుంది. చుట్టూ మంచి గార్డెన్ కూడా వుంది. ఒక ప్రహరీగోడ కూడా వుంది. అయితే ఆ దరిదాపుల్లో ఎక్కడా ఇళ్ళుకానీ, మనుష్య సంచారం కానీ లేవు.

"ఇంత ఏకాంతంగా వుంటున్నావా?" అన్నాడు సురేష్‌కుమార్ ఆశ్చర్యంగా.

"నువ్వున్నావుగా. ఇప్పుడిలాంటి ఏకాంతమే బాగుంటుంది" అందామె!

ఆ క్షణంలో సురేష్‌కుమార్‌కి మరింకేమీ గుర్తురాలేదు. అతని ఊహలు మధురాతిమధురంగా వున్నాయి. అతని కన్నులు కలలతో నిండిపోతున్నాయి.

ఇల్లు తాళంవేసి వుంది. ప్రభ తనే తాళంతీసి లోపల ప్రవేశించి లైటువేసింది.

"ఇల్లు చాలా బాగుంది?" అనుకున్నాడు సురేష్ కుమార్.

ప్రభ అతనికి ఇల్లంతా చూపించి "ఇంత యింట్లో నేనొక్కర్తినే వుంటున్నానని ఆశ్చర్యపోకు. ఇలా వుండడమే నాకు ఇష్టం. నేను నాకు వరుణ్ని వెతుక్కుంటున్నాను. అన్ని విధాలా నాకు నచ్చినవాణ్ణే నేను పెళ్ళి చేసుకుంటాను. నీ ప్రవర్తనసుబట్టి నిన్నిక్కడ యెన్ని రోజులుంచుకునేదీ నిర్ణయిస్తాను" అంది.

"నీ లాంటి ఆడపిల్లలసంఖ్య దేశంలో యింకా పెర గాలి!" అన్నాడు సురేష్ కుమార్.

"ఇక్కణ్నుంచి బైటకు వెళ్ళేటప్పుడు కూడా ఇదే మాట అనుకోగలిగితే నువ్వు ఎప్పుడూ ఇక్కడే వుంటావు" అంది ప్రభ.

తర్వాత ఆమె అతన్ని స్నానం చేసిరమ్మంది. అతను స్నానంచేసి రాగానే కట్టుకొందుకు ఉతికి ఇస్త్రీ చేసిన లుంగీపంచ, తెల్లటిచొక్కా వుంచింది. తర్వాత తనూ స్నానంచేసి వచ్చింది. తెల్లచీర కట్టుకుంది. మల్లెపూలు పెట్టుకుంది. జడ వదులుగా వేసుకుంది. అతని వద్దకు వచ్చి మత్తుగా చూసి "ఎలా వున్నాను విజయ్" అనడిగింది.

చటుక్కున ఆమెచేయి పట్టుకుని "నా నోట మాటలు రావింక. నన్నూరించకు. నేను నీ వాణ్ని. నీ దాసుణ్ని. త్వరగా నన్ను కనికరించు" అన్నాడు సురేష్‌కుమార్.

"ఒక్కనిముషం ఆగు. నాకు ఆకలిగా వుంది. ఇద్దరం కలిసి భోంచేశాక నే—సరదాలు—" అందామె.

ఒక ఫ్లాస్కునిండా పాలున్నాయి. ఇంట్లో ఆపిల్ పళ్ళున్నాయి. ఒక పళ్ళెంలో స్వీట్సు, ఆపిల్ ముక్కలు తెచ్చిందామె. అవి ఇద్దరూ కలిసి తిన్నారు. తర్వాత చెరో గ్లాసెడు పాలూ తాగారు.

భోజనం అవుతున్నంతసేపూ ప్రభ చిలిపిచేష్టలతో అతన్ని రెచ్చగొడుతూనే వుంది. పైట జార్చి సవరించుకునేది. ఉండుండి అతడివంక కొంటెగా చూసేది. అనుకోకుండా అతణ్ని తాకినట్లు నటించి చటుక్కున దూరంగా జరిగిపోయేది.

"మరి భోజనాలు కూడా అయిపోయాయి" అన్నాడు సురేష్‌కుమార్.

"నువ్విక్కడే వుండు. నేను పడకగదికి వెళ్ళి పక్కలు సరిచేసి నిన్ను పిలుస్తాను. నేను పిలిచేదాకా నువ్వక్కడను రాకూడదు" అంది ప్రభ.

సురేష్‌కుమార్ అందుకూ అంగీకరించాడు. ఆమె వెళ్ళిపోయింది. సరిగ్గా అయిదు నిముషాలు అనంతరం "విజయ్ నువ్వు రావచ్చు" అన్న ప్రభ మధురస్వరం వినిపించింది.

సురేష్‌కుమార్ ఆత్రుతగా పడకగదివైపు వెళ్ళాడు.

కొద్దిసేపటి క్రితం అతను ప్రభ చూపించగా ఇల్లంతా చూసి వున్నాడు. పడకగదికి ఎలా వెళ్ళాలో దారి కూడా తెలుసు అతనికి. పడకగదికీ—మధ్య హాలుకీ— మధ్య ఓ చిన్న ఇరుకు వరండా వుంది. ఆ వరండాలో దీపం వెలగడంలేదు. సురేష్‌కుమార్ వరండాలోకి వెళ్ళాడు. పడకగది అతనికి కనబడుతోంది కానీ గదంతా చీకటిగా వుంది.

"ప్రభా గదిలో దీపంలేదా?" అన్నాడు సురేష్‌కుమార్ వరండాలోనే ఆగిపోయి.

"దీపముంటే నాకు సిగ్గు. కావాలంటే నువ్వే లోపలికి వచ్చి వేసుకో" అంది ప్రభ కంఠస్వరం.

ముసిముసిగా నవ్వుకుంటూ సురేష్‌కుమార్ గదిలోకి అడుగుపెట్టాడు.

గది బాగా చీకటిగా వుంది. అతను తలుపు పక్కన స్విచ్ తడిమి స్విచ్ వేశాడు. ఇంతలో గది తలుపు దగ్గరగా వేసుకుంది.

గదిలో ఒక్కసారి ప్రకాశవంతం కావడంతో అతడు కళ్ళు నులుముకున్నాడు. కళ్ళు తెరవగానే ఎదుటపడ్డ దృశ్యం చూసి అప్రయత్నంగానే కెవ్వుమని అరిచాడు.

4

"వివరంగా చెప్పు!" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

"ఊళ్ళో మనుషులమధ్య ఒక కామినీ పిశాచి తిరుగుతోంది" అన్నాడు సురేష్‌కుమార్.

"కామినీ పిశాచాలు లేకపోతే మనుషులకెలా కుదురుతుంది? అందులో పెద్దగా భయపడవలసిందేమీ లేదు" అన్నాడు వెంకన్న.

"మీరలా వేళాకోళం చేయవద్దు. ఆ పిశాచిని నేను స్వయంగా చూశాను. దాన్ని స్వయంగా చూసి కూడా ఇంకా బ్రతికుండడం నాకు ఆశ్చర్యంగా వుంది" అన్నాడు సురేష్‌కుమార్.

"ఈ ప్రపంచంలో ఆశ్చర్యపడవలసిన విషయాలు కోకొల్లలు. అలా ఆశ్చర్యపడుతూ కూర్చుంటే యింకే పని చేయడానికీ తీరుబడి వుండదు. అందువల్ల నువ్వు నాకు అసలు విషయం చెప్పు!" అన్నాడు వెంకన్న.

"ఆ కామినీ పిశాచి అందమైన ఆడపిల్లలా తయారై వచ్చి నడిబజార్లో నన్ను పలకరించింది. తన పేరు ప్రభ అని చెప్పింది. తన వయ్యారంతో నా మతి పోగొట్టి తన ఇంటికి తీసుకువెళ్ళింది" అంటూ జరిగినదంతా చెప్పాడు సురేష్‌కుమార్.

"బాగానే వుంది—అదృష్టవంతుడివే!" అన్నాడు వెంకన్న.

"అంతవరకూ అదృష్టవంతుడినే—అసలు కథంతా తర్వాతే వుంది. నేను చాలా ఉత్సాహంగా ఆ గదిలోకి అడుగుపెట్టి లైటు వేశాను. అప్పుడు నాకు యెదురుగా కనబడ్డది అందమైన ప్రభ కాదు. ఒక మానవాతీత శక్తి తన అసలురూపంతో నా కళ్ళబడింది" అన్నాడు వెంకన్న.

"మానవాతీత శక్తి ఏమిటి?" అన్నాడు వెంకన్న చిరాగ్గా.

"అంత వికారరూపం మనుష్యులకుంటుందనుకోను. అందులోనూ అందమైన ప్రభ ఆ రూపం దాల్చడం మానవాతీతశక్తికి తప్ప సాధ్యం కాదు. కాలిపోయినట్లుండే ముఖం, అదే రకం శరీరం, చింపిరిజుట్టు, ఆకలిగొన్న చూపులు....ఎంతటి ధైర్యవంతుడికీ కూడా ఒకే ఒక్క-చూపులో భయం పుట్టించగల రూపమది!"

"అదేం చేసింది నిన్ను?"

"అది నన్ను రేప్ చేసింది" అన్నాడు సురేష్ కుమార్.

"ఒక ఆడది నిన్ను రేప్ చేయడమా?" వెంకన్న పకపకా నవ్వాడు.

"అది ఆడది కాదు సార్. దాని శక్తి అపరిమితం. దాని కామకాంక్ష అనంతరం. దాని స్పర్శ తల్చుకుంటేనే ఒళ్ళంతా గొంగళీపురుగు పాకినట్లనిపిస్తుంది. అలాంటిది అది నన్ను తనకోరిక తీర్చమని బలవంత పెట్టింది."

"నువ్వేం చేశావ్!"

"తప్పించుకుపోవాలని ప్రయత్నించాను. సాధ్యపడ లేదు. తలుపులన్నీ వేసివున్నాయి. దానిది పశుబలం. అది నా మీద పడి రక్కింది, గీరింది. దాని స్పర్శ తగిలినప్పుడల్లా నా వళ్ళు అసహ్యంతో కంపించిపోయింది. కానీ నాకు తప్పలేదు. దాని బలానికి నేను లొంగిపోయి జీవితంలో అత్యంత అసహ్యాకరమైన అనుభవం పొందాను."

"చాలా చిత్రంగా వుంది నీ కేసు...."

"మీరా కామినీ పిశాచిని పట్టుకోవాలి సార్!" అన్నాడు సురేష్‌కుమార్.

"అదిసరే-ముందు నువ్వక్కణ్ణించి ఎలా బైటపడ్డావో చెప్పు!" అన్నాడు వెంకన్న.

"ఎలా బైటపడ్డానో నాకే తెలియదు. ఆ గదిలో నేను సోలిపోయి పడిపోయాను. మెలకువ వచ్చేసరికి గది తలుపులు తీసి వున్నాయి. పిశాచం లేదు. ఒక్క పరుగున అక్కణ్ణించి బైటపడ్డాను. నా అనుభవం యెవ్వరికీ చెప్పుకోలేదు. ఇల్లు చేరగానే ఇంటిల్లిపాదీ నా మీద ప్రశ్నల వర్షం కురిపించారు. ఏదో కుంటి సమాధానాలు చెప్పి తప్పించుకున్నాను. కాస్త తేరుకున్నాక మీ దగ్గరకు వచ్చాను...."

"నా దగ్గరకు రావడంతో ఏం ప్రయోజనమాశించావ్?" అన్నాడు వెంకన్న.

"ఈ ఊళ్ళో యిలాంటి దెయ్యం ఒకటున్నదని మీ బోటివారికి తెలియడం చాలా అవసరమని నాకు అనిపించింది" అన్నాడు సురేష్‌కుమార్.

"ఓకే మిస్టర్ విజయ్ నీ కేసంతా మా అసిస్టెంట్సు కథగా వ్రాశారు. అది కథ కాక నిజమే అయితే ఆ కామినీ పిశాచి అంతు నేను తేలుస్తాను. అది నువ్వు కన్న కలే అయుంటే నీ కల్పనాశక్తిని అభినందిస్తూ నా మిత్రులకిది కథగా చెప్పుకుంటాను" అన్నాడు వెంకన్న.

"విజయ్ — ప్లీజ్ — నన్నా పేరుతో పిలవకండి" అన్నాడు సురేష్‌కుమార్ కంగారుపడుతూ.

## 5

నిర్జన ప్రాంతంలో వున్న ఆ బంగళా తలుపు తట్టాడు డిటెక్టివ్ వెంకన్న.

రెండు నిముషాలు పట్టింది తలుపు తెరుచుకోడానికి. తలుపు తెరిచిన వ్యక్తిని చూసి వెంకన్న ఆశ్చర్యపడ్డాడు.

అతను జనార్దనరావు.

"మీరా?" అన్నాడు వెంకన్న అప్రయత్నంగా.

జనార్దనరావు నీరసంగా నవ్వి "చాలా కాలం తర్వాత మనం కలుసుకుంటున్నాం. అన్నీ సవ్యంగా జరిగి వుంటే మనం నా పెళ్ళిలో కలుసుకోవలసివుండేది" అన్నాడు.

"ఇదా మీ ఇల్లు!" అన్నాడు వెంకన్న.

"ఈ మధ్యనే కొన్నానీ యిల్లు!" అన్నాడు జనార్దన రావు.

"ఎందుకని?"

జనార్దనరావు అదోలా నవ్వి "లోపలకు రండి అన్నీ వివరంగా చెబుతాను" అన్నాడు.

ఇద్దరూ లోపల కుర్చీల్లో కూర్చున్నారు.

"ఈ ఇంట్లో ఓ కామినీ పిశాచం వుందని చెప్పుకుంటు న్నారు. అది పట్టుకున్న మగవాణ్ని ప్రాణాలు తీసేదాకా వదలదట. అందువల్ల ఈ యిల్లు అమ్ముడుకావడమే కష్టంగా వుంది ఇంటి యజమానికి. రెండు లాభాలను దృష్టిలో వుంచుకుని ఈ ఇల్లు కొన్నాను నేను. ఒంటరితనాన్ని కోరుకుంటున్న నాకు నిర్జనప్రాంతంలో ఉండే ఈ ఇల్లొక వరం. అందులోనూ చవగ్గా వస్తోంది. ఈ ఇంట్లో కామినీ పిశాచి నిజంగానే వుంటే నాకు దానిగురించి భయంలేదు. జీవితేచ్ఛ లేనివాణ్ని నేను!" అని నిట్టూ ర్చాడు జనార్దనరావు.

"పట్టుమని పాతికేళ్ళు లేని మీకు జీవితేచ్ఛ లేదంటే ఎలా? మీరు రాధని ప్రేమించి వుండొచ్చు. కానీ ఎంత కాలమని ఆమెను తల్చుకుని బాధపడతారు?" అన్నాడు వెంకన్న.

"ఈ ప్రశ్నకు జవాబుకోసం నేనూ అన్వేషిస్తున్నాను వెంకన్నగారూ!" అన్నాడు జనార్దనరావు.

"మీరలా అన్వేషిస్తూ వుండండి. మరో అన్వేషణలో నేనిక్కడికి వచ్చాను. నేను మీ యిల్లు ఓసారి శోధించి చూడవచ్చా?" అన్నాడు వెంకన్న.

"ఎందుకు?"

"ఈ యింట్లోని కామినీ పిశాచాన్ని వెదకడానికి?"

"ఇక్కడ కామినీ పిశాచం వున్నట్లు మీ కెవరు చెప్పారు?"

"సురేష్ కుమార్!" అన్నాడు జనార్దనరావు కళ్ళ లోకి నిశితంగా చూస్తూ.

"అతనెవరు?" అన్నాడు జనార్దనరావు ఆశ్చర్యంగా.

"కామినీ పిశాచం వాతబడ్డవాడు...."

"ఇంకా బ్రతికేవున్నాడా?"

"ఉన్నాడు...." అని వెంకన్న ఆగి "నిన్నరాత్రి మీరెక్కడున్నారు?" అనడిగాడు.

"ఇక్కడే ఈ ఇంట్లోనే!" అన్నాడు జనార్దనరావు.

"అసంభవం...." అన్నాడు వెంకన్న.

"అలా అంటే నేనేం చెప్పను? రెండాటల సినిమా చూసి ఇల్లుచేరి పడుకున్నాను...."

వెంకన్న కళ్ళు మెరిశాయి "అదే నేనడిగేది? అంటే మీరు రాత్రి చాలాసేపు ఇంట్లో లేరన్నమాట! రెండా టల సినిమాలు అంటే ఇంటిదగ్గర సాయంత్రం అయిదిం టికే బయల్దేరి వుంటారు. ఇంటికొచ్చేసరికి కనీసం ఒంటి గంట అయుంటుంది. ఈ ఇంట్లో నిన్నరాత్రి తొమ్మిదికీ పన్నెండింటికీ మధ్య కామినీ పిశాచి కథ నడిపింది. ఆమె దగ్గర ఇంటి తాళాలు కూడా వున్నాయి."

జనార్దనరావు ఆశ్చర్యంగా—"అసలేం జరిగిందో చెప్పండి!" అన్నాడు వెంకన్న చెప్పింది విని-"వెంకన్న గారూ—మీరిది నమ్ముతున్నారా?" అనడిగాడు.

"ఈ కథపై మీ అభిప్రాయం." అన్నాడు వెంకన్న.

"కథ అని మీరే అంటున్నారుగా" అని నవ్వి "నేను నెల్లాళ్ళుగా ఇందులో వుంటున్నాను. నాకే అనుభవమూ లేదు" అన్నాడు జనార్దనరావు.

వెంకన్న జనార్దనరావువంక తీవ్రంగా చూసి "సురేష్ కుమార్ కథైనా చెప్పివుండాలి, మీరు కథైనా నడుపుతూ వుండాలి. ఏ విషయం నే నెలాగూ తేల్చగలను" అన్నాడు.

జనార్దనరావు తల వంచుకుని "వెంకన్నగారూ మీరంటే నాకు అపారమైన గౌరవం వుంది. నేనే నేరమూ చేయడంలేదు. నన్ను నమ్మండి" అన్నాడు.

# 6

"హలో విజయ్!"

పిలుపు విని ఉలిక్కిపడ్డాడు సురేష్‌కుమార్. అల్లంత దూరంలో అతడికి ప్రభ కనబడింది. ఆమెను చూస్తూనే సురేష్‌కుమార్ కాళ్ళలో వణుకుపుట్టింది. ఏం చేయాలా అని ఆలోచిస్తూండగానే అతన్ని సమీపించింది ప్రభ.

"నా పేరు విజయ్‌కాదు" అన్నాడతను.

"కానక్కర్లేదు. ఆ పేరు నాకిష్టం. నువ్వంటే కూడా నాకిష్టం. అందుకని నీకా పేరు పెట్టుకున్నాను. ఆ కథంతా మళ్ళీ చెప్పాలా?" అంది ప్రభ.

"వద్దు. అసలు నువ్వు నాతో మాట్లాడొద్దు" అన్నాడు సురేష్‌కుమార్.

"అలాగంటావేమిటి విజయ్. ఈ సారి క్రిందటిసారిలా

జరగడానికి వీల్లేదు."

"అంటే?"

"నిన్నా ఇంటికి తీసికెళ్ళి కాసేపు ఊరించి తర్వాత నా దారిన నేను వెళ్ళిపోయాను....అందుకుగానీ నీకు నా మీద కోపం రాలేదు గదా!" అంది ప్రభ.

సురేష్‌కుమార్ ఆశ్చర్యంగా ఆమెవంక చూసి "నీ కథ పూర్తిగా చెప్పు. అప్పుడు నేను నా కథ చెబుతాను" అన్నాడు.

"చెప్పడానికేముంది? చెప్పేశానుగా....నువ్వంటే మనసుపడే నిన్నా యింటికి తీసుకువెళ్ళాను. అయితే చివరి క్షణంలో నిన్నింకా ఊరించాలనిపించింది. పడకగదిలోంచి బయటకు వెళ్ళిపోయాను. ఆ తర్వాత నువ్వు నన్ను చాలా తిట్టుకుని ఉంటావు. ఇలాంటి ప్రాక్టికల్ జోక్స్ నాకు చాలా అలవాటు...."

"నన్ను మళ్ళీ ఆ యింటికి తీసుకెళ్ళాలని నువ్వు ప్రయత్నిస్తున్నావేమో—అది నీకు సాధ్యం కాదు. ఈసారి నేను మోసపోను...." అన్నాడు సురేష్‌కుమార్.

"ఆ యింటికా—ఆ రోజు ప్రాక్టికల్ జోక్ పేరుతో అంత రాత్రివేళ ఆ యింట్లోంచి బైటకు వచ్చేసరికి నాకెంత భయమేసిందో తెలుసా? ఈసారి అలా జరగడానికి వీల్లేదు. అందుకే మనిద్దరికోసం మెజస్టిక్ హోటల్లో గది బుక్ చేశాను...." అంది ప్రభ.

మెజస్టిక్ హోటల్!

ఆ ఊరికి అది త్రీ స్టార్ హోటల్!

సురేష్‌కుమార్ ప్రభవంక పరిశీలనగా చూసి—"ఎవరీమె—? మనిషా, కామినీ పిశాచా?" అనుకున్నాడు. ఆమె అందం చూస్తుంటే అతడికి మనసు చలిస్తోంది.

కానీ జరిగిన అనుభవం అతన్ని అపాదమస్తకమూ వణికిస్తోంది.

"అయితే ఏమంటావ్?" అన్నాడతను చిరాగ్గా.

"ఈ రాత్రి మనం మెజస్టిక్ హోటల్లో—సరదాగా గడుపుదాం. ఆ రాత్రి మిస్సైపోయిన అనుభవాలన్నీ ఈ రోజు తనివితీరా పొందాలి. అందాల అప్సరస అనిపించుకొనే యీ ప్రభ యీ విజయ్‌కు ప్రేమ దాస్యం చేయాలి...."

సురేష్‌కుమార్ ఆలోచించి—"మెజస్టిక్ హోటల్‌కే అయితే వస్తాను...." అన్నాడు.

"కాక....మరెక్కడికి....రూం కూడా బుక్ చేసి ఉంచాను...." అంది ప్రభ.

సురేష్‌కుమార్‌లో మళ్ళీ కోర్కెలు తలెత్తసాగాయి. అతడికి ప్రభను నమ్మాలనే అనిపించింది. ఆ రోజు కామినీ పిశాచిగా తనపై అత్యాచారం జరిపిన మానవతీతశక్తి, ఈ ప్రభ ఒక్కరు కాదు. ఈ రెండు సంఘటనలు కాకతాళీయంగా జరిగాయి.

ఆమె ముందుగానే యేదైనా రిక్షా యేర్పాటు చేసి తప్పుదారి పట్టిస్తుందేమో నన్న భయంతో—"నేను రిక్షాను పిలుస్తాను...." అన్నాడతను.

"మెజస్టిక్ హోటల్‌కు వెడుతూ రిక్షాలో వెడతామా?" అంది ప్రభ హేళనగా.

"పోనీ....టాక్సీనే పిలుస్తాను...."

"నీకు నచ్చిన టాక్సీనే పిలు....—" అంది ప్రభ.

సురేష్‌కుమార్ తనే టాక్సీని పిలిచాడు. ఇద్దరూ టాక్సీ ఎక్కి కూర్చున్నారు. ఆమె మధురస్పర్శకు ఆనందించడానికి బదులుగా అతను టాక్సీ వెళ్ళే దారినే

జాగ్రత్తగా గమనించసాగాడు. తను ఏమరుపాటుగా ఉండగా టాక్సీ పూర్వపు బంగళావైపు దారి మళ్ళుతుం దేమోనని అతడి భయం. అయితే అలాంటిదేమీ జరగ లేదు. టాక్సీ మెజస్టిక్ హోటల్ ముందు ఆగింది.

"మనకు పదిహేడో నంబరు గది బుక్ చేశాను. వెళ్ళి రిసెప్షన్ నడిగి తాళాలు తీసుకోవడమే!...." అంది ప్రభ.

ఒకసారి హోటల్ వంక చూసి తృప్తిగా నిట్టూర్చాడు సురేష్‌కుమార్. ఇలాంటి హోటల్లోకి కామినీ పిశాచాలు రాలేవు. వచ్చినా తప్పించుకోలేవు. అనవసరపు భయా లతో తను మంచి అవకాశాన్ని పోగొట్టుకోకూడదు. తీగ లాంటి ఆడది ప్రభ. ఎక్కడో అదృష్టవంతులకు తప్ప అలాంటి ఆడదాని పొందు లభించదు. అందులోనూ ఆమె వలచి వచ్చింది.

ఇద్దరూ తమ గదికి వెళ్ళారు.

"అద్భుతం!" అన్నాడు సురేష్‌కుమార్ ఆ గదిలోని యేర్పాట్లు చూసి. అతనంతవరకూ బహుశా అంత మంచి హోటల్ రూమ్ చూసి వుండడు. ఒక్కసారిగా అలాంటి రూమ్, అందులో—పక్కన ప్రభలాంటి అమ్మాయి— ....సురేష్‌కుమార్ శరీరంలోకి యేదో మైకం అప్పుడే ఆవహించసాగింది.

ప్రభ అతడి స్నానానికి యేర్పాట్లు చేసింది. మార్చు కునేటందుకు అతడికి బట్టలు సిద్ధం చేసింది. ఆ తర్వాత తనూ స్నానం చేసి బట్టలు మార్చుకుంది.

తెల్లచీర, తెల్లని రవిక, జడలో మల్లెపూలు, మత్తు కళ్ళు....నిగ నిగలాడే వళ్ళు....మిస మిస లాడే సొగసులు....సురేష్‌కుమార్ శరీరం దివ్యానుభూతికి

లోనవుతోంది.

అతని ఆత్రుతను గమనిస్తూనే ప్రభ అతణ్ణి వూరించ సాగింది. ఇద్దరూ బ్రెడ్, ఆపిల్ ముక్కలు తిన్నారు. పాలు తాగారు.

అది విశాలమైన గది. ప్రవేశ ద్వారం దగ్గరే సోఫాలున్నాయి. కాస్త దూరంగా, మూలగా రెండు మంచాలున్నాయి. అంతవరకూ వాళ్ళిద్దరూ చెరో సోఫాలోనూ కూర్చుని ఉన్నారు. ఉన్నట్లుండి ప్రభ లేచి—"నువ్విక్కడే వుండు—" అంది.

ఆమె తిన్నగా బెడ్ దగ్గరకు వెళ్ళింది. మంచంమీద పడుకుంది. ఆమెనే గమనిస్తున్నాడు సురేష్‌కుమార్. ఆమె చేయి మంచం పక్కనే వున్న స్విచ్ బోర్డుమీద పడింది. గది చీకటయింది.

"విజయ్—త్వరగా రా!" అంది.

సురేష్‌కుమార్ లేచాడు. సరిగ్గా అప్పుడే అతనికి పూర్వానుభవం తళుక్కుమంది. అతని మైకం విడిపోయింది....శరీరంలో సన్నని వణుకు ప్రారంభమయింది....

ఇంతవరకూ అంతా ఇదివరకటిలాగానే జరిగింది. ఇప్పుడూ అంతే జరుగుతుందా?

అందమైన ప్రభ ఇప్పుడు కామినీ పిశాచిగా మారిపోతుందా?

ఆ వూహే సురేష్‌కుమార్ శరీరంలో వణుకును పెంచింది.

తనిప్పుడేం చేయాలి? మంచం దగ్గరకు వెళ్ళాలా? పలాయనం చిత్తగించాలా?

చాలా సేపు ఊగిసలాడాడు సురేష్‌కుమార్. చిట్ట

చివరకు అతను రిస్కు తీసుకోదలిచాడు. వణుకుతూనే మంచాన్ని సమీపించాడు. అతడి చేతులు స్విచ్‌బోర్డు కోసం వెదికాయి.

గదిలో దీపం వెలిగింది.

మంచంమీద ప్రభ ముడుచుకుని పడుకుని ఉంది. తన అనుమానానికి నవ్వుకుంటూ అతను ఆమెను కుదుపుతూ తనవైపు తిప్పాడు. అంతే!

కెవ్వుమని అరిచాడతను.

ఆమె ప్రభ కాదు. కామినీ పిశాచి!

ఆమె అతన్ని గట్టిగా పట్టుకొని బిగి కౌగిలిలో ఉంచేసింది.

సురేష్‌కుమార్‌కు వొళ్ళంతా తేళ్ళు జెర్రులూ పాకి నట్లయింది.

"వద్దు!....వద్దు!....నన్ను వదలిపెట్టు...." అరిచాడతను.

ఆమె అతడి పెదాలతో తన పెదాలు కలుపుతోంది....

అసహ్యకరమైన ఆ ముఖం. అంతకంటే అసహ్యకరమైన ఆ పెదాలు.

సురేష్‌కుమార్ సర్వశక్తులూ వుపయోగించి పెనుగులాడుతున్నాడు—కానీ అతడి బలం యెందుకూ పనికి రావడంలేదు. ఏ మగవాడూ కోరుకోని అసహ్యకరమైన అనుభవం అతడికి బలవంతంగా లభ్యపడుతోంది.

సురేష్‌కుమార్ తన్ను తనే నిందించుకుంటున్నాడు. ఒకసారి జరిగేక కూడా మళ్ళీ తను యెలా మోసపోయాడు? కామినీ పిశాచం మెజస్టిక్ హోటల్లోకి రాలేదనుకొన్నాడు. కానీ అది యిక్కడికి కూడా

వచ్చింది. రావడమేమిటి? తనే దానితో కలిసి వచ్చాడు. ప్రభ మనిషి కాదు. పిశాచం! ఒకసారి అనుభవమయ్యిండీ దాని తళుకు బెళుకులకు మరోసారి లొంగిపోయాడతను.

ఇప్పుడేం చేయాలి? ఇప్పుడెలా తప్పించుకోవాలి?

తప్పించుకోవడం సురేష్‌కుమార్‌కు సాధ్యం కాలేదు.

## 7

"నిన్న రాత్రి మీ హోటల్లో ఏదైనా రభస జరిగిందా?" అనడిగాడు వెంకన్న.

"నిన్నే కాదు. ఈ హోటల్ పెట్టి యిప్పటికి ఆరేళ్ళయింది. ఇంతవరకూ యెలాంటి రభసా జరగలేదు. మీరలా యెందుకు అడుగుతున్నారు?...." అన్నాడు మేనేజర్.

"ఒక్కసారి పదిహేడో నంబరు గదిని నేను చూడవచ్చా?"

"ష్యూర్——" అంటూ ఆయన రిజిష్టర్ తెరిచి——"ఉదయమే ఆ గది ఖాళీ చేయబడింది. సాయంత్రానికి మళ్ళీ బుక్కయింది——" అన్నాడు.

"నిన్న ఆ గది యెవరి పేరున బుక్కయిందో చెప్పగలరా?" అనడిగాడు వెంకన్న.

"దానికేం...." అంటూ ఓ క్షణంసేపు చూసి——"జనార్దనరావు——...." అన్నాడు మేనేజర్.

ఉలిక్కిపడ్డాడు వెంకన్న. ఈ జనార్దనరావుకీ, సురేష్‌కుమార్‌కీ ఏదో సంబంధముంది. ఒకసారి కాదు. రెండోసారిగా యిలా జరిగిందంటే యిది కాకతాళీయం కాదు.

వెంకన్న వెళ్ళి గదిని పరిశీలించాడు. గదిలో ఎక్కడా యిద్దరు మనుషులు పెనుగులాడిన చిహ్నాలు లేవు. ఎంతో

నీటుగా సర్దివుంది. వెంకన్న గదికి సంబంధించిన బేరర్స్‌ని పిలిచి ప్రశ్నలువేసి ఆ గది ఎప్పుడూ నీటుగానే వున్నట్లు గ్రహించాడు. అనుమానాస్పదమైన సంఘటనలు జరిగినట్లు ఎవరూ చెప్పలేకపోయారు.

"పోనీ—రాత్రి ఈ గదిలోంచి కేకలు వినబడ్డాయా?" అన్నాడు వెంకన్న మేనేజర్ని.

"మీ ప్రశ్నలు చాలా విచిత్రంగా వున్నాయి. ఇది సౌండ్‌ప్రూఫ్ గది. లోపలేం జరిగినా బైటకు వినిపించదు. మా కస్టమర్సు చాలామంది అదే కోరుకుంటారు...." అన్నాడు మేనేజర్.

ఇంక అక్కడ తెలుసుకోదగ్గ విశేషమేదీ లేదనిపించింది వెంకన్నకు. అతను అక్కణ్ణుంచి తిన్నగా జనార్దనరావు బంగళాకు వెళ్లాడు.

జనార్దనరావు బంగళాలోనే వున్నాడు.

"నమస్కారం. రండి. కూర్చోండి—" అంటూ మర్యాద చేశాడు జనార్దనరావు.

"నిన్నరాత్రి మీ రెక్కడున్నారు?" సూటిగా అడిగాడు వెంకన్న.

"మెజస్టిక్ హోటల్లో—...." అన్నాడు జనార్దనరావు.

"ఇంత చక్కటి బంగళా వుండగా మీకు హోటల్ రూం ఎందుకావలసి వచ్చింది?"

"నా స్నేహితుడొకడు వస్తున్నట్లు వుత్తరం రాశాడు. అతనికి దెయ్యాలంటే విపరీతమైన భయం. నా బంగళాకు మాత్రం రాలేననీ తనకోసం ఒక మంచి హోటల్లో గది బుక్ చేయమనీ రాశాడు. మెజస్టిక్ హోటల్లో గది బుక్ చేశాను. కానీ యే కారణంవల్లనో అతను రాలేదు. నేను

రెండాటలు సినిమాలు చూసి—ఎలాగూ హోటల్ గది బుక్ చేశానుదా అని అక్కడకేపోయి పడుకుని తెల్లారేక లేచి ఖాళీ చేసేశాను...."

వెంకన్న అతనివంక అదోలా చూసి—"మీ స్నేహితుడు రాసిన వుత్తరం చూపిస్తారా?" అనడిగాడు.

"ష్యూర్!" అంటూ జనార్దనరావు అతనికి ఓ ఇన్‌లాండ్ లెటర్ అందించాడు. ఆ వుత్తరంలో జనార్దనరావు చెప్పిన వివరాలన్నీ వున్నాయి. అంతేకాదు. ఆ స్నేహితుడు సతీసమేతంగా వస్తున్నట్లు వుంది.

వెంకన్న ఆ వుత్తరం జనార్దనరావుకు అందించి—"మీ స్నేహితుడు సతీసమేతంగా వస్తున్నాడు. మీరేమో మీ పేరున హోటల్ గది బుక్ చేసి సినిమాకు వెళ్ళారు. ఒకవేళ అతను మధ్యలో వస్తే!" అన్నాడు.

"మధ్యలో ఎవరైనా వస్తే తాళాలిమ్మని రిసెప్షనిస్టుకు చెప్పాను...."

"అలా యెవరైనా వచ్చారేమో అడిగి తెలుసుకున్నారా?"

జనార్దనరావు ఒక్కక్షణం తటపటాయించి—"మీ దగ్గర దాచడమెందుకు వెంకన్నగారూ! నన్ను మొదట్నించే వాచ్ చేస్తున్నట్లున్నారు. ఒక జంట ఈ అవకాశాన్ని చక్కగా వుపయోగించుకొని నేను హోటల్‌కు తిరిగివచ్చేసరికి వెళ్ళిపోయారు...." అన్నాడు.

"అలా ఎందుకనుకోవాలి? వాళ్ళే మీ స్నేతులని యెందుకనుకోకూడదు?" అన్నాడు వెంకన్న.

"నా స్నేహితులైతే నేనొచ్చేవరకూ ఆగేవారు...." అన్నాడు జనార్దరావు.

"అనుకోని అవాంతరం వచ్చిందేమో...."

"అలాంటిది జరిగిన మాట వాస్తవమే. నా గదిలో ప్రవేశించిన యువతి—తన భర్త అస్వస్థతగా వున్నాడని ఓ టాక్సీవాలా సహాయంతో భర్తను తీసుకుని వెళ్ళి పోయిందిట. అతడికి స్పృహ లేదుట. అయినప్పటికీ వాళ్లు నా వాళ్ళే అయుంటే నాకు మెసేజ్ వదిలిపెట్టి వుండే వారు...." అన్నాడు జనార్దనరావు.

"అయితే వాళ్ళను గురించి మీరు పట్టించుకో లేదా?"

"లేదు...."

"మీరు వెళ్ళేసరికి గది ఎలా వుంది?"

"మామూలుగానే వుంది—" అన్నాడు జనార్దన రావు.

"గదిలో ఏ విశేషమూ కనిపించలేదా?"

"లేదు...."

"సరే...." అంటూ వెంకన్న లేచి—"మీ కారణంగా ఏదో పెద్ద నేరం జరుగుతోందని నాకు అనుమానంగా వుంది. నా దృష్టి మీమీద పడిందని గుర్తుంచుకోండి—" అన్నాడు.

"నేనే నేరమూ చేయనప్పుడు మీకు భయపడాల్సిన అవసరం లేదని నాకు తెలుసు...." అన్నాడు జనార్దన రావు. అతడి కళ్ళలో కనబడే నమ్మకం వెంకన్నను చకితుణ్ని చేసింది.

## 8

"హల్లో సురేష్!" అంది దీప.

"హాయ్ దీపా—ఏమిటి విశేషం?" అన్నాడు సురేష్ కుమార్.

"నువ్వే చెప్పాలి....చాలా కాలమైంది....మనం

కలుసుకుని....” అంది దీప.

“అవును....” అన్నాడు సురేష్‌కుమార్.

దీప అతడివంక ఆశ్చర్యంగా చూస్తూ—“అప్పటి కంటే యిప్పుడు యింకా స్మార్టుగా వున్నావు. సినిమా స్టార్సులా వయసుతోపాటు నీకు గ్లామర్ పెరుగుతున్న ట్లుంది....” అంది.

సురేష్‌కుమార్ నవ్వి—“నా అందాన్ని మెచ్చు కున్నావంటే నీకు నామీద కోపం పోయినట్లేగా!” అన్నాడు.

దీప ముఖం అదోలాగైంది—“కోపమా—అది యీ జన్మకు పోదు. నేను నిన్ను నిజంగానే ప్రేమించాను. కానీ నువ్వు నన్ను అమాయకురాల్ని చేసి నా ప్రేమనుంచి పొందవలసింది పొంది—పెళ్ళి చేసుకోమనగానే సారీ చెప్పేశావు....” అంది.

“అదంతా ఎందుకులే-ఇప్పుడు నీకు పెళ్ళయిందిగా....” అన్నాడు సురేష్‌కుమార్.

“ఏం పెళ్ళిలే....మనసొక చోట....మను వొక చోట....” అని నిట్టూర్చింది దీప.

“ఇంతకీ ఈ ఊరెలా వచ్చావ్?”

“మా ఆయనకు డబ్బు పిచ్చి. నాచేత ఉద్యోగాలకు అప్లై చేయిస్తున్నారు. ఈ ఊళ్ళో ఇంటర్వ్యూ....”

“అయితే ఎవరింట్లో దిగావు?”

“చూశావుగా—అవతారం—ఇంకా ఎక్కడా దిగ లేదు. ఇంటర్వ్యూ రేపు....”

“ఇంటర్వ్యూ ఎక్కడ?”

దీప చెప్పింది.

“పోనీ....నువ్వు మా యింటికొచ్చి వుంటావా?”

"ఎందుకుండను?" అంది దీప చటుక్కున.

సురేష్‌కుమార్ కళ్ళు మెరిశాయి—"కానీ...." అని ఆగిపోయాడతను.

"నాకు తెలుసు. నేను మీ ఇంటికి రావడం నీ కిష్టముండదని. ఏదో వంక పెట్టి నేను రాకుండా చేస్తావ్...." అంది దీప.

"అదికాదు దీపా! నన్నపార్థం చేసుకోకు. ముందే చెప్పేస్తున్నాను. మా ఇంట్లో ఇప్పుడెవ్వరూ లేరు. నేనొక్కణ్ణే వున్నాను...."

"అయ్‌సీ....అయితే మరీ మంచింది" అంది దీప ఉత్సాహంగా.

సురేష్‌కుమార్ ఆశ్చర్యంగా "ఆడదానివి. అందులోనూ పెళ్ళైనదానివి. ఒప్పుకుంటావనుకోలేదు" అన్నాడు.

"ఒప్పుకోకపోవడానికి నువ్వు నాకేం కొత్త కాదుగదా! మెళ్ళో తాళి కట్టకపోయినా నాతో ఓ నెల్లాళ్ళు సంసారం చేశావు. ఆ అనుభూతులే ఇప్పటికీ నాకు ఊపిరి పోస్తున్నాయి."

సురేష్‌కుమార్ కళ్ళలో గర్వం కనబడింది "మరి నీ భర్త నిన్నాపార్థం చేసుకోడా?"

"ఉద్యోగం కోసం ఒక్కర్తినీ పొరుగూరికి ఇంటర్వ్యూకు పంపించిన మహానుభావుడాయన. ఆయనకు భయపడాల్సిన అవసరం నాకు లేదు. నువ్వు కనిపించడం నా అదృష్టం అనుకుంటాను. నీకు భార్యను కాగల అదృష్టం నా కెలాగూ కలగలేదు. కనీసం అప్పుడప్పుడైనా మన మిలా కలుసుకోగలిగితే...."

సురేష్‌కుమార్ మనసు, తనువు పులకరించిపోయాయి.

అతను దీపతో కలిసి ఇంటికి వెళ్ళాడు. ఇద్దరికోసం తనే హోటల్ నుంచి క్యారియర్ భోజనం తెచ్చాడు.

"మీ ఇల్లు బాగుంది. అన్నీ కలిసివస్తే ఈ యింటి తాళాలు నా చేతుల్లోనే వుండేవి...."

"అవన్నీ మరిచిపో దీపా! ప్రస్తుతం మనకు భూతం వద్దు, భవిష్యత్తు వద్దు. వర్తమానం ఒక్కటే మన ముందున్నది" అన్నాడు సురేష్‌కుమార్.

"భవిష్యత్తు సంగతి సరే—భూతం నన్ను వదలడం లేదు. నిన్నెలా వదుల్తుందో ఆశ్చర్యంగా వుంది" అంది దీప.

తర్వాత ఇద్దరూ ఒకరి తర్వాత ఒకరు స్నానాలు చేశారు. స్నానానంతరం బట్టలు మార్చుకుని భోజనాలు చేశారు.

దీప తెల్లచీర కట్టుకుంది. తెల్లరవిక వేసుకుంది. జడలో మల్లెపూలు పెట్టుకుంది. ఆమె కళ్ళు మత్తుగా వున్నాయి. ఆమె వళ్ళు మిసమిసలాడుతోంది.

ఆమెనలా చూస్తూంటే సురేష్‌కుమార్‌కు హఠాత్తుగా ప్రభ గుర్తుకువచ్చి భయం వేసింది. అనుకోకుండా అతనామెవంక చూసి "నువ్వు దీపవేకదూ!" అన్నాడు.

"ఇప్పుడిదేం ప్రశ్న?" అంది దీప.

ఎందుకో సురేష్‌కుమార్ శరీరంలో వణుకు ప్రారంభమయింది. అది మదనతాపం పుట్టించిన వణుకుకాదు. పాత అనుభవాలు గుర్తుకొచ్చి కలుగుతున్న వణుకు.

"అదేంటలా వణుకుతున్నావ్ సురేష్?" అంది దీప.

సురేష్‌కుమార్ తేరుకున్నాడు. ప్రభ అయితే తనకు తెలియని అమ్మాయి కాబట్టి కామినీపిశాచి అనుకోవచ్చు. కానీ దీప తనకు తెలిసిన అమ్మాయి. ఆమె కామినీపిశాచి

కావడానికి అవకాశంలేదు. తను అనవసరంగా భయపడు తున్నాడు. అదీగాక ప్రభ అయితే తనను విజయ్ అని పిలిచేది. అది కామినీపిశాచి కిష్టమైన పేరు. దీప తనను సురేష్ అనే పిలుస్తోంది. అతను నెమ్మదిగా ఆమెను సమీపించి దగ్గరగా లాక్కున్నాడు. ఒక్కక్షణంలో కౌగిలి బిగిసింది కానీ వెంటనే దీప అతన్ని విడిపించుకుని "ఇక్కడ కాదు" అంది.

"అంటే?"

"నువ్విలా కూర్చో. కళ్ళు మూసుకో. నేను నిన్ను పిలుస్తాను. నా పిలుపు వినేవరకూ నువ్వు కళ్ళు తెరవ కూడదు. తెలిసిందా" అంటూ అతడి పెదాలను మృదువుగా తన పెదాలతో చుంబించింది.

సురేష్‌కుమార్ తనువు పులకరించింది. అతను కుర్చీలో చతికిలబడి కళ్ళు మూసుకున్నాడు. మెత్తని అడుగుల చప్పుడు అతనికి క్రమంగా దూరమైంది. కొద్దిసేపటికి "సురేష్ త్వరగా రా" అని పిలుపు వినిపించింది. ఆ పిలుపు పడకగదిలోంచి వస్తోంది.

సురేష్‌కుమార్ ఉత్సాహంగా లేచాడు. రెండు అంగల్లో బెడ్రూం సమీపించి గుమ్మం దగ్గర ఆగి పోయాడు.

మంచంమీద దీప ప్రవరాఖ్యుల్ని కూడా రెచ్చగొట్టే పద్ధతిలో పడుకుని వుంది.

సురేష్‌కుమార్ గదిలోకి ఉత్సాహంగా ముందడుగు వేసి ఆగిపోయాడు. ఛటుక్కున గదిలో దీపం ఆరి పోయింది.

"వాటీజ్ దిస్ దీపా!" అన్నాడతను చిరాగ్గా.

"నేను కోరేది చీకటి. నా చీకటికి వెలుగునివ్వాల్సింది

దీపం కాదు నువ్వు. త్వరగా రా సురేష్!" అంది దీప.

సురేష్‌కుమార్ తడుముకుంటూ నెమ్మదిగా మంచాన్ని సమీపించాడు. మంచం చేతికి అందగానే దీప కోసం తడి మాడు. అతడి చేతికి ఆమె కాలు తగిలింది.

"నీ స్పర్శకు నా వళ్ళు పులకరిస్తోంది విజయ్!" అందామె.

విజయ్ అన్న పిలుపు వినడంతోనే సురేష్‌కుమార్ శరీరం ఒక్కసారిగా చల్లబడిపోయింది. అప్పుడే సరిగ్గా గదిలో దీపం వెలిగింది.

సురేష్‌కుమార్ కళ్ళు మూసుకున్నాడు.

మంచం మీద దీపలేదు. కామినీపిశాచి వుంది.

'కెవ్వు'మని అరిచి వెనుతిరిగాడతను. కానీ ప్రయోజనంలేదు. తలుపులు వేసివున్నాయి. ఈలోగా కామినీ పిశాచి అతణ్ణి అందుకోనే అందుకుంది.

"ప్లీజ్. వద్దు. నేనది భరించలేను. నన్ను వదిలిపెట్టు" దీనంగా రెండు చేతులూ జోడించి వేడుకున్నాడతడామెను.

అందవికారమైన ముఖంతో అత్యంత భయంకరంగా నవ్విందామె. అతణ్ణి బలంగా దగ్గరగా తీసుకుని పెనుగులాడుతున్న అతడి చేతుల్ని నొక్కిపట్టి అతడి ముఖం మీద ముద్దులు కురిపిస్తోందామె.

"హే భగవాన్-ఏమిటి నాకీ శిక్ష!" అంటూ వాపోయాడు సురేష్‌కుమార్.

కామినీ పిశాచి బారినుంచి భగవంతుడుకూడా అతన్ని రక్షించలేదు.

# 9

"వెంకన్నగారూ-దాన్ని పట్టుకోవడం మీవల్ల కాదు" అన్నాడు సురేష్‌కుమార్. అతడి ముఖం పాలిపోయి వుంది. మనిషి నిస్త్రాణగా వున్నాడు.

"నీ సంగతే నీకు తెలియదు. నా సంగతి నీకేం తెలుస్తుంది?" అన్నాడు వెంకన్న.

"నా సంగతి నాకు తెలియదని కూడా ఒప్పుకోక తప్పదు. అది నిన్న స్వయంగా నా ఇంటికే వచ్చి నన్ను రేప్ చేసింది" అన్నాడు సురేష్‌కుమార్.

వెంకన్న ఆశ్చర్యంగా "జరిగిందేమిటో వివరంగా చెప్పు" అన్నాడు.

"ఆ వివరాలన్నీ చెప్పాలంటే అదంతా మళ్ళీ నేను గుర్తు చేసుకోవాలి. ఆ పని చేయలేను. అదొక అత్యంత భయంకరమైన అనుభవం" అన్నాడు సురేష్‌కుమార్.

"అలా అంటే నాకు కథ ఎలా తెలుస్తుందీ!" అన్నాడు వెంకన్న.

"ఆ కామినీపిశాచి ఓ బంగళాలో వుంటుందేమోననుకున్నాను. కానీ అది మెజస్టిక్ హోటల్లో వెలసింది. ఆఖరికి నిన్న నా ఇంట్లో కూడా వెలసింది. అది రాలేని చోటులేదు" అన్నాడు సురేష్‌కుమార్.

"అసలది నీ యింట్లోకెలా వచ్చింది?"

"అది ధరించగల రూపం ప్రభది మాత్రమే అనుకున్నాను. ఆ వేషంలో అది నన్ను రెండుసార్లు మోసం చేసింది. ఇంక ప్రలోభపడననుకుందో ఏమో-ఈ సారి అది వేషం మార్చి దీప అనే నా పాత స్నేహితురాలి వేషంలో వచ్చింది. అది యిన్ని వేషాలు మార్చగలదని నాకేం తెలుసు? నిజంగా దీపే అనుకుని మా యింటికి తీసు

కెళ్ళాను."

"దీప ఎవరు?"

దీప గురించి చెప్పాడు సురేష్‌కుమార్. అదంతా విని "అయినా నీకిదేం బుద్ధయ్యా-కామినీపిశాచి నీ మీద పగ బట్టిందని తెలిసి కూడా, రెండనుభవాలయ్యాండి కూడా ఇంకా ఆడపిల్ల కనబడగానే కక్కుర్తి పడతావ్!" అన్నాడు వెంకన్న.

"బుద్ధి వచ్చిందండీ - ఇప్పుడు నా భార్య పుట్టింట్నించి తిరిగొచ్చినా ముట్టుకోవాలంటో భయమేసేలా వుంది. ఆ కామినీపిశాచి యెవరో నా మీద యింతలా ఎందుకు పగబట్టిందో నాకు అర్థం కాకుండా వుంది" అన్నాడు సురేష్‌కుమార్.

"నువ్వు నాకో రెండొందల రూపాయలు ఫీజుగా యిచ్చుకుంటే నీకో చిన్న క్లూ యివ్వగలను" అన్నాడు వెంకన్న.

"క్లూ అంటే!"

"కామినీపిశాచి నిన్నెందుకు పట్టుకుందో నాకు తెలియదు. కానీ నీకు తెలుసుకునే అవకాశం వుంది. అది నీకు కలిగించేదే నా క్లూ" అన్నాడు వెంకన్న.

సురేష్‌కుమార్ జేబులోంచి పర్సుతీసి డబ్బు లెక్క పెట్టాడు. అందులో మూడొందల యాభై చిల్లర వుంది. అందులోంచి రెండొందలు తీసి వెంకన్న కిచ్చి "ఆ క్లూ ఏమిటో చెప్పండి!" అన్నాడు.

"నిన్ను మెట్టమొదట కామినీపిశాచి ఏ బంగళాలో అయితే బలవంతం చేసిందో ఆ బంగళాను కొద్దికాలం క్రితమే జనార్దనరావు అనే అతను కొనుక్కున్నాడు. జనార్దనరావు నీకు తెలుసా?"

"జనార్దనరావా?" అన్నాడు ఆశ్చర్యంగా సురేష్ కుమార్.

"నువ్వు మెజస్టిక్ హోటల్లో ఏ గదిలో వున్నావో ఆ రోజున ఆ సమయానికి ఆ గది జనార్దనరావు పేరున బుక్ చేయబడింది" అన్నాడు వెంకన్న మళ్ళీ.

"ఏమిటి మీర నేది?" అన్నాడు సురేష్‌కుమార్ కళ్ళు పెద్దవి చేసి.

"జనార్దనరావుకీ నీకూ ఏమిటి సంబంధమో తెలియదు. ఇప్పుడతని యింటికి ఫోన్ చేసి దీప అనే అమ్మాయక్కడ ఉందేమో అడిగి తెలుసుకో" అన్నాడు వెంకన్న.

సురేష్‌కుమార్ వెంకన్నను అడిగి ఫోన్ నంబర్ నోట్ చేసుకుని___నెంబర్ డయల్ చేయబోయాడు.

"ఫోన్‌కి అర్ధరూపాయి ఛార్జి" అంది సీతమ్మ చటుక్కున.

సురేష్‌కుమార్ పర్సులోంచి డబ్బుతీసి సీతమ్మకిచ్చి "మీ కస్టమర్సుని మీరు ట్రీట్ చేసే పద్ధతి యిదేనా?" అన్నాడు.

"పరాయి ఆడపిల్లని గదికి తీసుకెళ్ళి కష్టాలు కొని తెచ్చుకుని సాయం అడగడానికి వచ్చిన కస్టమర్సుకి ఇక్కడ ట్రీట్‌మెంట్ యిలాగే వుంటుంది" అంది సీతమ్మ.

సురేష్‌కుమార్ ఆమె మాటలు పట్టించుకోకుండా జనార్దనరావుకి ఫోన్ చేశాడు.

"హలో!" అంది అవతలనుంచి ఒక స్త్రీ కంఠస్వరం.

"మీ పేరు తెలుసుకోవచ్చా!" అడిగాడు సురేష్ కుమార్.

"నా పేరు దీప" అందవతలి కంఠస్వరం.

సురేష్‌కుమార్ చేతిలోంచి ఫోన్ జారిపోయింది. అతను వున్నవాడున్నట్లుగా నేలమీద కూలబడ్డాడు.

వెంకన్న కంగారుగా "ఏమయింది?" అన్నాడు.

"జనార్దనరావుకి ఫోన్ చేస్తే దీప పలికింది" అన్నాడు సురేష్‌కుమార్ నీరసంగా.

"వాట్!" అంటూ కుర్చీలోంచి యెగిరిపడ్డాడు వెంకన్న. తన ఊహ మరీ ఇంత పచ్చినిజమైతీరుతుందని అనుకోలేదు "అయితే యిప్పుడే మనమిద్దరం అతడింటికి వెడదాం...."

"వద్దుసార్! జనార్దనరావింటికి నేనే స్వయంగా వెడతాను. అతను నాకు తెలుసు. కానీ యిందులో అతడి ప్రమేయమేమీ వుంటుందని నేననుకోవడంలేదు. కామినీ పిశాచి మానవతీతాశక్తి అన్న విషయం నేను అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను" అంటూ సురేష్‌కుమార్ లేచి నిలబడి "వస్తాను సార్. మళ్ళీ మీ ఇంటికి రావాల్సిన అవసరం లేకుండా చేసుకుందుకు ప్రయత్నిస్తాను...." అన్నాడు.

## 10

"ఆ దరిద్రుణ్ని చూడాలని వచ్చాను" అన్నాడు వెంకన్న.

"ఇక్కడ చాలామంది దరిద్రులున్నారు. వాళ్ళలో ఏ దరిద్రుడో చెప్పు" అన్నాడు శంకర్రావు.

"చంద్రరాజు!" అన్నాడు వెంకన్న.

"వాడా.... వాణ్నిప్పుడే బెయిల్ మీద విడిపించుకుని తీసుకెళ్ళారు!"

"చంద్రరాజుకు బెయిలా?" కోపంగా అన్నాడు వెంకన్న.

"నిన్నింత కోపంగా ఎప్పుడూ చూడలేదు. చంద్ర రాజు కేమిటి? అంతకంటె పెద్ద పెద్ద ఘోరాలు చేసిన వాళ్ళకే బెయిల్ ఇస్తున్నాం" అన్నాడు శంకర్రావు.

"చంద్రరాజు చేసిన ఘోరానికీ మిగతా ఘోరాలకీ పోలికుండదు. వాడి ఘోరాన్ని భగవంతుడు క్షమించినా నేను మాత్రం క్షమించలేను" అన్నాడు వెంకన్న.

"మరీ ఇంతలా ఆవేశ పడుతున్నావేమిటీ వేళ?" అన్నాడు శంకర్రావు ఆశ్చర్యంగా.

"నా బాధ నీ కర్థంకాదులే...." అని కళ్ళు తుడుచుకున్నాడు వెంకన్న "ఇంతకీ ఆ దరిద్రుణ్ని బెయిల్ మీద విడిపించి తీసుకెళ్ళిన నీచు డెవరు?"

"ఈ రోజు నీ నోటి దురుసు మరీ ఎక్కువగా వుంది. కాస్త జాగ్రత్తగా మాటలు వాడకపోతే నీ మీద ఎవరైనా పరువునష్టం దావా వేయగలరు. చంద్రరాజును విడిపించిన వాడు నీచుడుకాదు. అతను నీక్కూడా తెలుసు. అతని పేరు జనార్దనరావు. కావాలంటే అతడింటికి వెళ్ళి మిగతా వివరాలు తెలుసుకో" అన్నాడు ఇన్ స్పెక్టర్ శంకర్రావు.

"జనార్దనరావా?" ఉలిక్కిపడ్డాడు వెంకన్న. అతడి ఆలోచనలు పరిపరివిధాల పోయాయి.

ఈ జనార్దనరావుకి నేరసులతో పని ఏమిటి? సురేష్ కుమార్ పైన అతనెందుకు పగబట్టాడు? అతనసల ఇంకా ఎలాంటి నేరాలు చేస్తున్నాడు?

"జనార్దనరావు అంతు చూడాలి. అతని కథ ఈ రోజుతో పూర్తిగా తేల్చేయాలి" అనుకున్నాడు వెంకన్న. అలా అనుకుని అతను టైం చూసుకున్నాడు. రాత్రి ఎనిమిదిన్నర అయింది.

ఇన్‌స్పెక్టర్ శంకర్రావు దగ్గర సెలవు తీసుకుని వెంకన్న కారులో తిన్నగా జనార్దనరావు యింటికి బయ ల్దేరాడు. అతడి కారు జనార్దనరావు బంగళా ముందు ఆగింది.

కారు ఆగగానే ప్రహరీ గేటు తెరుచుంది. గేటు తీసిన వ్యక్తి జనార్దనరావు!

జనార్దనరావు వెంకన్నవంక ఆశ్చర్యంగా చూసి "ఈ సమయంలో మీ రిక్కడకు వస్తారనుకోలేదు!" అన్నాడు. మనిషి కాస్త తడబాటు చూపిస్తున్నాడు.

"మీతో అర్జంటుగా మాట్లాడాలి. లోపలకు వెడ దామా" అన్నాడు వెంకన్న కారు దిగి.

"ఇలా ఇక్కడ లాన్‌లో కూర్చుని మాట్లాడుకుందాం" అన్నాడు జనార్దనరావు.

ఇద్దరూ లాన్‌లో కూర్చున్నాక "చంద్రరాజుతో మీకు పనేమిటి?" అన్నా వెంకన్న.

"చంద్రరాజా.... వాడు మీకెలా తెలుసు?"

చంద్రరాజు పైన తనకెంత కసి పేరుకుపోయి వుందో వెంకన్న జనార్దనరావుకు చెప్పి "అలాంటివాణ్ని బెయిల్ మీద విడిపించిన మీపై నాకు సదభిప్రాయంలేదు" అన్నాడు.

జనార్దనరావు చటుక్కున లేచి నిలబడి "పదండి మీకు నేను చంద్రరాజును చూపిస్తాను" అన్నాడు. వెంకన్న లేచి నిలబడగానే "చంద్రరాజు కనబడగానే మీరేం చేయాలనుకుంటున్నారు?" అనడిగాడు.

"నోటితో చెప్పడమెందుకు? మీరే చూద్దురుగాని" అన్నాడు వెంకన్న.

వెంకన్న, జనార్దనరావు ఇంట్లోకి నడిచాడు. ఆ ఇల్లు, ఆ సమయం హఠాత్తుగా వెంకన్నకు ఏదో స్ఫురణకు

తెచ్చాయి. కొంపతీసి తను కూడా సురేష్‌కుమార్‌లాగే...
ఈ ఇంట్లో ...కోరి చిక్కుల్ని ఆహ్వానించడంలేదు కదా!
వెంకన్నకు ఒక్కసారి వళ్ళు జలదరించింది. అతను జనా
ర్దనరావు వంక చూశాడు.

అతను తాపీగా అడుగులు వేస్తూ ఓ గదిని సమీపించి
డోర్‌వ్యూ మిర్రర్‌లోకి చూసి "మీరు కూడా చూడండి
వెంకన్నగారూ!" అన్నాడు.

వెంకన్న కుతూహలంగా అందులోకి చూశాడు.
అంతే....అతడికి నోట మాటరాలేదు....

సురేష్‌కుమార్ వర్ణించగా ఏమో అనుకున్నాడు కానీ
ఆ వర్ణనలకు మించి భయంకరంగా వుంది కామినీపిశాచి.
ఆమె ఓ యువకుణ్ని తరుముతోంది. అతడామె బాహు
బంధాలనుంచి తప్పించుకోవడం కోసం గదిలో విఫల
యత్నాలు చేస్తూ పరుగులు తీస్తున్నాడు.

"వాడే చంద్రరాజు!" అన్నాడు జనార్దనరావు
తాపీగా.

"ఏమిటిది?" అన్నాడు వెంకన్న అతికష్టం మీద.

"గదిలో చంద్రరాజును వేటాడుతున్నది మనిషే
కానీ పిశాచం కాదు. ఒకప్పుడు ఆమె కూడా అందరు
ఆడవాళ్ళకులాగే అందంగా వుండేది. ఒక అగ్నిప్రమా
దంలో ఆమె ఈ భయంకర రూపాన్ని సంపాదించుకుంది.
ఈ రూపంతో ఎలా జీవించడమో అని వ్యధపడుతున్న
ఆమెను నేను చేరదీసి ఆమె జీవితానికి ఓ అర్థం కల్పిం
చాను. అదేమిటంటే...."అని జనార్దనరావు క్షణంఆగి—

"వెంకన్నగారూ! భగవంతుడు ఆడదాన్ని అబలగా
సృష్టించాడు. కానీ ఆడదిలేని ఈ సృష్టికి ఉనికి ఎక్కడిది?
అటువంటి ఆడదానిపై పశుబలంతో అత్యాచారం కావిం

చడంకన్న ఘోరముంటుందా? ఇష్టంలేని పురుషుణ్ని బల వంతంగా భరించవలసి వచ్చినందుకు జీవితమంటే వెగటు పుట్టి తన ప్రాణాలు తీసుకుంది రాధ. రాధ చావుకు కారకుడు సురేష్‌కుమార్.

నేను జరిగింది తెలిసి ఫరవాలేదని ధైర్యం చెప్పినా కూడా రాధ వినకుండా తన ప్రాణాలు తీసుకుంది. బల వంతంగా అనుభవించబడడంలో ఒక ఆడది పడే బాధ యెలాంటిదో మగాడికెక్కడా తెలియాలిగదా! అందుకే నేను ఆ గదిలో వున్న ఆడమనిషిని కామినీపిశాచిగా తయారుచేశాను. ఆమెను చేరబోయే పురుషుడు ముందు గానే శక్తిహీనుడయ్యే విధంగా భోజనంలో మత్తుపదా ర్థాలు కలిపిస్తున్నాను. ఆ శక్తిహీనుణ్ని నా కామినీపిశాచి బలవంతం చేస్తూంటే నేను చూసి ఆనందిస్తున్నాను. సురేష్ కుమార్‌ను వెంటాడి వేటాడి అతనికి ఆడపిల్లలంటే భయం పుట్టేలా చేశాను. అతను నా దగ్గరకు వచ్చాడు. కామినీపిశాచిని గురించిన నిజాన్ని మాత్రం నే నతనికి చెప్పలేదు. అతడూహించుకుని వుంటే వేరే సంగతి. కామినీపిశాని నా దగ్గరకు కూడా వచ్చిందనీ—నాకు ఆడ వాళ్ళంటే ప్రలోభం లేకపోవడంవల్ల అది నన్నేమీ చేయలేదనీ అతడికి చెప్పాను.

ఇప్పుడు చంద్రరాజు విషయంలోనూ అంతే! వాడు మీ పెద్దనాన్నగారి అమ్మాయిని బలవంతం చేశాడు. ఆమె ఆత్మహత్య చేసుకుంది. ఆ ఆవేదనలో వాణ్ని బాదాలని మీరుత్సుకతపడుతున్నారు. నాకు తెలుసు మీ రెంతగా తన్నితేమాత్రం — ఇష్టంలేని మగాడిచేత ఒక ఆడది బలవంతం చేయబడడంలో ఉండే బాధ ఎలా తెలుస్తుంది వాడికి? చంద్రరాజే కాదు....ఆడదానిపై

అత్యాచారం చేసిన ప్రతి మగ వెధవపైన నేను ఆ కామినీ పిశాచిని వదిలిపెడతాను. అలాంటివాళ్ళ కోసం పరశు రాముడిలా దేశమంతా గాలిస్తూనే వుంటాను" అన్నాడు.

ఈ కథ విని వెంకన్న అదిరిపోయాడు. అతడి ఆవేశం అణగారిపోయింది. అతను చటుక్కున జనార్దనరావు చేతులు పట్టుకుని "నేను హింసను భరించలేను. దారుణంగా హత్యలు చేసిన వాళ్ళను కూడా ఏ మాత్రం వీలున్నా క్షమించి వదిలిపెట్టాలనే మన సత్వం నాది. అయినప్పటికీ కూడా నేను మిమ్మల్నీ, మీ శిక్షనూ అభినందిస్తున్నాను. మీరు చేసేది తప్పు కాదు. మీరు పరశురాముడై సురేష్‌కుమార్, చంద్రరాజులాంటి వాళ్ళను వెతికి పట్టుకుని ఈ విధమైన వైద్యం చేయించి పంపండి. అదే మీరు మీ రాధకు చేయగలిగిన సేవ" అన్నాడు.

"వెంకన్నగారూ!" అన్నాడు జనార్దనరావు ఆశ్చర్యంగా "మీరు నా ఈ చర్యను ఆమోదిస్తున్నారా?"

"తప్పకుండా!....ఇంతకాలం మీరు ప్రభ, దీప.... వగైరా అమ్మాయిల సాయం తీసుకుని మీ దీక్ష కొనసాగిస్తున్నారు. మీకు సాయపడడానికిప్పుడొక డిటెక్టివ్ కూడా వున్నాడు. చంద్రరాజు అనుభవిస్తున్న శిక్ష నా మనసును తేలిక చేసింది. వాడు చేసిన ఘోరం వాడికి అర్థం కావడానికింతకు మించిన ఉపాయంలేదు. ఎటొచ్చీ ఈ విషయానికి ప్రచారం కూడా వుంటే కానీ దుర్మార్గులలో భయం పుట్టదు. కామినీపిశాచి గురించి నలుగురికీ తెలిసేలా నేను చేయగలను. అలాగే నీ పేరు మరుగున వుండేలా చూడగలను...." అన్నాడు వెంకన్న.

వెంకన్న దృష్టిలో 'అసన' పత్రిక మెరుస్తోంది.

—:ఐపోయింది:—

# చావు చెప్పి రాదు!

## సికిందర్

గాయత్రి గ్లాసులోని ద్రవం ఒక్క గుక్క తాగి, అందర్నీ మింగేసేలా చూసింది: "స్టుపిడ్స్! మీరింకా సి క్లాస్ సినిమాల్లో విలన్స్‌లా మొహాలు పెడతారేమిట్రా! పచ్చిమాటల్లో విడదీసి చేస్తేగాని అర్థమై చావదా? స్కౌండ్రల్స్!"

"అలా బెదిరించకు, ఆంటీ! ఏమిటి నువ్వు చెప్పేది?" కుమార్ అడిగాడు.

గాయత్రి మూతి తుడుచుకొని అందర్నీ తీక్షణంగా చూసింది.

"లోకేష్ ఇప్పుడు అవసరాల్ని గుర్తిస్తున్నాడు. వాడికి పెళ్ళి కావాలట!" అని మరోసారి తీక్షణపు చూపులు విసిరి అంది, "వాడికిప్పుడు పాతికేళ్ళు. వాడికి కోరికలు కలగడం ఆలస్యంగా జరిగింది....ఎప్పుడైనా వాడు ఆడవాళ్ళ గురించి మాట్లాడగా విన్నారా?"

"లేదు, ఆంటీ....మహాసిగ్గరి!" అన్నాడు వెంకట్.

"పటప్! వాడు బుద్ధిమంతుడు! ఆడవాళ్ళని కన్నెత్తి చూడడు!"

"అసలు గది కదలనిదే ఎలా చూస్తాడు, ఆంటీ?" మళ్ళీ అన్నాడు వెంకట్.

గాయత్రి రెచ్చిపోయి పిడికిళ్ళతో టేబిల్ మీద బాదింది.

"ఒరేయ్, వెంకట్! ఈ సారి నీ వీపు వాయిస్తాను! నోర్మూసుకొని చెప్పేది శ్రద్ధగా విను! మనం ముఠాకట్టి అయిదేళ్ళు గడిచాయి. లోకేష్‌తో మీ సాంగత్యం నా కంటే చాలా తక్కువ! పాతికేళ్ళు వాడికి నేను సభ్యత, సంస్కారం నేర్పాను! వాడి మంచితనాన్ని గెలిచే స్తే వూరుకోను! సరే, ఇవాళ వాడు పెళ్ళి కావాలని కోరాడు. వాడి పెళ్ళి ఆలోచన నా కెప్పుడో వచ్చింది. కానీ ఎవర్ని చూడాలో తోచలేదు.... దొంగలరాణి కొడుక్కి పెళ్ళి ఏమిటని ఆశ్చర్యపోతున్నారా? వాడికి మీలాగా వూరిమీదపడి ఖుషీ చేసుకొనే బుద్ధి లేదు! పెళ్ళిచేసుకొని పవిత్రంగా బ్రతకాలనుకుంటున్నాడు.... నేనూ కోరుకునేది అదే! యూసీ?"

"అయితే ఎవర్ని చూశావు, ఆంటీ?" కుమార్ అడిగాడు.

"నేను చూడలేదు!" అంటూ గాయత్రి సొరుగు లోంచి 'వనిత' మాసపత్రిక తీసి ముఖచిత్రం అందరికీ చూపించింది, "ఈమెను లోకేష్ చూశాడు."

అందరూ వూపిరి బిగబట్టి కళ్ళు తేలవేశారు.

"ఏమిటలా చూస్తారు? లోకేష్ ఈమెను చేసు కుంటాడు! ఆ ఏర్పాట్లు మనం చెయ్యాలి!" గాయత్రి అర్చింది.

"ఆంటీ! పిచ్చెక్కింది వాడికా? నీకా?" అంతవరకూ మౌనంగా గమనిస్తున్న బాక్సర్ అన్నాడు నవ్వుతూ.

గాయత్రి ఎర్రబడ్డ కళ్ళతో క్రూరంగా చూసింది.

"బాక్సర్! చివరి వార్నింగ్—నీ నోటిని హద్దుల్లో పెట్టకపోతే నాలిక చీరేస్తాను! బాస్టర్డ్స్! మళ్ళీ జాగ్రత్తగా వినండి! ఈ పుస్తకం మీద బొమ్మ ఎవరిదో మీకు తెలుసు! సరోజ! సిటీలో గొప్ప సంఘ సేవకురాలు! విమన్స్ లిబ్—తెలుసా? దానికి నాయకురాలు! అంతే గాక అనాధల పాలిట దేవత! చిత్రమేమిటంటే ఆమెకు మగాళ్ళంటే తెగని అసహ్యం-జుగుప్స! ఆడవాళ్ళ మీద జరిగే అత్యాచారాల్ని తీవ్రంగా ప్రతిఘటిస్తుంది. వాళ్ళ సమస్యల్ని చక్కగా పరిష్కరిస్తుంది. స్త్రీ స్వాతంత్ర్యం మీద యెన్నో వ్యాసాలు గీసింది, వుపన్యాసాలు దంచింది...."

గాయత్రి క్షణం ఆగి మళ్ళీ అంది:

"ఆమె ఆశయాల్ని నేను హర్షిస్తాను, గౌరవిస్తాను. కానీ ప్రకృతి విధించిన నియమాలతో జీవితంలో రాజీ పడాలని ఆమె గుర్తించడంలేదు! గుర్తించినా ఖాతరు చేయడంలేదు! పాతికేళ్ళొచ్చినా పెళ్ళీ పెటాకులూ లేకుండా తిరుగుతోంది....అసలు పెళ్ళే చేసుకోను అంటోంది.

"బాయ్స్! అవన్నీ మనకనవసరం. ఆమె ఆశయాలతో, అభిప్రాయాలతో మనకు పనిలేదు. దోచుకోవడం మన వృత్తి. కనుక లోకేష్ కోసం ఎంతటి అసాధ్యాలైనా ఈ అందాల రాశిని మనం ఎత్తుకొచ్చేయాలి. అందు కేర్పాట్లు...."

"ఆంటీ, ఇంతవరకు మనం దోచుకుంది లక్షాధికారుల

ఆస్తులన్నా గాని, అమ్మాయిల్ని కాదు! ఆ నీచపు పనికి నువ్వెప్పుడూ ఒప్పుకోలేదు!" అన్నాడు కుమార్.

"పెళ్ళి చేసుకోవడం నీచమట్రా, యూ ఫూల్! లోకేష్ కోరితే కొండమీద కోతినేకాదు—సముద్రం అడుగున నాచునీ తెప్పిస్తాను! అడ్డు చెప్పేవాడికిక్కడ గడ్డిలేదు, గెటవుట్!"

"కానీ ఆంటీ, నీ కొడుకు మోజుపడుతున్నాడని నువ్విలా మూర్ఖంగా ప్రవర్తిస్తే ఎలా! సరోజ గురించి నీకు తెలుసు—నిప్పులాంటిది. ముట్టుకుంటే చేతులు కాలుతాయి! సంవత్సరం క్రితం ఆమెను కిడ్నాప్ చేసిన వాళ్ళకేగతి పట్టిందో నీకు తెలుసు—జైల్లో మూల్గుతున్నారు!"

గాయత్రి నవ్వింది, "నాకు తెలుసు. ఇతరులు చేసే పొరపాట్ల నుంచి మనం లోపాలు సవరించుకోవాలి. గాయత్రీదేవికి గ్లామర్ లేకపోవచ్చు కానీ, బ్రెయిన్ వుంది, గట్స్ వున్నాయి. నా కొడుకు సుఖంకోసం ప్రాణాలైనా అర్పించగలను!"

"ఆంటీ, నీకు మతిచెడింది!" బాక్సర్ అరిచాడు, "నీ కెలా నచ్చజెప్పాలి? సరోజ ఎవరు! లక్షాధికారి కూతురు! పబ్లిక్ ఫిగర్! నీ కొండముచ్చు కొడుక్కి ఆమెని ముట్టుకొనే ధైర్యం, అర్హత లేవు! బొమ్మను చూసి పడే ఆరాటం మనిషిని చూస్తే వుండదు! నేనూ సినీ యాక్టర్ల గురించి ఏవేవో వూహించుకుంటాను. కానీ నా స్థానం? నా మాట విను ఆంటీ! మన మంచికోసం చెపుతున్నాను. నీ మనసు నుంచి సరోజ గురించి ఆలోచన తీసేయ్! ఆమె మాయమైన క్షణాన పోలీసులు రంగంలో దూకుతారు! పైగా పెళ్ళిని అసహ్యించుకునే అమ్మాయిని తెస్తే ఏ

అఘాయిత్యమైనా చేసుకోవచ్చు! జీవితాంతం జైల్లో మగ్గిపోతాం! ఆలోచించు, ఆంటీ! నీ వాడికి నచ్చజెప్పు!"

గాయత్రి పులిలా లేచింది.

"స్టాపిట్! నేనింకేమీ ఆలోచించేదిలేదు! వాడికి నచ్చచెప్పేదీలేదు! చిన్నప్పటినుంచీ వాడు కోరిన బొమ్మలు కొనివ్వడం నా అలవాటు."

"సరే—మేమే వాడికి నచ్చజెప్తాం. పదండి!" అన్నాడు సింగ్.

గాయత్రి అసహనంగా చూసింది.

ఆమె అనుచరులు నలుగురూ ఒకరి వెంట ఒకరు మేడ మెట్లెక్కసాగారు. పైకి చేరుకుని ఒక గదిముందాగారు. సింగ్ తలుపుమీద కొట్టాడు.

"లోకేష్! తలుపు తెరువ్!"

సమాధానంలేదు.

సింగ్ మళ్ళీ అరిచాడు: "లోకేష్ తలుపు—"

లోపలి నుంచి విచిత్రమైన అరుపు వినిపించింది.

నలుగురూ బెదిరారు.

"తలుపు తెరువ్, లోకేష్"! వెంకట్ ధైర్యం చేసుకొని అడిగాడు.

"దేనికీ!"

"నీతో మాట్లాడాలి."

"ఏం మాట్లాడాలీ అంటాను!"

"నీ పెళ్ళి గురించి—ఆ అమ్మాయి—"

"ఆమె నెప్పుడెత్తుకొస్తున్నారు?"

"ఆ పని చెయ్యడంలేదు. నువ్వామెని మర్చిపోవాలి!"

"దేనికీ!"

"ఆమె మగాళ్ళను సహించదు! ఇక్కడికి తెస్తే

ఛస్తుంది!"

"నీను మరో మంచి భార్యను తెస్తాం!" అన్నాడు సింగ్.

"సరోజ మంచిదికాదు! ఆమెది తిరిగేకాలు-నీ దగ్గర వుండదు!" బాక్సర్ నచ్చజెప్పాడు.

ఇంతలో ఛటుక్కున తలుపు తెరుచుకుంది.

"రాస్కెల్స్! మీ ఆడంగి చాడీ లెవరికి చెప్తున్నారో తెలుసా?" అన్న మాటలతో ఒక స్టూలు విసురుగా బయటికొచ్చింది.

సింగ్, వెంకట్, కుమారులు గభాల్న ప్రక్కకు తప్పుకున్నారు—కానీ మందమతి బాక్సర్ ముఖానికి అది వచ్చి ఫెడీమని తగిలింది.

## 2

శ్రీమతి గిరిజారామకృష్ణ బాల్కనీలో క్రిందకు వంగి కారు దిగి వస్తోన్న కూతురు సరోజను చూసి భారంగా నిట్టూర్చింది.

ఆమెను చూసినప్పుడల్లా గుండెల్లో అలజడి రేగుతుంది. మనసు కల్లోలమవుతుంది. నరాలు బిగదీసుకుపోయి తీవ్రమైన ఉద్రిక్తత, అశాంతికి లోనవుతుంది.

మూఖరాలు! కసురుకుందామె. దీనికీ జన్మకి బుధి రాదు! మగవాళ్ళు నయం! ఎన్ని సమస్యలున్నా పెళ్ళి చేసుకొని ఇతర కలాపాల్లో పొల్గొంటారు. దీని తత్వం ఇలా ఎందుకు తగలడింది?

ఆమె రెండు చేతుల్లో తలపట్టుకొని కళ్ళు మూసుకుంది.

ఆమె కుమార్తె సరోజ గౌండర్ ముఠా చేతుల్లోంచి క్షేమంగా బయటపడి సంవత్సరం పైగానే అయింది.

•కానీ ఆ సంఘటన గురించి మేనేజర్ రావ్ ఆమెకు ఏ మాత్రం తెలియనివ్వలేదు! దాని గురించి తల్లీ కూతుళ్ళిరువురికీ తెలిసివుంటే ఎంతో చెప్పరాని అఘాయిత్యం జరిగివుండేది!

సరోజ తల్లిది బలహీనమైన గుండె—గుండె జబ్బువుంది. రెండుసార్లు స్ట్రోక్స్ నుంచి బయటపడింది. తీవ్రమైన వార్తలకి అది తట్టుకోజాలదు!

ఇక సరోజ పరిస్థితి చాలా సున్నితమైనది: ఆమెను అపఖ్యాతిపాలు చేసే ఏ చిన్న పరిస్థితిలో ఇరుక్కున్నా అవమానభారంతో ముందు ఆత్మాహుతి చేసుకుంటుంది!

ఇవన్నీ తెలిసిన రావ్ ఎంతో చాకచక్యంగా ఆ కిడ్నాప్ వ్యవహారం వెల్లడిగాకుండా దుర్మార్గుల్ని శిక్షించాడు! ఆ తర్వాత మళ్ళీ సరోజ అపాయంలో ఇరుక్కోకుండా రక్షణ ఏర్పాట్లు ప్రారంభించాడు. కానీ, సరోజ లక్ష్యపెట్టేరకం కాదు. అతని చాదస్తాలకి తిట్టి కోప్పడింది.

రావ్ విసిగిపోయి ఆమెని పట్టించుకోవడం తగ్గించినా ఆమె రక్షణగురించి డ్రైవర్ స్వామికి హెచ్చరికలు చేస్తునే వున్నాడు. అతనికి లోలోన ఎంత బెరుగ్గావున్నా, ఈ సంవత్సరమంతా క్షేమంగానే గడించింది.

ఆయా అనిత బాల్కనీలోకొచ్చి, "అమ్మాయిగారొచ్చారు, భోజనానికి రారా?" అంది.

గిరిజ తేరుకొని, "దొరసాని ఏ మీటింగ్ కెళ్ళిందట?" అనడిగింది.

---

• ఏప్రిల్ '79—'బాడీగార్డ్' చూడండి.

"నేనడగలేదు—నేనంటే ఆమె కసహ్యం!" అంది అనిత.

గిరిజ తలూపింది. "అవును. బయట దిక్కులేని వాళ్ళ మీద వున్న ప్రేమ నీమీద లేదు. నువ్వంటే దానికసహ్యం, కసి. ఇంటి మనుషులమీద పగ. మరి నీ కేమైంది? దాని ఛీత్కారాల్ని సహిస్తూ రేపో మాపో పోయేదాన్ని నా కోసం నీ భవిష్యత్తు నెందుకు త్యాగం చేస్తున్నావు? పెళ్ళి చేసుకోవా?"

"మీ సుఖశాంతుల కంటే నాకు పెళ్ళి ముఖ్యం కాదు!"

"నా సుఖం ఇహంలో లేదు, వెర్రిదానా! పరంలో వుంది!"

గిరిజ లేచి క్రిందికి దిగసాగింది. అనిత ఒక్క మాటులో వెళ్ళి ఆమెను పట్టుకొని, జాగ్రత్తగా దింపసాగింది.

"మీ రలా ఉద్రేకపడకూడదు! మీ గుండె—"

"నా గుండె మంచిదికాదని తీసి గుప్పెట్లో పెట్టుకుంటావా?"

"మిమల్ని ఎక్కువ తిరగవద్దని డాక్టర్ అన్నాడు!"

"అతనెవరు శాసించడానికి! ఇది ప్రజాస్వామ్యం, తెలుసా?"

"మీరు అర్థంలేకుండా మాట్లాడుతున్నారు!" అర్చింది అనిత.

గిరిజ నవ్వింది: "అవును! పాతికేళ్ళ క్రితం వరకూ నా మాటలకీ, చేతలకి అర్థం వుండేది. దాని తండ్రి పోయాక నా బ్రతుక్కే అర్థంలేకుండా పోయింది! ఇప్పుడు నా కన్నేళ్ళో తెలుసా? అరవై రెండు! ఇంతడబ్బు వుండీ ఈ వయసులో బిడ్డలనుంచి ఏ సుఖసంతోషాలు పొంద

లేని దౌర్భాగ్యులెవరున్నారు— నేను తప్ప!"

"ఏమిటి ఉపన్యాసమిస్తున్నావు?" సరోజ ఎదురు వచ్చి అడిగింది.

గిరిజ ఆమెని మింగేసేలా చూసింది.

"ఏమీలేదు. నిన్నెవరైనా ఎత్తుకుపోయి పెళ్ళి చేసుకుంటే బావుంటుందంటున్నాను—ఏమంటావు అనితా? బుద్ధివస్తుంది!"

సరోజ పగలబడి నవ్వింది. అది చూసి అనిత భయపడి దూరంగా జరిగింది.

"అలాంటి ఆశ్యాశలు కల్పించుకోకు! అయినా ఆ మాట నువ్వు మనస్ఫూర్తిగా ఏమీ అన్లేదు. నన్ను రెచ్చగొట్టేందుకు చెప్పావు! ఆ దమ్ము లెవరికున్నాయి! నా గురించి ప్రపంచం ఏమనుకుంటోందో నీకు తెలియదు! నేనెవరి స్వంతమూ కాను, తెలుసా? నేను నేనే. స్వతంత్రురాల్ని. నన్నెవరూ పొందలేరు, నేనెవరికీ బానిసను కాను!"

కానీ సరోజ పొరబడింది....

సరిగ్గా ఈ మాటలంటున్న సమయంలో ఆ యింటికి నాలుగుమైళ్ళ దూరంలో తనను రెండవసారి అపహరించడానికి పథకం వేయబడుతున్నట్లు ఆమెకు తెలియదు!

# 3

గాయత్రి ఒళ్ళంతా ఊపేస్తూ పగలబడి నవ్వింది. ఆమె అనుచరులు వరుసగా తలలు వంచుకొని నిలబడ్డారు.

"మీకు ముందే చెప్పాకదట్రా! వాడికందుబాటులో ఏది వుంటే అది విసురుతాడని! ఇలాంటి జాగ్రత్తలు తీసుకోలేని మీారేం బందిపోటుల్రా! ఛీ, నాకు సిగ్గేటు!"

"ఆంటీ! వాడ్ని బయటికి రమ్మను, పిడికిలితో గుద్ది చంపుతాను!" అన్నాడు బాక్సర్ ముక్కు పట్టుకొని. అతని ముక్కునుంచి రక్తం ఇంకా కారుతోంది.

గాయత్రి తేలిగ్గా నవ్వింది, "బాక్సర్! నీ బల ప్రయోగం చిన్నపిల్లలమీద కాదు! నీకు సమవుజ్జీ—లేదా శత్రువుమీద! లోకేష్ సరసాలతో శత్రుత్వం కల్పించు కుంటే అది మీ ఆరోగ్యానికి మంచిదికాదు, జాగ్రత్త! అల్ రైట్, బాయ్స్! వాడు ప్రవర్తించిన తీరునుబట్టి సరోజను వాడెంత ఇష్టపడుతున్నాడో మీరు తెలుసు కొనివుంటారు...."

లోకేష్ పైన గదిలోంచి తొంగిచూసి అన్నాడు: "నా డార్లింగ్‌ని తీసుకురాలేని దద్దమ్మల్ని పిస్తోలుతో చంపుతానని చెప్పు, మమ్మీ!"

"విన్నారా?" గాయత్రి అంది చిటికవేసి, "వాడ్ని రెచ్చగొడితే చెడ్డపులి అవుతాడు! కాబట్టి చెప్పినట్టు చెయ్యండి. సరోజ నిప్పులాంటిదని మీరంతా అనుకుంటు న్నారు. కానీ నిప్పునార్పెయవచ్చని తెలియదా? ఏ కడ్డీని యెలా వంచాలో నాకు పద్ధతులు తెలుసు. ప్రతిమనిషిలో అతనెంత గొప్పవాడైనా—ఏదో ఒక వీక్ పాయింట్ వుంటుంది. దాన్ని పసిగట్టి దెబ్బతీసే మనకు ప్రయో జనం వుంటుంది. సరోజ వీక్ పాయింట్ నాకు తెలుసు."

"ఏమిటో చెప్పు!" అన్నాడు వెంకట్.

"అది పూర్తిగా నా స్వంత బిజినెస్ గనుక మీకు చెప్పే పనిలేదు! మీరు చేయవల్సిందల్లా ఆమె నెత్తుకు రావడం. ఆ తర్వాత నేను చూసుకుంటాను."

"సరే, ఎలా ఎత్తుకురావాలి?" సింగ్ అడిగాడు అస హనంగా.

గాయత్రి అందర్నీ కొన్ని క్షణాలు పరికించి చూసి అంది:

"నాకు నమ్మకముంది. మీ ముఖాల్లో, ధైర్యమూ, పట్టుదలా వున్నాయి. ఇప్పుడు మీరు చేబట్టబోయే పని మీ గట్స్‌ని నిర్ణయిస్తాయి. సక్సెస్ చేస్తే మీ అందర్నీ వూటీ పంపిస్తాను...."

"చెప్పు, ఆంటీ! ఏం చెయ్యాలి?" సింగ్ అన్నాడు ఆరాటంగా.

గాయత్రి అంది: "సరోజను కిడ్నాప్ చెయ్యాలి. ఇంట్లోంచి ఆమె నపహరించడం సాధ్యంకాదు. బయట కొచ్చినప్పుడే వీలవుతుంది. ఆమె బయట వుంటే తోడుగా డ్రైవర్ కూడా వుంటాడు—నీడలా. అతన్ని కూడా ఎత్తుకొచ్చెయ్యాలి."

"ఓహ్, అతనెందుకు?"

"అతన్ని వదిలి సరోజను కిడ్నాప్ చేస్తే మీ ఆన వాలు పోలీసులకు చెప్పేస్తాడు!"

ఈ విషయం అందరూ ఒప్పుకున్నారు.

"కాబట్టి, సరోజను కారుతో సహా ఆమె డ్రైవర్‌ని కూడా కిడ్నాప్ చెయ్యాలి. రేపు ఆదివారం ఉదయం రంగంలో దిగండి! కుమార్, నీ లవర్ ఆరోగ్యం యెలా వుంది?"

కుమార్ కలవరపడ్డాడు. "బాగానే వుంది, ఆంటీ."

"అయితే ఆమెను కలుసుకొని మాట్లాడు. ఈ ప్లానుకు ఆమె చాలా ముఖ్యం. ఆడవాళ్ళను చేరదీయడం సరోజకు సరదా!" గాయత్రి నవ్వింది, "కాని, ఇప్పుడామె నీ లవర్‌ని చేరదీసి మోసపోతుంది...."

"ఎలా?"

గాయత్రి తన ప్లాను చెప్పింది.

"మోహిని అలా బెదిరించి విజయవాడ హైవేమీద హయత్ నగర్ కు తెస్తుంది. ఆమె కపాయం కలుగకుండా మీరు బంజారా హిల్స్ నుంచి మీ కారులో వెంటాడుతూ రండి!

"హయత్ నగర్ వచ్చాక ఎవరూలేని చోట తీసికెళ్ళి సరోజనూ, డ్రైవర్ని మీ కార్లో యెక్కించుకోండి. సరోజ బెంజికారుని కుమార్, మోహిని తీసుకొని విజయవాడ వెళ్ళిపోతారు."

"అక్కడెందుకు?" కుమార్ అడిగాడు.

గాయత్రి చెప్పలేదు. "ఆ కార్లో మీ రిద్దరూ విజయవాడ వెళ్ళి మంచి సెంటరు చూసి నల్గురి దృష్టి నాకర్షించేలా వదిలేసి రండంతే!" అంది.

ఆమె ఉద్దేశ్యం అర్థంకాకపోయినా అందరూ తలలూపారు.

"ఇక్కడ సింగ్, వెంకట్, బాక్సర్ మిగులుతారు. మీరు వాళ్ళిద్దర్ని తీసుకొని ఇక్కడకొచ్చేవాలి. మన కారు విండో గ్లాసులు లైట్ ప్రూఫ్. కాబట్టి బయటి వాళ్ళకు సరోజ కన్పించదు. ఆమె నిక్కడకు తెచ్చాక మీ బాధ్యత తీరిపోతుంది."

"చాలా సింపుల్. ఆ తర్వాత సువ్వేలా హాండిల్ చేస్తావు? ఆమె ఛస్తే?" సింగ్ అడిగాడు.

"చావదు! చావదు గనుక చావదు!" గాయత్రి అంది నిశ్చయంగా, "లోకేష్ తో ముచ్చటగా కాపురం చేస్తూ పడివుంటుంది!"

"ఎన్నాళ్ళు? ఆమెను పోలీసులు ట్రేస్ చేయగలరు!"

"చేయలేరు! అందుకే కుమార్‌ని విజయవాడ పంపేది!"

ఆమె అనుచరులు ఒక్కసారిగా గుసగుసలాడు కున్నారు.

"మరి డ్రైవర్ సంగతి?"

"అతను ఇక్కడే బందీలా పడివుంటాడు. మీ ముఖాల్లో భయం నేను గమనిస్తూనే వున్నాను. నా మీద నమ్మకం సడలుతోంది. రేపు సరోజనిక్కడికి తెస్తే మీ భయాలన్నీ దూరమవుతాయని తెలుసుకుంటారు—"

"లేదు, ఆంటీ! రేపు ఆమెనిక్కడ తెచ్చిన గంట లోగా మేమంతా ఊటీ పారిపోతాం! అందుకు నువ్వొప్పు కోవాలి!" అన్నాడు వెంకట్.

గాయత్రి అతన్ని ఆశ్చర్యంగా చూసి, లేచి చరచర వెళ్ళిపోయింది.

బాక్సర్ అసంతృప్తిగా నొసలు చిట్లించాడు.

## 4

సరిగ్గా 10 గంటలకు అవుట్‌హౌస్‌లో ఫోన్ మ్రోగింది. డ్రైవరు స్వామి రిసీవర్ తీసుకున్నాడు.

సరోజ పలికింది: "పదకొండు గంటలకి గాంధీభవన్‌లో ప్రోగ్రాం వుంది—త్వరగా తెములు!"

"నేను మీ కోసమే చూస్తున్నాను మేడమ్!" అన్నాడు స్వామి.

"అయితే కారు తీయ్!" కసిరింది సరోజ.

స్వామి ఫోన్ పెట్టేసి లేచాడు. సొరుగులోంచి రివాల్వర్ తీసి గుళ్ళు సరిచూసుకున్నాడు. దాన్ని జేబులో వేసుకొని, బయటికి వచ్చి తలుపుకి తాళం వేశాడు. ఖరీదైన సిల్క్ రుమాలుతో ముఖం తుడుచుకొని గ్యారేజి

కేసి గంభీరంగా అడుగులేశాడు.

రెండు నిమిషాల తర్వాత నిగనిగలాడుతున్న బెంజి కారు బయటికొచ్చింది.

అదే క్షణంలో సరోజ చేతిలో బ్రీఫ్‌కేసుతో హడావుడిగా పోర్టికోలోకి వచ్చింది. స్వామి కారుదిగి, బ్రీఫ్‌కేసు అందుకొని, డోర్ తెరిచి పట్టుకున్నాడు. సరోజ ఎక్కి కూర్చుంది.

స్వామి బ్రీఫ్‌కేసు లోన పెట్టి, డోర్ మూసి డ్రైవింగ్ సీటులో కూర్చున్నాడు. కారు బయలుదేరి గేటు చేరు కుంటుందనగా, గూర్ఖా రెక్కలిన్ని బార్లా తెరచి సలాము కొట్టాడు. కారు బయటపడి రోడ్డెక్కింది.

సరోజ తేలిగ్గా వూపిరి వదిలి విశ్రాంతిగా వెనక్కి వాలింది. ఒక చెయ్యి బ్రీఫ్‌కేసు మీద వుంచి, మరో చెయ్యి ఒళ్ళో పెట్టుకుంది.

ఆమె దృష్టి సూటిగా రోడ్డుకేసి వుంది. రోడ్డు యెప్పటిలా నిర్మానుష్యంగా వుంది. ఆమె సాలోచనగా చేతిగడియారం చూసుకొని నిట్టూర్చింది. ఆమె తలలో రకరకాల సమస్యలు తిరుగుతున్నాయి. అవన్నీ తను పరిష్కరించాలి! సాధ్యమైనంతవరకు తన కళ్ళముందున్న అభాగినుల వదనాల్లో కళాకాంతులు చూడాలి—వాళ్ళ చీకటి జీవితాల్లో చిరుదీపాలు వెలిగించాలి.

కారు మరికొంత దూరం వెళ్ళి మలుపు తిరిగింది. ఎదురుగా టెలిగ్రాఫ్ స్తంభం దగ్గర ఒక స్త్రీ ఆకారం చూసి ముందుకు వంగింది సరోజ.

ఆ స్త్రీకి ఇరవై ఏళ్ళుంటాయి. నఖశిఖపర్యంతం బీద రికపు ఛాయలు ప్రతిఫలిస్తున్నాయి. మామూలు నేత చీర, జాకెట్, సాదా చెప్పుల్లో వుంది. చేతిలో చిన్న

బ్యాగు వుంది. ఇవన్నీ సరోజను కలతపెట్టినా, ఆమె సౌందర్యం ఆశ్చర్యచకితురాల్ని చేసింది. ఆమె ముఖం చూస్తే ఏదో అసహజత్వం తోచింది. ఆమె వేషానికీ, విగ్రహానికీ పొంతన యెంత మాత్రమూ కుదరడంలేదు!

కారు దగ్గరగా వచ్చాక మరింత పరీక్షగా చూసింది. లేదు! ఇదేదో వింతగా వుంది. ఆదేమిటి, ఆమె ముఖంలో చలాకీతనపు ఛాయలు కన్పిస్తున్నాయి? ఆమె నిలుచున్న తీరేమిటి మగవాడ్ని స్ఫురింపజేస్తోంది!

"స్వామీ—కారాపు!" అంది సరోజ.

అప్పటికి కారు ఆ యువతిని దాటి రెండడుగులు వెళ్ళింది. స్వామి ఆపేశాడు.

సరోజ తల బయటపెట్టి ఆమెని రమ్మని చెయ్యి వూపింది. అప్పుడు చూసింది ఆమె నడకను—ఆడ వేషంలో వున్న మగవాడా? లేక మగవేషాలకు అలవడ్డ ఆడదా?

ఆమె దగ్గరికొచ్చాక అడిగింది: "ఎవర్నువ్వు? ఇక్కడేం చేస్తున్నావు?"

"లిఫ్ట్ కోసం చూస్తున్నానండి. మోహిని నా పేరు."

అసహ్యంగా వుంది గొంతు. అయినా సరోజ భరించింది.

"ఇక్కడ నీ కెవరున్నారు?"

"సిన్హాగారని ఒకాయని ఉద్యోగం ఇస్తానన్నాడు. కలుసుకొని వెళుతున్నాను."

"ఎక్కడికి వెళ్ళాలి?"

"సనత్ నగర్ కండి."

ఆమెపట్ల ఆమె మాటలపట్లా అంత అసహ్యంలోనూ సరోజ తన స్వాభావిక తత్వంతో కారెక్కించుకొని

బయలు దేరింది.

మోహిని ఆమె ప్రక్కన సర్దుక్కూర్చుని, బ్యాగును జాగ్రత్తగా పట్టుకుంది.

సరోజ మాట్లాడలేదు.

మోహిని కాసేపటికంది, "మీలాంటి గొప్పవారు నాలాంటి సామాన్యురాలికి లిఫ్ట్ ఇస్తారనుకోలేదు. మీరు చాలా మంచివారిలా వున్నారు—నిగర్వి!"

ఆమె మాటలకు సరోజ చిరాకుపడింది.

"నువ్వెవరో చెప్పలేదు, నీ తలిదండ్రు లెవరు?" అంది.

"తలిదండ్రులు లేరు. నేను అనాథని. ఉద్యోగం కోసం నెలరోజులు నుంచీ తిరుగుతున్నానండి."

"ఇదివరకు ఏం ఉద్యోగం చేశావు?"

"ఏమీ చేయలేదండి."

"మరి ఎలా గడిచింది?"

మోహిని తటపటాయించింది.

"మాట్లాడవేం?"

మోహిని పలకలేదు.

సరోజ ఆమెని సూటిగా చూసింది. ఆమె కళ్ళలో అసహ్యం మెరిసింది. "నువ్వు ఉద్యోగం చేసే రకంలా లేవు! నీ ముఖం చూసి చెప్పగలను. నీ కెక్కడా గౌరవం లభించదు! నువ్వు నీచ జాతికి చెందిన దానివి! స్త్రీలలో వుండే అణుకువ, బిడియం నీలో లేవు! నువ్వు మగవారితో వ్యభిచారులతో—విచ్చలవిడిగా తిరిగే దానివి!"

మోహిని బెదిరిపోయింది.

"మీరు—మీరు—పొరబడ్డారు! అవమాన పరుస్తున్నారు!"

సరోజ విసురుగా అంది. "సిగ్గులేని దానివి—నీకేమిటి అవమానం! ఇతరుల విషయంలో నేనెప్పుడూ పొరబడను! నీ చరిత్ర తెలిసీ నేను లిఫ్ట్ ఇచ్చానంటే ఎందుకనుకుంటు న్నావు? అది నా పరువుకు తక్కువైనా సరే-నా ఆశయం అంతకంటే గొప్పది! స్త్రీజాతి గౌరవాన్ని హీనపర్చే నీలాటి తుచ్ఛమైనదానికి బుద్ధి నేర్పాలనుకుంటున్నాను."

"మీ ఆశయానికి జోహార్లు! కానీ, ఇప్పుడు బుద్ధి నేర్పుతున్నది నేను కాదండి—మీరు!" అంది మోహిని కటువుగా.

"ఏమిటట నువ్వనేది?" సరోజ అర్చింది కోపంగా.

మోహిని వెటకారంగా నవ్వి, మాంత్రికురాలిలా క్షణకాలంలో బ్యాగులోంచి సీసా తీసి చూపించింది.

ఆమె కళ్ళలో కాఠిన్యం చూసి సరోజ బెదిరి పోయింది.

"కమాన్! చెప్పినట్టు చెయ్యి! నీ డ్రైవర్ గాడ్ని తిన్నగా విజయవాడ హైవేమీదకు తీసికెళ్ళమను! విన్నావా? చెప్పినట్టు చెయ్యి! లేదా ఈ ఆసిడ్ నీ ముఖం మీద జల్లేస్తాను!"

ఆమె అరుపులు విని సరోజ బిత్తరపోయి బయటికి చూసింది. కనుచూపు మేరలో యెక్కడా జనం లేరు. స్వామి తటాలున కారా పేసి వెనక్కి తిరిగాడు. అతను జేబులో చెయ్యిపెట్టి రివాల్వర్ తీసేలోపున, మోహిని ముందుకువంగి అతని మెడదగ్గర ఆసిడ్ ని స్ప్రే చేసింది! స్వామి బాధగా అర్చాడు. అతని చర్మం కమిలిపోయింది.

మోహిని చెయ్యి పాములా బుసకొట్టి అతని జేబులో రివాల్వర్ తీసుకుంది.

ఆ దృశ్యమంతా సరోజ అవాక్కయిపోయి

చూస్తోంది. ఆమె వెన్నులోంచి చల్లటి చలి పుట్టుకొచ్చి మంచుగడ్డలా వుండిపోయింది.

మోహిని తిరిగి సీట్లో కూర్చుని సరోజని చూసి అసహ్యంగా నవ్వింది.

"చూశావా? నీ మంచికోసం చెప్తున్నాను! డ్రైవర్ని హీరోలా ప్రవర్తించవద్దను! తిన్నగా హాయత్ నగర్ పోనివ్వమను! నువ్వు సహాయం కోసం అర్చినా, ఏడ్చినా ఈ రివాల్వర్ తో షూట్ చెయ్యను. ఆసిడ్ తో నిన్ను కురూపిని చేసి వదుల్తానంతే! నన్ను తక్కువ భావించకు!"

సరోజ తేరుకొని ధైర్యాన్ని కూడదీసుకుంది.

"స్వామీ....కారు పోనీయ్...."

ఆమె అప్రయత్నంగా అన్న మాటలు విని స్వామి మెడదగ్గర మంటను భరిస్తూ కారును పోనిచ్చాడు. అతని మెదడు ఇప్పుడు అపాయాన్ని నివారించడానికి ఉపాయం ఆలోచించే స్థితిలో లేదు.

సరోజ బొమ్మలా కూర్చొని వుంది. ప్రక్కన ఆగంతకురాలి చేతిలో ఆసిడ్ సీసా ఆమెను తీవ్రంగా భయపెడుతోంది! ఒక్కచుక్క నా మీద పడితే....ఆమె ఒళ్ళు వొణికింది. ఏ చిన్న పొరపాటు చేసినా ఈ రాక్షసి అకృత్యానికి బలికాక తప్పదు!

ఒకక్షణంలో మోహిని చేతిలో సీసా లాక్కోవాలన్న ఆతృతకు కూడా లోనయింది. కానీ, బలవంతాన తమాయించుకుంది. ఆమె ప్రతికదలికనూ జాగ్రత్తగా గమనిస్తూ మోహిని సీసా బలంగా పట్టుకొని సిద్ధంగా కూర్చుంది.

కారు వేగంగా ప్రయాణిస్తోంది. కాలం నిశ్శబ్దంగా గడిచిపోతోంది. రివాల్వర్ తో బెదిరించకూడదన్న

గాయత్రి హెచ్చరిక మోహిని కిప్పుడర్థమవుతోంది. దానితో తను బయటి జనం దృష్టి నాకర్షించగలదు! ఈ సీసా చేతిలో యెంత చక్కగా ఇమిడింది! ఆమె నవ్వుకుంది.

స్వామి మెదడు మొద్దుబారినా, డ్రైవింగ్ మాత్రం యాంత్రికంగా చేస్తున్నాడు. ఇరవై నిముషాల డ్రైవింగ్‌తో అతను క్రమంగా తెలివిలోకొచ్చాడు. పరిస్థితి గ్రహించి అప్పుడు గాభరా చెందాడు. ఇది రెండవ కిడ్నాప్! మొదటిసారి ఆ జిత్తులమారి నక్క డిటెక్టివ్ పూనుకున్నాడు. ఇప్పుడెవరు? ఏం చెయ్యాలి?

అతను వేగంగా ఆలోచించాడు. తన రివాల్వర్ ఆమె లాక్కుంది. కానీ ఆమె చేతిలో లేదు. సీసా మాత్రమే మాంత్రికురాలిలా పట్టుకొని వుంది. స్పీడుగా డ్రైవ్ చేసి బ్రేకువేస్తే? ఈ పని క్షణాల్లో, చాలా నేర్పుతో చెయ్యాలి. ఏం జరుగుతుందో ఆమె గ్రహించేలోపున ముందుసీటుకు వచ్చి గుచ్చుకుంటుంది—తను మెరుపులా లేచి మెడమీద కొడితే సీసా జారిపడుతుంది!

స్వామి ఒక్కసారిగా మెలికలు తిరుగుతూ పళ్ళు బిగబట్టాడు. అతని మెడదగ్గర మళ్ళీ చురుక్కున మండింది.

మోహిని చెయ్యి వెనక్కి తీసుకుంటూ అంది, "మెదడు డ్రైవింగ్ మీద లగ్నం చెయ్. హాయత్ నగర్ ప్లీజ్!"

## 5

గాయత్రి బయట కారు శబ్దం విని వరండాలో కురికింది. లోనికొస్తున్న కారును చూసి సంతోషం పట్టలేక పోయింది.

కారులోంచి మొదట బాక్సర్ దిగాడు. తర్వాత వెంకట్, సింగ్, ఆ తర్వాత సరోజ, స్వామి దిగారు.

ఆగంతకుల చేతుల్లో పిస్తోళ్ళున్నాయి. వాళ్ళ వెనుక వస్తోంటే బందీలిద్దరూ ముందుకు నడిచారు.

సరోజ వరండా చేరుకోగానే గాయత్రి అమాంతం ఆమెని వాటేసుకుంది. ఉద్వేగంగా ముద్దులవర్షం కురిపించింది. సరోజ గింజుకుంటూ, రక్కుతూ అర్చింది:

"నన్నొదులు—దూరంగా వుండు నువ్వు!"

స్వామి ముందుకు దూకబోతే బాక్సర్ వెనక్కి తీసుకున్నాడు.

గాయత్రి సంతోషం అదుపుచేసుకొని సరోజ చెయ్యి పట్టుకొని చకచక లోనికి లాక్కెళ్ళింది. అందరూ అనుసరించారు.

"నా కోడలు! బంగారు కోడలు! చూడండ్రా! ఇప్పుడీ యింటికెంత కళ వచ్చిందో? బాబూ లోకేష్! ఎవర్ని తెచ్చానో చూడరా, నాయనా!"

సరోజ అయోమయంగా చూస్తూ ఆందోళనగా అర్చింది.

"ఏమిటీ న్యూసెన్స్! నన్నిక్కడికెందుకు తెచ్చావు?"

"అమ్మాయి సరోజా!" అందామె కంఠంలో అధికారం చూపుతూ, "నిన్ను డబ్బుకోసం ఎత్తుకురాలేదమ్మా! మీ వాళ్ళను డబ్బు కోరను! నేను కోరేదల్లా నిన్ను—నా కోసం కాదు—నా కుమారుడు లోకేష్ కోసం. నీ ఫోటో చూసిన క్షణం నుంచీ వాడు నువ్వే కావాలని కలవరిస్తున్నాడు! నిజంగా నువ్వు అందమైన బొమ్మవి!" నవ్విందామె.

"నీ ఫోటో ఎక్కడ చూశాడని సందేహం కలగవచ్చు. చాలా పత్రికలు నీ ఫోటోలు ప్రచురిస్తాయి. నేను విరివిగా పత్రికలు తెప్పిస్తాను. అది నా వృత్తికి అవసరం.

ప్రపంచంలో ఏం జరుగుతుందో నేనీ ఇల్లు కదలకుండా వాటిద్వారా తెలుసుకుంటుంటాను. నా లైబ్రరీ నిండా పత్రికలు. నువ్వ తర్వాత తీరిగ్గా చూద్దువుగాని—"

సరోజ అసహనంగా చూసింది.

గాయత్రి మళ్ళీ అంది: "అలా కూర్చో. ఇప్పుడు నిన్ను కోరేదల్లా నువ్వు నా లోకేష్‌కి భార్య కావడం. నిన్ను ఎత్తుకొచ్చి మేం పొరపాటు చేశామనుకోకు! నీ గురించి నాకు పూర్తిగా తెలుసు. నువ్వు ప్రచారంచేసే నినాదాల గురించీ తెలుసు. నువ్వు పురుషుల్ని అసహ్యించుకుంటావు. కారణం? వాళ్ళవల్ల నీ కపకారం జరిగిందా? లేదు. మరో కారణం ఇదమిద్ధంగా చెప్పలేవు!

"కానీ అమ్మాయ్! నాకు తెలుసు. అది కేవలం నువ్వు లోకం దృష్టి నాకర్షించాలనే కీర్తిదాహంతో సృష్టిస్తున్న బూటకపు ప్రచారం! బోగస్ స్టంట్. అంతకు మించి మరేమీ కాదు. లోకంలో వున్న మగవాళ్ళంతా ఆడవాళ్ళమీద అత్యాచారాలకి పాల్పడ్డంలేదు. అలాంటి వారి సంఖ్య చాలా చాలా తక్కువ వుంటుంది. అంత మాత్రాన నువ్వా దుర్గుణాల్ని అందరికీ ఆపాదించి ద్వేషించడం, పెళ్ళిని బహిష్కరించడం లాటి పిచ్చిపనులు నీ మూర్ఖత్వానికి తార్కాణం కాకపోతే మరేమిటి?—నీ తండ్రి లేకపోతే నువ్వు పుట్టేదానివి కాదు. ఏమంటావు?"

"ఏమిటి వాగుతున్నావు?" అంది సరోజ, "నా ఆశయాల గురించి నీతో వాదించే అవసరంలేదు! నువ్వో దొంగవి!"

గాయత్రి నవ్వింది: "నేనూ వాదించడంలేదు! నీ పొరపాట్లు తెలియజేస్తున్నాను. అనాథలూ, అత్యాచారాలకు బలైన వాళ్ళకు సంబంధించినంతవరకూ నీ ఆశయాలు

గొప్పవే! కాదనను. కానీ జీవితానికి అతిప్రధానమూ, అత్యవసరమూ అయిన పెళ్ళిగురించి నువ్వు చేసే ప్రచారం ఎంత మాత్రమూ సహించలేకపోతున్నాను. నీదింకా చిన్నవయసు. చిన్నవయసులో చేసే పొరపాట్లు ముందు జీవితంలో యెన్నో అరిష్టాలను తెస్తాయి.

నీ ఒంట్లో శక్తి వున్నంతవరకు నువ్వు తిరగగలవు, నీ పనులు స్వయంగా చేసుకోగలవు. కానీ జవసత్వాలుడిగి వృద్ధాప్యంలో అడుగుపెట్టాక నిన్ను చూసేదెవరు? నీ పన్లు చూసేదెవరు? వృద్ధాప్యంలో నీ పిల్లలు, భర్తా తప్ప ఇంకెవరూ నీ వారు కాలేరు! ఇంకెవరూ నిన్ను చూడ లేరు! పైగా పెళ్ళికాని ఆడదాన్ని! కాస్త ఆలోచించు! అప్పుడు నీ కెవరూ తోడూ నీడా లేక అలమటిస్తావు. నువ్వు చేసిన తప్పుల్ని జీవితాంతం తిట్టుకుంటూ కుమిలి పోతావు—"

"నువ్వు నాకు పాఠాలు నేర్పుతున్నావా!"

"సరే—పాఠాలు నేర్పను. నువ్వు జ్ఞానివైతే ఆ అవ సరంలేదు. నా ఉపన్యాసాలతో నిన్నిక విసిగించను. ఇప్పుడసలు విషయానికొద్దాం: నువ్వు లోకేష్‌ని పెళ్ళి చేసుకోవాలి—"

సరోజ పకపక నవ్వింది. "బావుంది.... చాలా బావుంది! దొంగల్ని పోషించేదానివి, నీ కొడుకు గురించి బాగానే కలలుగంటున్నావు! చూడు, పిచ్చిదానా! నా గురించి నీకు పూర్తిగా తెలియదు! ఇలాంటి పరిస్థితి ఏర్పడితే నేను ఛస్తానని నీకు తెలియదు!"

"బేబీ! నీ చేతులు పట్టుకుంటాను! ఆ పని చెయ్యకు!" గాయత్రి ఛటుక్కున సరోజ చేతులు పట్టుకొని అర్చింది. "ఎప్పుడూ నువ్వే జయిస్తాననుకోకు! నీ గురించి, నీ పూర్తి

కుటుంబం గురించీ తెలుసు! నీ ప్రతిష్ట దెబ్బతినే పక్షంలో నువ్వు చచ్చిపోవాలనుకుంటున్నావు. ఎంత పొరపాటు! దాని పరిణామం గ్రహించావా? నీ భవిష్యత్తు గురించీ, వంశాంకురం గురించీ నీ తల్లి పాపం తపించపోతూ ఏ స్థితి కొచ్చింది? ఆమె ఆరోగ్యాన్ని నువ్వెంత హీనంగా దిగజార్చావు? రెండుసార్లు స్ట్రోక్ వచ్చింది. మున్ముందు ఎలాటి తీవ్రమైన వార్త అయినా ఆమె ప్రాణం క్షణంలో తీస్తుందని డాక్టర్ అన్నాడు.

"ఇప్పుడు నువ్వు చావాలనుకొనే విషయం అలా వుంచు, ఏ చిన్న అపాయంలో ఇరుక్కున్నా అది తెలిసి నీ తల్లి గుండె ఆగుతుందని తెలుసా? ఆమెని చంపడం నీ కిష్టమేనా?"

సరోజ ముఖంలో రక్తం చివ్వుమని ప్రవహించింది. ఆమె నుదుటి మీద అకస్మాత్తుగా చెమట బిందువు లేర్పడ్డాయి. నోరు పెగల్లేదు.

"అమ్మాయ్! నీ తల్లి క్షేమం కోసం నీ మనసు చంపుకొని ఈ ఒక్క త్యాగం చెయ్యలేవా? ఆలోచించు! నేనేమీ నువ్వు లక్షల ఆస్తికి వారసురాలివని కలలు గనడంలేదు! లోకేష్ కోరితే మట్టి అయినా మాణిక్యమైనా ఒకటే నాకు. నా ప్రేమ అలాంటిది. వాడు నిన్నే కోరడం నీ దురదృష్టం!"

"నువ్వు నన్నేమీ చేయలేవు! కాస్సేపట్లో నన్ను పోలీసులు గాలిస్తారు!"

"పోలీసులా! ఆ ప్రమాదం లేదు. నాకు వీక్ పాయింట్లన్నీ తెలుసు. నీ ప్రతిష్టకోసం మీ మేనేజర్ పోలీసుల జోలికి పోడు! ఇక నువ్వు చావాలనుకునే ఆలోచన

మానుకో! మనమంతా నీ తల్లి క్షేమం కోసం, లోకేష్ తృప్తికోసం కృషి చేద్దాం...."

గాయత్రి నవ్వుతూ వెళ్ళి ఫోన్ ఎత్తింది.

"నేను మీ ఇంటి నంబర్ డయల్ చేసి నీ మమ్మీని పిలుస్తాను. నువ్వామెతో ముక్తసరిగా మాట్లాడు—నువ్వు మాట్లాడేదే అంత! అత్యవసరంగా విజయవాడ వెళ్ళే పని తగిలినట్టు చెప్పు. వారం దాకా రానని కూడా చెప్పు. వారం తర్వాత ఏం చెయ్యాలో తర్వాత చెప్తాను. కమాన్ ఫోనందుకో."

"ఆ మాట నువ్వే చెప్పు!"

"చూడమ్మాయ్!" గాయత్రి కటువుగా అంది, "చెప్పినట్టు బుద్ధిగా నువ్వే చెప్పు! కాదంటావా, నేనే స్వయంగా మాట్లాడి నిన్ను కిడ్నాప్ చేసినట్టూ, పది లక్షలు ఇవ్వకపోతే ఆశ వదులుకోమనీ చెప్తాను! నీ ముసలితల్లి అక్కడికక్కడే గుండె ఆగి చచ్చి వూరుకుంటుంది! అర్థమైందా?"

ఆమె కళ్ళలో చిరుతపులి క్రౌర్యం చూసి సరోజ హడలిపోయి రిసీవర్ లాక్కుంది.

స్వామి పాతేసిన స్థంభంలా నిలబడివున్నాడు.

గాయత్రి అనుచరులకు ఆమెను ఊటీ ప్రయాణం గురించి కదిపే ధైర్యం చాల్లేదు. ఆమె నాస్తితిలో పలకరిస్తే ఊటీ బదులు అంతా ఊర్ధ్వముఖంగా ప్రయాణిస్తారని బాగా తెలుసు!

# 6

సరిగ్గా 11-30కి గిరిజ బంగళా ఆవరణలో ఒక ఫియట్ కారు రివ్వుమని దూసుకొచ్చి ఠక్కున ఆగింది.

కారులోంచి హడావుడిగా ప్రముఖ రచయిత్రి

సీరియల్ రాణి, ప్రముఖ సంఘ సేవిక—లయనెస్ కళ్యాణి దిగి ఇంట్లోకెళ్ళారు.

అనిత హాల్లో ఎదురై వాళ్ళనాపింది.

"ఎవరు—ఎవరు మీరు? ఎవరు కావాలి?"

కళ్యాణి ఎగాదిగా చూసింది, "సరోజ కావాలి. ఎక్కడుంది?"

"ఓహ్-ఇందాక మీరేనా ఫోన్ చేసింది? ఆమె వెళ్ళి గంటన్నర అయిందని చెప్పాను."

"చెప్పావు! కానీ ఎక్కడికెళ్ళింది?" సీరియల్ రాణి శివతాండవం చేసింది.

"అది నాకు తెలియదు—అడక్కండి!"

"ఆమె అమ్మగారెక్కడ?"

"ఆమెతో ఏం పని? నాతో మాట్లాడండి!"

సీరియల్ రాణి అనితను వెనక్కితోసి ప్రక్కగదిలో జొరబడింది. కళ్యాణి ఆమెని వెంబడించింది. అనిత నిల దొక్కుకొని, "ఏమిటీ దౌర్జన్యం!" అనర్చింది.

గిరిజ వాళ్ళిద్దర్నీ కంగారుపడి చూసింది. ఆ ఇద్దరూ నమస్కరించి పరిచయం చేసుకున్నారు.

పరిచయమయ్యాక కల్యాణి అంది, "పదకొండు గంటలకు మేం గాంధీభవన్‌లో బీద విద్యార్థినులకు వస్త్రాలు పంచిపెట్టే కార్యక్రమం పెట్టుకున్నాం. ఇందులో మీ కుమార్తెను ప్రత్యేకంగా ఆహ్వానించాం—ఆమె సభకు అధ్యక్షురాలు. వస్తానని మాటిచ్చింది. కానీ రాలేదు. ఎక్కడికెళ్ళింది?"

గిరిజ వాళ్ళను ఆసక్తిగా చూసింది. "ఇందాక మీరు ఫోన్ చేశారని అనిత చెప్పింది. అప్పుడు సరోజ ఎక్కడి కెళ్ళిందో ఆమెకు తెలియదు. ఇందాకే—పది నిమిషాల

క్రితం—నాకు ఫోన్ వచ్చింది. ఆమె విజయవాడ వెళ్ళింది."

"ఏమిటీ!" అతిథులిద్దరూ అర్చారు.

"అవును, ఆమే స్వయంగా ఫోన్ చేసింది. అక్కడ అత్యవసరంగా పని వుందట—వారందాకా రానంది."

"మా గురించి—మా గురించేమీ చెప్పలేదా?" కల్యాణి అడిగింది.

"చెప్పలేదు. ముచ్చటగా ఆ మూడు మాటలు చెప్పింది."

ఈ మాటలన్నీ అనిత లోనికొచ్చి ఆశ్చర్యంగా వింటోంది.

అతిథులిద్దరూ ముఖాలు చూసుకున్నారు.

"ఇదేం మర్యాద! వస్తానని మాటిచ్చి మాటమాత్రం లేకుండా ఎలా వెళ్ళిపోయింది? ఏమిటంత ముఖ్యం? అక్కడేమిటి పని? నిజంగా వెళ్ళిందా, లేక మమ్మల్ని తప్పించుకోవడానికో వంకా?" సీరియల్ రాణి తీవ్రంగా అంది.

"ఆమె వ్యవహారాలు మాకు తెలియవు. నన్ను విసిగించకండి, వెళ్ళండి!" గిరిజ అలసటగా వెనక్కి వాలి కళ్ళు మూసుకుంది.

వాళ్ళిద్దరూ బిక్కమొహాలేసుకొని బయటికొచ్చారు. అనిత వాళ్ళను సాగనంపి సాలోచనగా నిలబడింది.

సరోజ విజయవాడ ఎందుకెళ్ళింది?

ఆమె కరంగాలేదు. అత్యవసరంగా అక్కడామెకేం పని? అదీ ఎన్నడూ లేనిది! మరి హఠాత్తుగా అలా వెళ్ళడంలోని ఆంతర్యమేమిటి? అనితకేదో అసహజంగా తోచింది. ఏమిటది? మాడమ్ అబద్ధం చెప్పిందా? ఎందు

చెప్తుంది? తను కిచెన్‌లో వున్నప్పుడు ఫోన్ మ్రోగిన శబ్దం వింది—అప్పుడు సరోజ ఫోన్ చేసి మాడమ్‌కు చెప్పివుంటుంది: విజయవాడ వెళ్తున్నట్టు. కానీ ఎందుకు!

అనిత రివ్వున గిరిజ గదిలో కురికింది.

"ఆమె విజయవాడ ఎందుకెళ్ళింది!" అందొక్కసారిగా.

గిరిజ తేరుకొని నిదానంగా చూసింది, "చెప్పలేదు. అర్జంటుగా వెళ్ళాలంది, అంతే! నిలకడలేని ఆలోచనలు! ఇక్కడ వాళ్ళకు మాటిచ్చి ఎందుకెళ్ళిందో తెలియడంలేదు—"

"ఎక్కడ నుంచి ఫోన్ చేసింది?"

"ఏమో! ఆమె మాట్లాడక ముందు ఎవరో స్త్రీ నా పేరడిగింది."

"ఆమె ఎవరో మీరడిగారా?"

"లేదు—"

సరోజ ఎలా మాట్లాడింది? కంగారుగా మాట్లాడిందా? అనడగబోయి అనిత మానుకుంది. అది ప్రమాదకరం! ఆమెకు అనేక అనుమానాలు కలిగాయి. మనసు ఏదో కీడు శంకిస్తోంది. ఏదో జరిగింది.... తానేదో వెంటనే చెయ్యాలి!

ఆమె అకస్మాత్తుకు వెనుదిరిగి, మేడమీద తన గదిలో కురికి సపరేట్ లైను వున్న ఫోను ఆయాసంగా అందుకుంది....

## 7

ఎ. బి. రాల్ ఆందోళనగా సిగరెట్ వెలిగించాడు. అనిత మాటలు అతన్ని ఆశ్చర్యపర్చాయి. సరోజ విజయవాడ వెళ్ళింది....ఎందుకు?

ఆమె ఈ సిటీదాటి అడుగుపెట్టి ఎరుగదు. అలాటి మనిషికి అర్జంటుగా అక్కడేం పని? ఇంటినుంచి వెళ్తున్నప్పుడు లేని ఆలోచన దారిలో అకస్మాత్తుగా ఎలా కల్గింది? కట్టు బట్టలతో వారం రోజులు అక్కడ మకాం ఎలా వేస్తుంది!

రావ్ పరిస్థితిని నిదానంగా ఆలోచించాడు: సరోజ మాట ఇచ్చి తప్పే రకం కాదు. అలాటిది ఇవాళ గాంధీ భవన్‌లో ప్రోగ్రాం ఎలా ఎగ్గొట్టింది? కాదు—అది ఆమె నైజానికి విరుద్ధం! ఆమె ఏదో తప్పనిసరి పరిస్థితిలో అలా ప్రవర్తించింది. తప్పనిసరి పరిస్థితి? ఏమిటది? ఏదేనా అపాయమా?

అవును, ఏదో జరగరానిది జరిగింది! ఆమె విపత్కర పరిస్థితిలో చిక్కుకుంది! రావ్ గుండె ఒక్కసారిగా ఆగినట్టయింది: అసలు ఫోన్ చేసిన స్త్రీ యెవరు? ఎక్కడ నుంచి చేసింది? సరోజ కోసం లైను కలిపే అవసరం ఆమెకెందుకు?

రావ్ ఒక నిశ్చయానికొచ్చి సిగరెట్ విసిరేశాడు. టెలిఫోన్ డైరెక్టరీ వెతికి, ఒక నెంబరు ఎన్నుకొని డయల్ చేశాడు.

అవతల సమాధానం వచ్చాక అన్నాడు: "మిస్టర్ వారియర్, మీతో అత్యవసరంగా మాట్లాడాలి. వెంటనే నా ఆఫీసుకు రాగలరా?"

ఆవతలి మాటలు విని, అడ్రసు చెప్పి ఫోన్ పెట్టేశాడు.

పదినిమిషాల్లో డిటెక్టివ్ వారియర్ రావ్ ఆఫీసుకు చేరుకున్నాడు. అతను మళయాళీ. 50 ఏళ్ళుంటాయి. నల్లగా, పొట్టిగా, తుమ్మమొద్దులా వుంటాడు. అతని

క్రింద అయిదుగురు ఆపరేటర్స్ వున్నారు. అంతా సమ రులు. వారియర్‌కు నగరంలో ఎక్స్‌పర్ట్ షాడోగా మంచి పేరు వుంది.

అతను రావుతో కరచాలనం చేసి కూర్చున్నాడు.

"మిస్టర్ వారియర్, మీరొక ముఖ్యమైన పని చేసి పెట్టాలి. చాలా రహస్యం" అన్నాడు రావ్.

"ష్చ, ఏమిటో చెప్పండి!" అన్నాడు వారియర్.

రావ్ అతన్ని ఓరగా చూశాడు: "సరోజ మీకు తెలుసు, మిసెస్ రామకృష్ణ కూతురు." వారియర్ తలూ పడం చూసి మళ్ళీ అన్నాడు, "ఆమె అనుమానాస్పద పరిస్థితిలో ఈ వుదయం విజయవాడ బయలుదేరింది. కారణం చెప్పలేదు. ఫోన్ చేసి హడావుడిగా మూడు మాటలు చెప్పింది. ఆమె అలా వెళ్ళడం నాకేదో అను మానంగా వుంది.... కాబట్టి మీ రామెను షాడో చేసి ఆమె ఏ ప్రమాదంలోకి వెళ్ళలేదని తెలుసుకోవాలి——"

వారియర్ తలూపాడు, "ష్చ, తెలుసుకోగలం!"

రావ్ అతన్ని ఈ సారి అనుమానంగా చూశాడు: "ఫోన్ వచ్చి ముప్పావుగంటవుతోంది. కాబట్టి ఆమె బయలుదేరి వుంటే సిటీలిమిట్స్‌లోనే వుండవచ్చు. ఆమెను వెంటాడి ఎక్కడికెళ్తుందో, ఏం చేస్తుందో కనిపెట్టాలి. ఆమెతో డ్రైవర్ ఒక్కడే వుంటాడు. అలాగాక మరి కొందరుంటే వాళ్ళెవరో తెలుసుకోవాలి. ఆమె ఫ్రెండ్స్ కావచ్చు. లేదా——"

"ష్చ, లేదా?"

"కిడ్నాపర్స్ కావచ్చు!" కోపంగా అన్నాడు రావ్, "ఏమిటిది? మీరు విసుగు ప్రదర్శిస్తున్నారా? లేక

అయిష్టం వ్యక్తం చేస్తున్నారా?"

"ఎందుకు?"

"ఎందుకలా ప్చ్! ప్చ్! అంటున్నారు?"

వారియర్ పెద్దగా నవ్వాడు "నెవర్ మైండ్, నెవర్ మైండ్. అది నా అలవాటు....మానుకోలేక పోతున్నాను."

"అది దురలవాటు—అనర్థాలు తెస్తుంది!"

"ప్చ్! నెవర్ మైండ్. మీరు చెప్పండి."

రావ్ కోపంగా చూసి అన్నాడు: "ఆమె కిడ్నాప్ చేయబడిందా లేక, ఇష్టపూర్వకంగా వెళ్ళిందా—ఏ సంగతీ మీరు తెలుసుకొని తెలియజేయాలి. ఆమె కారు నెంబర్, మోడల్ వ్రాసుకోండి...."

వారియర్ వ్రాసుకున్నాడు. "కిడ్నాప్ అయితే ఏం చేయాలి?"

"పోలీసు ప్రమేయం లేకుండా ఆమెని రక్షించాలి. ఈ వ్యవహారం రహస్యంగా వుండాలి. మీ దగ్గర మనుషులున్నారు. అందర్నీ రంగంలో దింపండి!"

"కిడ్నాప్ కాకపోతే?"

"ఆమె కదలికల్ని గమనించండి, అంతే!"

"ఓ.కే! ఇందుకు అయిదువేలు ఖర్చవుతుంది, ప్చ్!"

"పదివేలు తీసుకోండి! నాక్కావలసింది ఫలితం—రిజల్ట్!"

వారియర్ లేచి కరచానం చేశాడు.

అతను వెళ్ళిపోయాక రావ్ అనుకున్నాడు: గుడ్ 'గాడ్! మళ్ళీ ఇదేదో అపాయమైతే మాడమ్కు తెలియకుండా జాగ్రత్త తీసుకోగలనా?

# 8

"గుడ్ గర్ల్!" గాయత్రి సరోజ భుజం తట్టి అంది. "నువ్వు వివేకంగా ప్రవర్తిస్తున్నావు. బాయ్స్! ఆ డ్రైవర్‌ని వెనుక వసారాలో పెట్టి తాళం వెయ్యండి! సరోజ, నువ్వేమీ దిగులుపడకు. అతనికన్ని సదుపాయాలూ అమరుతాయి. వెల్, ఇక పైకెళ్ళి లోకేష్ని చూద్దాం!"

స్వామిని సింగ్, బాక్సర్‌లు కలిసి లాక్కుపోయారు. సరోజ జీవంలేని కళ్ళతో నిస్సహాయంగా చూడసాగింది.

గాయత్రి ఆమె చెయ్యి పట్టుకొని మేడ మెట్లెక్కింది. వెంకట్ అనుసరించాడు. పైకి చేరుకున్నాక, గాయత్రి తన గదిలోకెళ్ళి ఒక నగలపెట్టె తెచ్చింది. ఆ తర్వాత అందరూ చివరిగది చేరుకున్నారు.

గాయత్రి తలుపు తట్టింది. "లోకేష్! తలుపు తెరువ్!"

"ఎందుకు మమ్మీ?"

"నీ బొమ్మను తెచ్చాను!"

"నిజం?"

"అవును—తలుపు తీయ్!"

చాలాసేపు లోపల నిశ్శబ్దం. గాయత్రి అసహనంగా అంది, "లోకేష్! తలుపు తీయవేం?"

"సిగ్గేస్తోంది, మమ్మీ!"

"ఛీ! నోర్మూయ్! తలుపుతీయ్!"

కొన్ని క్షణాల తర్వాత గడియతీసిన అలికిడయింది. గాయత్రి తలుపు నెట్టింది. తెరుచుకుంది. ఆమె లోనికి చూసి, సరోజ చెయ్యిపట్టుకొని అడుగువేసింది.

లోకేష్ కిటికీదగ్గర నిలబడి బయటికి చూస్తున్నాడు.

గాయత్రి సరోజను రెండుచేతుల్లో పొదివి పట్టుకొని,

"ఎవర్ని తెచ్చానో చూడరా! రెండురోజులు పోరు పెట్టావు! నీ కల నిజంచేశాను! నీ తృప్తికంటే నా కేమీ అక్కర్లేదు! ఇటుచూడు!" అంది ఉద్రేకంగా.

లోకేష్ నెమ్మదిగా తల తిప్పాడు. అప్పుడతన్ని చూసి సరోజ ఉలిక్కిపడింది. అతని కుడికంటి క్రింద నిలువుగా పొడవాటి గాటు వుంది. అతడు ఎర్రటివర్ణంలో రెడ్ ఇండియన్‌లా వున్నాడు. పొడవాటి వెంట్రుకలు. పొడవాటి చేతులు. కానీ పొట్ట చిన్నది. కాళ్ళు మళ్ళీ పొడవాటివి. కొంగకాళ్ళు కోడికి పెడితే ఎలా వుంటుందో అలా అన్నాడు.

అతను మూడు అంగల్లో సరోజను చేరుకుని, "మీరు బాగున్నారు—" అన్నాడు.

సరోజ ముఖం తిప్పుకుంది. ఆమె అంతరాంతరాల్లో అసహ్యం, కోపం, కసి సుళ్ళుతిరుగుతోన్నా ఆ క్షణంలో ప్రదర్శించే సాహసం చెయ్యలేకపోయింది: ఆమె కళ్ళ ముందు తల్లి మెదలుతోంది.

లోకేష్ బొమ్మలా నిలబడివున్నాడు. అప్పుడే అతనికి విపరీతంగా చెమటలు పట్టేశాయి. అతని కళ్ళు బెరుగ్గా తల్లిని చూస్తున్నాయి. అతని పరిస్థితి గ్రహించి ఆమె చెయ్యి అందుకొని సరోజ చేతిలో కలిపింది. చల్లగా మంచు పలకలా వున్న ఆ స్పర్శకి సరోజ వెన్నులో చలి పుట్టుకొచ్చింది.

"ఇప్పుడు మీరిద్దరూ ఒకగూటి పక్షులు! చిలకా గోరింకల్లా వర్ధిల్లండి! ప్రేమకు ఏదీ అడ్డురాదని నిరూపించండి! ఓహ్ అది నేను నిరూపించాను కదూ? మీ ప్రేమ కలకాలం కళకళలాడుతూ, తళతళ మెరుస్తూ; సెలయేటి ప్రవాహంలా గలగల పారుతూ, ఇంకా—"

"నువ్వేళ్ళు ఇక్కడున్నుంచి!" సరోజ అర్చింది ఒక్కసారిగా.

గాయత్రి నవ్వు మాయమై అవాక్కయిపోయింది. హఠాత్తుగా సరోజ కంఠంలో తీవ్రతకు ఆమె బెదిరింది. ఒక్క క్షణం తేరిపార చూసి తలూపింది.

"సరే.... నే నేమిటి! మీ పడుచువాళ్ళ మధ్య నా ముసలివేషాలేమిటీ! అలాగే వెళ్ళిపోతాను....లోకేష్, ఈ నగ ఆమె మెడలో అలంకరించు బాబూ!"

ఆమె నగతీసి అతనికిచ్చింది. అతను సందేహిస్తూ నిలబడ్డాడు. కాస్సేపయ్యాక చేతులు జాపి, నగతో సరోజ దగ్గరికి జరిగాడు. ఆమె విసురుగా దాన్ని లాక్కుని కిటికీలోంచి అవతలకి విసిరింది.

"నీ దొంగసొమ్ము నా మెళ్ళో కడతావా! పరిగత్తి వెళ్ళి దానితోపాటు దూకెయ్, ఫో!"

గాయత్రి రెచ్చిపోయింది. ఆవేశంతో సరోజ చెయ్యి పట్టుకొని పిండేసింది.

"జాగ్రత్త! నీ మాటలూ, చేతలూ బయట వున్నంత వరకే! నువ్విప్పుడు గాయత్రి గ్యాంగ్ లో చేరావు—ఈ ఇంటి కోడలివి. ఇక్కడ బందీవి. గుర్తుంచుకో, అక్కడ నీ తల్లి క్షేమంగా వుండాలంటే మర్యాదగా ప్రవర్తించడం నేర్చుకోవాలి! బయట చాలా ప్రపంచం చూసిన దానివి. నీకు మర్యాద నేర్పనక్కర్లేదు. లోకేష్ నీ భర్త. భర్తని గౌరవించి పూజించాలని మరువకు! నీ సిద్ధాంతాల్నీ, సూత్రాల్నీ ఇక మూటగట్టి అవతల పారేయ్!"

గాయత్రి విసురుగా కదిలి, బయటకెళ్ళి ధడాలున తలుపుమూసి గడియపెట్టింది. ఒక్కసారిగా తుఫాను వెలసినట్టయింది.

సరోజ చెయ్యి ఇప్పుడు విపరీతంగా నొప్పి పెడుతోంది. బాధతో ఆమె ముఖం వివర్ణమైంది. లోకేష్ ఆమె నాందోళనగా చూసి, ముందుకు జరిగాడు. కాని మళ్ళీ సందేహించి వెనక్కి తొలిగాడు. రెండు చేతులూ వెనుక కట్టుకొని నిలబడి, ముందుకు వంగి, "మీ చెయ్యి బాధ పెడుతోందా?" అని గొణిగాడు అస్పష్టంగా.

సరోజ అతన్ని చురచుర చూసింది, "నువ్వు దూరంగా వుండు. నన్ను పలకరించకు! ఆ కిటికీలోంచి విసిరేస్తాను!"

అతను కలవరపడ్డాడు. "ఎలా విసురుతారు? మీకు బలంలేదు! పైగా కిటికీకి చువ్వలున్నాయి!"

"నువ్వొత్త చవటవి!"

"ఏమన్నారూ?"

"చెప్పానుగా! చవటవి! నీకేమీ చేతగాదు! తల్లి కొంగుపట్టుకొని తిరిగే దద్దమ్మవి!"

"మీరు పొరబడ్డారు! నేనిప్పుడు పెద్దవాడ్ని. మగవాడ్ని. పైగా బందిపోటుని!"

"అయితే ఊళ్ళమీదపడి దోచుకోకుండా ఈ గదిలో పెళ్ళికూతురిలా ముడుచుకూర్చుని ఏం చేస్తున్నావు బ్రదర్?"

"బ్రదర్! మీరు పొరబడ్డారు! ప్రపంచం ఆగిపోతుంది___"

"మర్యాదగా నన్ను సిస్టర్ అని పిలువ్!"

"ఓహ్, ఏమిటీ విపరీతం! మమ్మీ ఇక్కడ కొంపలంటుకుంటున్నాయ్!"

తటాలున తలుపుతీసి గాయత్రి వచ్చింది. "ఏమిటి లోకేష్?"

సరోజ ముందుకు నూకి కసిరింది, "మొగుడూ పెళ్లాల మధ్య కల్పించుకుంటే వీపు బ్రద్దలవుతుంది। వెళ్ళిక్కడ్నించి!"

గాయత్రి మళ్ళీ రెచ్చిపోయింది.

"వాడ్ని నువ్వు జాగ్రత్తగా కాపాడుకోవాలి! పువ్వుల్లో పెట్టి—"

సరోజ ఆమెని వెనక్కి నెట్టి బయటికితోసి తలుపు లోపలినుంచి గడియపెట్టింది.

లోకేష్ దుడుకుగా ముందుకు వచ్చి అన్నాడు "మీరు నా సామర్థ్యాన్ని సవాలుచేస్తున్నారు—"

"అయితే ఏం చేస్తావు?"

"మీ చెయ్యి పట్టుకొని బాధ పోగొడ్తాను!"

సరోజ ఒక్కసారిగా నవ్వి చెయ్యి అందించింది. అతను ఛటుక్కున పట్టుకొని, తల ముందుకువంచి కళ్ళు చీల్చి చూశాడు.

సరోజ విసురుగా చెయ్యి లాక్కొని అతని చెంప ఛెళ్ళుమన్పించింది.

# 9

సాయంత్రం 7 గంటలకు రావ్‌కు వారియర్ నుంచి ఫోన్ వచ్చింది.

"హలో, మిస్టర్ రావ్! వి అర్ లక్కీ! ఇప్పుడే రిపోర్టు అందింది. విజయవాడలో ఆమె కారు కన్పించింది!"

"ఎక్కడా?" అర్చాడు రావ్.

"బస్ డిపో వెనుక, ఏలూరు కాలువ దగ్గర. కానీ అందులో ఎవరూ లేరు! ఇగ్నిషన్ కీ అలాగే వుంది. అందులో ఎవరు దిగారో ఆ ప్రాంతాల ఎవరూ చెప్పలేక

పోతున్నారు. అయితే సాయంత్రం 5 గంటలనుంచీ అదక్కడ వుందని కొందరు చెప్తున్నారు."

"మీ మనుషులేం చేస్తున్నారు?"

"అక్కడే కాపలాకాస్తున్నారు....ఎవరైనా తిరిగి వస్తారేమోనని. కానీ, వచ్చే సూచనలు లేవు. ఎవరైనా కారునలా రోడ్డుమీద గంటలతరబడి వదిలేసి ఎక్కడికీ వెళ్ళరు! ట్రాఫిక్ పోలీసులు దానిగురించి వాకబు చేస్తున్నారు. ఎవరూ రాకపోతే బహుశ వాళ్ళు అనుమానంతో రిజిస్ట్రేషన్ చెక్ చేయవచ్చు—"

"అది జరక్కూడదు! వెంటనే కారు నక్కడనుంచి కదిలించండి! ఏ పెట్రోలు బంకులోనో ఇచ్చి సర్వీసింగ్ చేయించండి. కానీ మీ మనుషుల్ని మాత్రం అది లభించిన చోటే వుంచండి. ఎవరైనా తిరిగి వస్తారేమో కనిపెట్ట—"

"ఎవరూ రారనిపిస్తోంది. ఇగ్నిషన్ కీ తీసుకోకుండా, విండో గ్లాసులు దించకుండా, అంత ఖరీదైన కారునలా రోడ్డుమీద వదిలేసి వెళ్ళారంటే నా కొక్కటే తోస్తోంది—సరోజతోపాటు మరికొందరున్నారు—వాళ్లామెను కిడ్నాప్ చేసి తీసికెళ్ళిపోయారు."

"ఎక్కడికి? కారునలా వదిలేసి వెళ్తే వాళ్ళకు ప్రమాదకరం కాదా?"

"అవును—అది ప్రమాదకరమే! ఈ వ్యవహారమంతా నాకు వింతగా తోస్తోంది!"

"తర్వాత ఆశ్చర్యపోదురు గాని! ముందు ఆమె విషయం చూడండి! మీ మనుషుల్ని మొత్తం సిటీని గాలించమనండి! ఈ పని ఎంత వేగంగా చేస్తే అంతమంచిది. గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోకండి!" రావ్ ఆరిచి ఫోన్ పెట్టేశాడు.

# 10

స్వామి ది గ్రేట్ నిద్రమేల్కొని కూర్చున్నాడు.

అతని కళ్ళు మండుతున్నాయి. కారణం, కిటికీ రెక్కల సందులోంచి వంటగది పొగ లోనికొచ్చి నిండుతోంది. కళ్ళు నల్లుపుకొని టైం చూసుకున్నాడు. పదకొండున్నర-చాలా రాత్రయింది.

ఇంత రాత్రి వంట చేస్తోందెవరు? చీకటి పడుతోండగా తాను సుష్టుగా భోంచేసినట్టు గుర్తు. మళ్ళీ యెందుకు వండుతున్నారు.

అతను అసహనంగా మడతమంచం మీంచి లేచాడు. ఆ గదిలో అతను 12 గంటల పైగా ఒంటరిగా గడిపాడు. బయట ఏం జరుగుతోందో అతనికి తెలియదు.

సరోజ జ్ఞప్తికిరాని క్షణం లేదు. జ్ఞాపకమొచ్చినప్పుడల్లా అతని మనసు విలవిల్లాడుతోంది. ఆమెనేం చేశారు? ఆ లోకేష్ గాడితో కలిపి గదిలో తోశారా? ఎంతటి దుర్మార్గులు! వాడా మెని.... నిస్సహాయురాలిని.... పాపిష్టి చేతులతో తాకి—

స్వామి రక్తం మరిగింది. చివరికి—చివరికి—ఒక దుష్టుడి పశుత్వానికి ఆమె బలవుతోందా!

అతను పిడికిలి బిగించి చుట్టూ చూశాడు. తానేం చెయ్యాలి? ఈ ప్రశ్న ఇప్పటికి వందసార్లు వేసుకున్నాడు. మార్గం తోచలేదు!

ఆ గదిలోంచి బయటపడేందుకెలాంటి మార్గాలులేవు. తలుపు బయట తాళం వేసివుంది. వాటిని విరగ్గొట్టేందుకు తన శక్తి చాలదు! కిటికీ రెక్కలు బయటికి తెరచుకుంటాయి. లోపల లావాటి చువ్వలున్నాయి. వెంటిలేటర్ లేదు.

అతను తిరిగి మంచంమీద నిస్పృహగా కూర్చొని తన గురించి ఆలోచించాడు. తనేం చేశాడు! ఆ ఒక ఆడదానికి భయపడి సరోజను అపాయంలో తోశాడు! రావ్ కిది తెలిస్తే తన ఉద్యోగం వుండదు—బహుశ ప్రాణాలూ వుండవు! తానతనికి ముఖం చూపించలేడు! పారిపోవాలి! దూరంగా పారిపోవాలి! పారిపోయే ముందు సరోజను సురక్షితంగా ఇంటికి చేర్చాలి!

అతను ఆందోళనగా బల్లమీద వెలుగుతోన్న టేబిల్ లాంప్‌ని తదేకంగా చూడసాగాడు. క్షణాలు దొర్లుతున్నకొద్దీ అతనికి తొందరపాటు ఎక్కువయిపోతోంది.

సరోజని రక్షించడానికిప్పుడు సమయం మించిపోయిందని తెలుసు. కానీ, సరోజ తన యుక్తులతో తన్నుతాను రక్షించుకోగలదని నమ్మకం కలుగుతోంది. అయితే అలా ఎంతకాలం రక్షించుకోగలదు? ఆమె నిబ్బరం కోల్పోయే లోపున తాను విముక్తి కల్గించాలి!

అతను ఒక్కసారిగా తేరుకున్నాడు. అతను కోపంగా లేచి, అంతవరకూ తదేకంగా చూస్తున్న టేబిల్‌లాంప్‌ని సమీపించాడు. అతని నల్లటి పెదవులమీద చిరునవ్వు మెరిసింది. జుత్తులోకి వేళ్ళు పోనిచ్చి పిచ్చి సంతోషంతో పీక్కున్నాడు.

మరుక్షణం—

జేబులు వెతికి ఒక పావలాబిళ్ళ తీశాడు. కాలర్‌లో సిల్క్ రుమాలు తీసి, మీటనొక్కి లాంప్‌నార్పేశాడు. రుమాలుతో కాలుతోన్న బల్బ్‌ని నెమ్మదిగా తొలగించాడు. చీకట్లో అతని చేతులు వణుకుతున్నాయి.... పావలాబిళ్ళ పట్టుకొని, లాంప్‌ని పైకి వంచి, జాగ్రత్తగా

దాన్ని హోల్డర్‌లో వదిలాడు. లాంప్‌ని అలాగే వుంచి మీట నొక్కాడు.

హఠాత్తుగా లైట్లారిపోవడంతో వంటగదిలో చపాతీలు వేస్తున్న సింగ్ తిట్టుకున్నాడు.

మేడమీద గదిలో ఏవో రహస్యపత్రాలు చూస్తున్న గాయత్రికి ఆటంకం కలిగి గొణుక్కుంది. బాక్సర్ ఆమె ప్రక్కగదిలో గాఢనిద్రలో వున్నాడు. వెంకట్ మెట్ల క్రింద గదిలో నిద్రపట్టక దొర్లుతున్నాడు.

ఇంతలో వైనించి గాయత్రి కేక విని పరిగెత్తాడు. చీకట్లో ఆమె ఆకారం చూసి భయపడి, "ఏమిటాంటీ?" అన్నాడు.

"ఇడియట్! కరెంటు పోయిందని తెలియటంలేదట్రా! కొవ్వొత్తి వెల్గించు!" అర్చిందామె.

వెంకట్ లోనికెళ్ళి కొవ్వొత్తి వెతికి వెల్గించాడు. గాయత్రి ముందుకు వంగి కిటికీలోంచి బయటికి చూసింది.

"అదేమిటి?" బయట లైట్లు వెలుగుతున్నాయి కదరా....

వెంకట్ కూడా చూసి, "అవును, ఆంటీ...." అన్నాడు.

"సింగ్‌ని పిలువ్!" కసిరిందామె. "ఫ్యూజు పోయిందేమో చూడమను!"

రెండు నిమిషాల తర్వాత సింగ్ టార్చి పట్టుకొని బయలుదేరాడు. మెయిన్ దగ్గరకెళ్ళి ఫ్యూజులు లాగి చూశాడు. ఐ.సి. కటవుట్ ఫ్యూజుపోయింది. తీగవేసి పెట్టాడు. ఫ్యూజు ఎందుకు కాలిందా అనుకుంటూ మెయిన్‌స్విచ్ వేశాడు. లైట్లు ఛటుక్కున వెలిగి ఆరి

పోయాయి.

సింగ్ విసుక్కొని మళ్ళీ చూశాడు. అదే ఫ్యూజు పోయింది. మళ్ళీ వేశాడు. లైట్లు మళ్ళీ మెరుపులా వెలిగి ఆరిపోయాయి.

"ఏమిటీ న్యూసెన్స్!" అరిచింది గాయత్రి, "మాటి మాటికీ ఫ్యూజెందుకు పోతోంది?"

సింగ్ ఆలోచించాడు. "ఆంటీ, ఎక్కడైనా షార్ట్ సర్క్యూట్ అయిందేమో చూస్తాను."

సింగ్ వెనక్కి తిరిగాడు. గబగబ గదులన్నీ తిరుగుతూ టార్చితో వైరింగ్ పరిశీలించసాగాడు. లోకేష్ గది ముందాగి చూశాడు. తాళం వేసి వుంది. లోపల శబ్దం లేదు. భయపడి వెనుదిరిగాడు.

మెట్లుదిగి క్రిందికొస్తుంటే వెంకట్ వెంబడించాడు. సింగ్ అతన్ని చూసి పెనంమీద చపాతీ సంగతి చూడమన్నాడు. వెంకట్ తలూపి కిచెన్ కెళ్ళాడు.

సింగ్ మరో ఐదు నిమిషాలు క్రింది గదులన్నీ చూశాడు. అంతటా వైరింగ్ బాగానే వుంది. కానీ వసారాకొట్లో ఎలుకలు ఎక్కువగా తిరుగుతూ ఉంటాయి. ఒకవేళ అవక్కడ వైర్లు కొట్టేశాయా?

అతను వెంటనే వసారా కొట్టుకి నడిచాడు.

గదిబయట అడుగుల చప్పుడు విని స్వామి తలుపు ప్రక్కన మోకాళ్ళమీద కూర్చున్నాడు. చీకట్లో అతనికి గజం దూరంలో వస్తువు కన్పించడంలేదు. బయట తాళం తీస్తున్న చప్పుడవుతోంటే గుండె వేగంగా కొట్టుకొంది.

సింగ్ తాళంతీసి, గడియలాగాడు. వెంటనే జేబులోంచి కత్తితీసి, తలుపును నెమ్మదిగా కాలితో నెట్టి, లోనికి టార్చి వేశాడు. ఏర్పడిన సందులోంచి వెలుగు

లోపలికిపడి స్వామి ఊపిరి బిగబట్టేట్లా చేసింది. సింగ్ లోపల మంచం మీద దుప్పటి కప్పుకొని పడుకొన్న ఆకారాన్ని చూసి తేలికపడ్డాడు.

తలుపు మరికొంచెం తెరిచి, లోనికి అడుగువేసి, గోడలమీద వెలుగులేశాడు. అతని చేతిలో కత్తి దాడికి సిద్ధంగా వుంది.

స్వామి చేతులు విపరీతంగా వణుకుతున్నాయి. సింగ్ కాళ్ళు సరిగ్గా అతని ముందే వున్నాయి.

సింగ్ టార్చివేసి బల్లమీద వుంచివున్న లాంప్‌నీ, ప్రక్కనే విడిగావున్న బల్బునీ తికమకగా చూసి, మరో అడుగు ముందుకేశాడు. స్వామీ! త్వరపడు! అతని మెదడు చేతుల్ని ఆజ్ఞాపించింది. మరుక్షణం అతను కళ్ళు గట్టిగా మూసుకొని, సింగ్ రెండుకాళ్ళూ బలంగా పట్టుకొని వెనక్కి లాగేశాడు.

సింగ్ అదుపుతప్పి, ముందుకు తూలి బోర్లాపడ్డాడు. అతని ముఖం గట్టిగా నేలకు కొట్టుకొని, అరిచే శక్తిలేక బాధగా మూల్గాడు.

స్వామి మెరుపులా యెగిరి కాలెత్తి సింగ్ తలమీద తన్నాడు. సింగ్ మరోసారి మూల్గి వెల్లకిలా తిరిగి స్వామి కాలుపట్టుకున్నాడు. స్వామి విదిలించికొట్టేటప్పుడు మెలేసి పడేశాడు. స్వామి వెల్లకిలా పడుతూ సింగ్ చేతిలో కత్తిని విసురుగా తన్నాడు. కానీ సింగ్ పట్టువిడువక కత్తితో ఎగిరి, స్వామిమీద బోర్లాపడి కంఠం పుచ్చుకున్నాడు. అతని చెయ్యి మెరుపులా పైకి లేచింది.

చీకట్లో కళ్ళు చీల్చి తెల్లగా మెరుస్తున్న రాంపూరీ కత్తిని స్వామి రెండుక్షణాలు తీక్షణంగా చూశాడు. మరుక్షణం శక్తినంతా కూడదీసుకొని, తన కంఠం చుట్టూ

వున్న సింగ్ చేతి మీద ఒక దెబ్బ వేసి, కత్తివున్న చేతిని వెనక్కి విరిచి తిప్పాడు. సింగ్ బాధగా అరవబోయాడు. కానీ స్వామి ఆ అవకాశమీయలేదు. రెండు చేతులు బిగించి దవడక్రింద కొట్టాడు.

ఆ తాకిడికి సింగ్ మూడిబస్తాలా ఎగిరి ప్రక్కనపడ్డాడు. వెంటనే స్వామి చిరుతపులిలా లేచి పిడికిళ్ళతో వెల్లకిలా పడివున్న సింగ్ రెండు కాళ్ళమధ్య విసురుగా నాలుగు దెబ్బలు వేశాడు. సింగ్ ఉక్కిరిబిక్కిరయి మెలికలు తిరిగాడు. అతని చేతిలో కత్తి జారిపోయింది. చావు అతన్ని కబళిస్తోంటే గిలగిలమని చేపలా తన్నుకో సాగాడు....

స్వామి రుమాలు తీసి అతని నోట్లో కుక్కి నిలబడ్డాడు. అతని ఒళ్ళంతా చెమటలు కారుతున్నాయి. ఆయాసంతో వగరుస్తూ రెండు నిమిషాలు సేద తీర్చుకున్నాడు. అప్పటికి సింగ్ శరీరం పూర్తిగా నిర్జీవమైంది.

వంటగదిలో చపాతీలు వేస్తున్న వెంకట్ బయట అడుగులశబ్దం విని, "నువ్వేసిన చపాతీ కాలిపోయింది, సింగ్ భాయ్! కుక్కలు కూడా ముట్టుకోవు!" అన్నాడు.

స్వామి వెంటనే అక్కడ నించి కదిలి హాల్లోకెళ్లాడు. ఇంట్లో యెక్కడా చప్పుడులేదు. ముఖద్వారం దగ్గరికి నిశ్శబ్దంగా వెళ్ళి చూశాడు. తాళం వేసివుంది. చకచకా మెట్లెక్కి మేడ చేరుకున్నాడు.

మొదటి గదిలో కొవ్వొత్తి దగ్గర గాయత్రి ఏవో కాగితాలు చదువుతూ కన్పించింది. అలికిడి కాకుండా అక్కడినుంచి కదిలి మూడు గదులవతల లోకేష్ గది ముందాగాడు. అతని గుండె దడదడలాడింది.

తలుపుకు చెవులు రిక్కించి విన్నాడు. చడీ చప్పుడు

లేదు! లోపలేం జరుగుతోంది? సరోజని నెమ్మదిగా పిలిస్తే? లాభంలేదు! బయట తాళం వేసివుంది.

అతను తాళంమీద టార్చివేసి చూశాడు. దాన్ని విరగ్గొట్టడానికి తన దగ్గర ఆయుధంలేదు. వున్నా అలికిడిని నివారించడం అసాధ్యం.

ఇంతలో రివ్వుమని గాలి వీచడంతో గాయత్రి గదిలో కొవ్వొత్తి ఆరిపోయింది. ఆమె ఇంగ్లీషులో ఏదో తిట్టుకుంటూ నడవాలోకొచ్చింది. స్వామి టార్చి ఆర్పేసి గోడ కతుక్కుని నిలబడ్డాడు. గాయత్రి వెంకట్‌ని కేకేసింది. స్వామి టార్చి క్రింద పెట్టేసి, చీకట్లో ఆమె ఆకారాన్ని చురుగ్గా చూస్తూ కత్తిని బలంగా పట్టుకున్నాడు.

గాయత్రి, వెంకట్‌ని మళ్ళీ పిలిచి మెట్ల దగ్గరకెళ్ళి నిలబడింది.

స్వామి అడుగులో అడుగు వేసుకుంటూ ఆమెను సమీపించసాగాడు. దగ్గరవుతోంటే గాయత్రి ఆకారం భీకరంగా కనిపిస్తోంది. మరో రెండంగల్లో పిల్లిలా ఆమెను చేరుకొని వెనుక నిలబడ్డాడు. అప్పుడే వెంకట్ ఆకారం హాల్లోంచి వచ్చి, మెట్లెక్కుతూ కన్పించింది.

స్వామి రక్తం గడ్డకట్టింది. అతని వేడివూపిరి ఎక్కడ గాయత్రికి తాకుతుందోనని కంపించిపోయాడు. అతని పరిస్థితి యింకా హీనమవుతోంటే సహించలేక రెండు చేతులతో ఆమె భుజాలు పట్టుకొని బలంకొద్దీ ముందుకు నెట్టేశాడు.

"ఓయమ్మోయ్!...." అంటూ గాయత్రి కెవ్వుమని కేకపెట్టి, డ్రమ్ములా దొర్లుకుంటూ వెళ్ళి క్రిందపడింది. ఆమెను అడ్డుతగిలి వెంకట్ కూడా ఆమెతో పాటు దొర్లాడు.

స్వామి రివ్వునుని తిరిగి ఆమె గదిలోపడ్డాడు. ఇంతలో దబదబమని తలుపులు చప్పుడు చేశాయి....విపరీతంగా వూగిపోతున్నాయి.

"మమ్మీ! ఏం జరిగింది? తలుపు తెరువ్!" లోకేష్ అరుస్తున్నాడు.

స్వామి విపరీతంగా వణుకుతూ చీకటిలో నిలబడ్డాడు. అతని మెదడు మొద్దుబారింది. వూపిరందడం కష్టమవుతోంది. లోకేష్ అరుపులు యింకా ఎక్కువయ్యాయి. స్వామి తేరుకొని పరిస్థితి గ్రహించాడు. చేత్తో టేబిల్ మీద తడిమాడు. టెలిఫోన్ తగిలింది.

ఆలస్యం చెయ్యకుండా రిసీవర్ ఎత్తి డయల్ చేయసాగాడు. డయలింగ్ పూర్తయ్యాక రిసీవర్ చెవి దగ్గర పెట్టుకున్నాడు. కనెక్షన్ దొరికి రెస్పాన్స్ రావడంతో నోరు తెరిచి, "హలో—" అన్నాడు.

సరిగ్గా అదే క్షణంలో ద్వారం దగ్గర ఒక భారీకాయం ప్రత్యక్షమైంది. స్వామినోటికి తాళం పడింది. చేతిలో రిసీవర్ తెలియకుండానే జారి పడింది. అవాక్కయిపోయాడు.

ఆ ఆకారం లోనికి కదిలింది. స్వామి బిక్కచచ్చి దాన్ని గుర్తించాడు.

తటాలున టేబిల్ మీద కత్తిని అందుకొని విచిత్రమైన అరుపుతో ఆల్సేషియన్ కుక్కలా ముందుకు దూకాడు. అతని చేతిలో కత్తి ఆ ఆకారం ఛాతీలో దిగబడింది— బలంగా—లోతుగా. కానీ, దాని బలిష్టమైన ఉక్కు హస్తాల్లో తన కంఠం నలిగిపోతోందని కాసేపటికిగానీ తెలిసిరాలేదు స్వామికి. అప్పటికి అతని ప్రాణాలు పైకి, పైపైకి పోతున్నాయి....

గాయత్రి కళ్ళు తెరిచి గాయపడ్డపులిలా చూసింది. అంతా చీకటి! ఒళ్ళంతా కమ్చీపెట్టి కొట్టినట్లు విపరీతంగా నొప్పులు! తల కొండను ఢీకొన్నట్లు సుత్తిపోట్లు! ఒంట్లో చేవంతా ఎక్కడ చచ్చింది! ఆమె గాభరాగా ఒళ్ళు తడుముకుంది....తనకేం జరిగిందో తెలుసుకొనేసరికి ఆమె నుండి మరో కేక వెలువడింది.

ఆమె కుడికాలు సహకరించడంలేదు! మధ్యకి విరిగి వేలాడుతోంది! ప్రాణంపోయే బాధ!

ఆమె చావుభయంలో నేలమీద కొంతదూరం ప్రాకింది. అప్పుడామె చేతికి ఎవరివో వెంట్రుకలు తగిలాయి. అది తల. దాన్ని తడిమి చూసి ఆదెవరిదో గుర్తుపట్టి ఆందోళనగా అంది:

"వెంకట్! వెంకట్! లే!...."

కానీ వెంకట్ మెట్లమీంచి దొర్లుతున్నప్పుడు ఆమె ఏనుగు శరీరం క్రింద నలిగి వూపిరందక చచ్చిపోయాడని ఆమెకు తెలియదు!

సమాధానం లేకపోవడంతో మిగిలిన అనుచరుల్ని కేకేసింది. అయినా ఎవరూ పలకలేదు!

ఇంతలో లోకేష్ అరుపు విన్పించింది: "మమ్మీ! ఏం జరిగింది నీకు?"

"ఏమీలేదు! నువ్వక్కడే వుండు! బయటికి రాకు! ఓహ్, వీళ్ళంతా ఎక్కడ చచ్చారు?"

"నువ్వు ముందు తాళంతీయ్! నేను చూస్తాను!"

"వద్దు! నువ్వు గది కదలకు!" గాయత్రి గట్టిగా అర్చింది, "యూ రోగ్స్! ఎక్కడ చచ్చార్రా మీరంతా! ఇలా తగలడండి!"

ఆమె అలసిపోయి తల వాల్చేసింది.

## 11

తెలతెలవారుతోండగా వారియర్‌కు అతని చీఫ్ ఆపరేటర్ దిలీప్ నుంచి ట్రంకాల్ వచ్చింది.

"గుడ్మార్నింగ్ బాస్. కిడ్నాపర్స్‌ని పట్టుకున్నాం. వాళ్ళిద్దరు హోటల్ నరకిలో యెంజాయ్ చేస్తున్నారు. వాళ్ళ చెవులు పిండితే సరోజని వాళ్ళే కిడ్నాప్ చేశారని తెలిసింది. వాళ్ళ పేర్లు కుమార్, మోహిని. ఇన్‌స్ట్రక్షన్స్ బాస్."

ఈ మాటలు వారియర్ నిద్రకళ్ళతో విన్నాడు.

"ఆ ఇద్దరెవరు?"

"గాయత్రి మనుషులంటున్నారు బాస్. సరోజనీ, ఆమె డ్రైవర్నీ హైదరాబాదులోనే తమ స్థావరంలో వుంచారట. తప్పుదోవ పట్టించడానికి కారుతో ఇక్కడికొచ్చారట."

"గాయత్రి గ్యాంగ్? ఆర్యూ ష్యూర్?"

"డెడ్ ష్యూర్, బాస్!"

"వెరీవెల్! నీకేం తెలుసు! వాళ్ళిద్దర్నీ తీసుకొని వచ్చేయండి. సరోజ కార్లోకాదు. మీ కార్లో. సరోజ కారు విడిగా తేవాలి!"

"అలాగే బాస్" అన్నాడు దిలీప్.

అతను ఫోను పెట్టేసి ఒళ్ళు విరుచుకున్నాడు. గాయత్రి గ్యాంగ్! అతని ముఖంలో అదోరకం నవ్వు వెలిసింది. గాయత్రీ! నేను అదృష్టాన్ని పరీక్షించుకొనే వలలో చిక్కుకున్న మరో బంగారు చేపవి కదా నువ్వు! అతను వికటంగా నవ్వాడు.

## 12

బయట కారు శబ్దం విని గాయత్రి ఉలిక్కిపడింది. రాత్రినుంచీ ఆమె ఆ కుర్చీలో అలాగే కునికిపాట్లు

పడుతోంది. సరైన నిద్రలేదు. కళ్ళు ఎరుపెక్కి తలపోటు ప్రారంభమైంది. ఆమె ఎదురుగా, మెట్ల దగ్గర, వెంకట్ శవం ఇంకా అలాగే పడివుంది. సహాయం కోసం ఆమె రాత్రినుంచీ కళ్ళు కాయలు చేసుకుంది. అతికష్టంమీద ప్రాకుతూ వెళ్ళి ఈ కుర్చీమాత్రం చేరుకోగలిగింది.

తలుపుకి లోపల తాళంవున్నా సింగ్, బాక్సర్ ఎక్కడికెళ్ళారో ఆమె కంతుబట్టడంలేదు! ఈ ఇంట్లో తనకు సహాయపడేవాళ్ళెవరేనా వున్నారంటే అది లోకేష్ ఒక్కడే! అతను పైన తాళంవేసిన గదిలో వున్నాడు. దురదృష్టం యెలా వెంటాడుతోంది! చీర కుచ్చిలో తాళంచెవి వున్నా పైకి వెళ్ళే శక్తి తనకి లేదు! ఇలాటి దుస్థితి ఏర్పడుతుందని తానెలా వూహించ గలదు! లేకపోతే డైట్ పాటించి శరీరాన్ని అదుపు చేసేది!

కారుశబ్దం విని ఆమెకు విజయవాడ వెళ్ళిన కుమార్ గుర్తొచ్చాడు. ఆ స్టుపిడ్ పంక్‌ని తను వెంటనే రమ్మంది. కానీ వాడు నిన్నంతా రాలేదు. సరే, ఎట్టకేలకు ఇప్పుడు సహాయం అందింది! ఆమె బాధగా కాలు పట్టుకొని, తెరిచి వున్న కిటికీలోంచి చూసింది.

వారియర్ కారు దిగి బ్రీఫ్‌కేసుతో వరండా చేరు కున్నాడు. సిగరెట్ విసిరేసి, తలుపుమీద తట్టాడు, సమాధానం రాకపోతే నెట్టి చూశాడు. తెరుచుకోలేదు. ప్రక్కకు తిరిగి కిటికీలోంచి చూశాడు.

హాల్లో గాయత్రి కనిపించింది.

వెంటనే అతను నవ్వాడు, "హాయ్, గాయత్రి!"

అతన్ని చూసి గాయత్రి ఒంటిమీద విషకీటకాలు పాకినట్లుంది. నోరు తెరిచి అరవబోయింది.

"నో, నో, డార్లింగ్! ప్రమాదంలేదు! నన్ను లోనికి రానీయ్."

గాయత్రి అడ్డంగా తలూపింది, "నువ్వు రాలేవు! తాళం వేసివుంది!"

"అయితే తీయ్!"

"నా వల్ల కాదు! వెళ్ళిపో, వారియర్!"

వారియర్ హాల్లో కలయజూశాడు. "నీ మనుషులు.... అరె, అదెవరు—చచ్చాడా?"

"నువ్వెళ్లిపో, వారియర్!" గాయత్రి మళ్ళీ అర్చింది.

"నో. డార్లింగ్! ఇక్కడేదో జరిగింది. నేను లోనికి రావాలి? మేడమీద నీ కిటికీ చూసుకుంటాను—దానికి చువ్వల్లేవు కదూ?"

అతను పరిగెత్తి మేడ కుడివేపుకెళ్లి పైపు పట్టుకొని ప్రాకాడు. తెరిచివున్న గాయత్రి కిటికీలోంచి లోనికి గెంతి అదిరిపడ్డాడు. వెంటనే గదిలోంచి క్రిందికి వురుకుతూ అరిచాడు:

"గాయత్రీ! ఇక్కడ మరో రెండు శవాలున్నాయి!"

"ఎవరివి?" గాయత్రి ఆత్రృతగా అడిగింది.

"ఒకడు నీ వస్తాదు—బాక్సర్, మరొకడు నీగ్రోలా వున్నాడు."

"అతను సరోజ డ్రైవర్! ఓహ్—యెలా జరిగింది?"

వారియర్ ఆమెను పరీక్షగా చూశాడు. "నీకేమయింది? కదల్లేకపోతున్నావు."

"ఇంకేం కావాలి! కుంటిదాన్నయ్యాను!"

"ఎలా గాయత్రీ!"

గాయత్రి రాత్రి సంఘటన వివరించింది. వారియర్ జాలిగా విన్నాడు.

"అయాం సో సారీ, గాయత్రి. ప్చ్, సరోజ ఎక్కడ?"

"ఆమె ఎవరు?"

"నువ్వింందాక ఆ నీగ్రో ఆమె డ్రైవరని చెప్పావు."

గాయత్రి నాలిక కరచుకుంది. నోరు జారాను, ఈ జిత్తులమారి నక్కముందు!

"నువ్విక్కడెందు కొచ్చావ్?" అర్చిందామె తీవ్రంగా.

"సరోజ గురించి" వారియర్ నవ్వాడు, "ప్చ్! నువ్వామెని కిడ్నాప్ చేసి ఇక్కడుంచావు. కానీ కారు విజయవాడ పంపావు....అది తెలివిగల పననుకున్నావా! ప్చ్, అక్కడ నా మనుషులు నీ మనుషుల్ని పట్టేసుకున్నారు-"

"ఈ పని నీ కెవరు చెప్పారు?"

"సరోజ మేనేజర్."

గాయత్రి ముఖం ఎర్రబడింది. తాను కుమారుడికోసం నిర్మించిన సౌధం ఒక్కసారిగా కూలిపడింది! తన పథకం పటాపంచలైంది!

వారియర్ ఆమెను గమనిస్తున్నాడు.

"వెల్. గాయత్రి. నీ పథకం చిత్తు! ఇక నీ ఎత్తులు పనికిరావు. సరోజ గురించి బుకాయించకు! ప్చ్, ఆమె ఇక్కడే వుంది. ఆమెని తెచ్చుకొని నువ్వింతవరకూ డబ్బు ఎందుకు కోరలేదో అర్థంగావడం లేదు! బహుశా అనుకోనిదేదో జరిగివుంటుంది. ప్చ్, ఇక్కడి వాతావరణం చెప్తోంది.... వెల్, పరిస్థితి చక్కబడ్డాక డబ్బు కోరుతా వనుకుంటాను. మరిందులో నా వాటా ఎంత డార్లింగ్?"

"ఏ వాటా? ఏమిటి నువ్వనేది?" గాయత్రి బలహీనంగా నవ్వింది.

వారియర్ నవ్వాడు. "కొత్తేమీ కాదు. ఇదివరకు రెండుసార్లు ఇచ్చుకున్నావు."

"ఇప్పుడు నీ కేమీ ఇవ్వను! గెటవుట్! ఆమెని డబ్బు కోసం తేలేదు!"

వారియర్ సీరియస్‌గా చూశాడు: "బుకాయించకు! ప్చ్, డబ్బుకోసం కాకపోతే మరెందుకు తెచ్చావ్?"

గాయత్రి అసహనంగా అంది, "నా కొడుకు— లో కేష్ కోసం!"

"లోకేష్!" వారియర్ నవ్వాడు, "వాడు ఆడంగి వెధవ! వాడికిలాంటి బుద్ధి ఎలా పుట్టింది?"

"నీ నాలిక చీరేస్తాను. బ్లడీ బాస్టర్డ్!"

"సరే, సరే, నా కనవసరం. ఆమెనెందుకు తెస్తే నా కేమిటి? నా మౌనం విలువ యాభై వేలు. కామెంట్ ప్లీజ్!"

"యూ బ్లాక్ మెయిలర్ బ్రూట్! నయా పైసా ఇవ్వను!"

"అలా మాట్లాడకు గాయత్రి.నువ్విివ్వకపోయినా రివాల్వర్‌తో నీ సేఫ్ పగలగొట్టి నేనే తీసుకోగలను!"

"యూ స్టింకింగ్ రాట్! నా సేఫ్ మీద చేతులేశావంటే చూడు, ఏం చేస్తానో!"

"ఏం చేస్తావు?"

"నీ చెయ్యి విరగ్గొట్టి దాంతో చచ్చేలా కొడతాను!"

వారియర్ పగలబడి నవ్వాడు.

"ఆహా, గాయత్రి! అది సినిమా డైలాగ్ కదూ? వన్స్‌మోర్ ప్లీజ్!"

గాయత్రి అకస్మాత్తుగా చీర కుచ్చుల్లోంచి రివాల్వర్ తీసి గురిపెట్టింది.

"అంత తెలివితక్కువ పనా?" వారియర్ అన్నాడు, "నువ్వు చేస్తావా? నో, గాయత్రి. నువ్వు చెయ్యవు. నీ మనుషులు నా బందీలని మర్చిపోయావా? నేనిక్కడ చచ్చిన క్షణానే—ప్చ్—వాళ్ళక్కడ పోలీసుల దగ్గర నీ గురించి కక్కేస్తారు! అది బాగుంటుందా? ప్చ్, నేను నీ క్షేమం కోరినట్టు నువ్వు కూడా నా క్షేమం చూడాలి. ఇద్దరికీ ప్రయోజనం.

కమాన్, నువ్వు లేచే స్థితిలో లేవు. నీ మనుషులు కూడా లేరు! సేఫ్ తాళాలిలా ఇవ్వు, నిజాయితీగా నేను కోరిన డబ్బు తీసి కెళ్ళిపోతాను ప్చ్, టు హెల్ విత్ యువర్ సరోజ! నాకేమిటి?"

గాయత్రి పరిస్థితి గ్రహించి చలించిపోయింది. ఈ నక్కను లొంగదీయడం కష్టం! హే భగవాన్! మళ్ళీ వీడి వాతన నే నెందుకుపడ్డాను? ఆమె ఆందోళనగా తాళంతీసి విసిరింది.

వారియర్ దానితో మేడమీద కెళ్ళాడు. అక్కడ సేఫ్ తెరిచి, అయిదు వందనోట్ల కట్టలు ఏరి, బ్రీఫ్ కేసులో సద్దుకున్నాడు.

క్రిందికు తిరిగివచ్చి తాళం ఇచ్చేశాడు.

"వెరీగుడ్ గాయత్రి! నీ దొంగనీతిని హర్షిస్తున్నాను" అతను నవ్వి తలుపు దగ్గరికి నడిచాడు. రివాల్వర్ తో తాళం బ్రద్దలుచేసి బయటికెళ్ళాడు.

కారెక్కి బయలుదేరి పావుగంటలో రావ్ ఆఫీసుకు చేరుకున్నాడు.

రావ్ అతన్ని చూసి ఆందోళనగా అన్నాడు:

"వారియర్! ఎక్కడున్నారు? ఉదయం నుంచీ చూస్తున్నాను!"

"ప్రోగ్రెస్ ఏమీ లేదు, సర్" వారియర్ అన్నాడు దిగులుగా. "ఆమె ఆచూకీ ఇంకా లభించలేదు! హోటల్స్ అన్నీ చెక్ చేశాం. ఫలితం లేదు. ఫ్రెండ్స్ వున్నారేమో తెలియదు. కానీ ఫ్రెండ్స్ దగ్గర బస చేస్తే కారు ఏలూరు కాలువ దగ్గరెందుకుంటుంది? ఆమె కారు వదిలి ఎక్కడికైనా పని మీద వెళ్ళివుంటే తిరిగి రావడానికి ఒక రోజు ఆసాంతం పట్టదు. ఆమెని కిడ్నాప్ చేశారు సర్. అయాం ష్యూర్. నా మనుషుల్ని కారులో రమ్మని చెప్పాను. ఆమెని ట్రేస్ చెయ్యడం ఇక సాధ్యం కాదు! కానీ ఇంతవరకు దుండగుల నుంచి ఫోన్ ఎందుకు రాలేదో అర్థం గావడం లేదు! ఒక వేళ—"

"ఆ విషయమే మీకు చెప్పాలని చెప్పాలనుకుంటున్నాను, వారియర్! రాత్రి నాకు ఫోన్ వచ్చింది!"

"మీకా!" వారియర్ ఆశ్చర్యంగా అన్నాడు.

"నాకే! రాత్రి వచ్చింది! నేను నిద్రలో వున్నాను. 12 గంటలనుకుంటాను, రింగయింది. రిసీవరెత్తాను. అవతలి గొంతు 'హాలో—' అంది. అంతే! లైను కట్ అయింది!"

వారియర్ ఆశ్చర్యపోయాడు.

"అతనే కిడ్నాపర్! నాకు ఫోన్ చేసి ఎందుకో భయపడి విరమించుకున్నాడు!"

"అతని గొంతెలా వుంది?"

"నిద్రమత్తులో గమనించలేదు!"

వారియర్ కొన్ని క్షణాలు రావ్‌ని తీక్షణంగా చూశాడు. అతని కళ్ళు ఒక్కసారిగా మెరిశాయి. ఛటుక్కున లేచినిలబడి అన్నాడు.

"యస్! కిడ్నాపర్ భయపడ్డాడు. అతను మళ్ళీ ఫోన్

చేయవచ్చు! డబ్బు ఎవరికి చేరు, సర్? నేను వెంటనే మీ ఫోన్‌ని టాప్ చేసే ఏర్పాట్లు చేస్తాను! మీరు కంగారు పడకండి! ఆమెని క్షేమంగా అప్పగించే బాధ్యత—"

అతను మాటలు అసంపూర్తిగా వదిలేసి బయటికి పరిగెత్తాడు. వేగంగా మెట్లుదిగి వచ్చి కారెక్కి బయలుదేరాడు. రావ్ విస్తుపోయి దిక్కులు చూడసాగాడు.

వారియర్ ఆఫీసుకు చేరుకొని, డైరెక్టరీ తిరగేసి ఒక నంబర్ డయలుచేశాడు. అవతల రెస్పాన్స్ రావడంతో వెంటనే గొంతు మార్చి అన్నాడు: "మిసెస్ రామకృష్ణ ప్లీజ్!"

"మీ రెవరు?" అంది అవతలి గొంతు.

"ప్చ్! మీ రెవరు?" ఎదురుప్రశ్న వేశాడు వారియర్.

"అనితని—మిసెస్ గిరిజ బంగళా నుంచి మాట్లాడుతున్నాను."

"ప్చ్! నేనామెతో మాట్లాడాలి!"

"మీ రెవరో ముందు చెప్పాలి!"

"ప్చ్! ఆమెతో నే మాట్లాడాలి—పర్సనల్! క్విక్. త్వరగా కనెక్టు చేయండి!"

కొన్ని క్షణాల తర్వాత అవతలి కంఠం మారింది.

"హలో.... నేను గిరిజని."

వారియర్ ఉలిక్కిపడి సర్దుకున్నాడు.

"గుడ్ మార్నింగ్ మాడమ్. మీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి. ఎవరూ వినడంలేదు కదా?"

"లేదు, ఎవరు మీరు?"

"అది చెప్పకూడదు. నా మాటను జాగ్రత్తగా వినండి! మీ కుమార్తె మా బందీగా వుంది. సరోజ ఆమె పేరు. ప్చ్—అవునా? ఆమెని కిడ్నాప్ చేసి విజయవాడ తీసి

కెళ్లాం. డబ్బు కావాలి మాకు. అవును....నో, నో, మాడమ్! మీరు అప్ సెట్ అవకండి. శేకిటీజీ!....ఈ రోజుల్లో ఇది చాలా సామాన్యం. టెన్ లాక్స్. వ్చ్, పది లక్షలు కావాలి.

ఈ రాత్రి 10 గంటలకి మీ మనిషిని డబ్బుతో విజయ వాడ పంపండి—హోటల్ న ర్తకిలో దిగితే మేం కలుసు కుంటాం. వింటున్నారా, మాడమ్? వ్చ్, మీరు వయసు పండిన ఆడవారు. భయపడి పోలీసుల దగ్గరికెళ్ళే పొర పాటు చెయ్యగలరు! ఆ తొందరపాటు మంచిది కాదంటు న్నాను. హలో....పలకరేమిటి? మీరు పోలీసుల్ని పిలిస్తే మీ కూతురికి నూరేళ్ళు నిండుతాయి. అర్ధమవుతోందా? మిసెస్—హలో—బదులు పలకండి! నా మాటలు విని పిస్తున్నాయా? హలో—హలో—హలో—"

# 13

అనిత ముంగురులు సవరించుకొని ట్రే అందుకుంది.

అప్పటికే మాడమ్‌కి భోజనం పదినిమిషాలు ఆలస్య మైంది. మాడమ్ ఉదయం నుంచీ గది కదల్లేదు. మద్రాసు, కలకత్తా, కొచ్చిన్, జంషెడ్ పూర్ .... మొదలైన దూర ప్రాంతాల్లో స్నేహితులకి ఉత్తరాలు వ్రాస్తూ కూర్చుంది. ఆ పని కామె ఉపక్రమిస్తే గంటల తరబడి వ్రాస్తూనే వుంటుంది. ఒక్కో ఉత్తరానికి కనీసం మూడేసి కాయి తాలు పాడుచేస్తుంది.

ఆమె ఆవస్థ చూసి అనిత సహాయానికి పూనుకుంటే ఒప్పుకోదు. వ్యక్తిగత విషయాలు మరొకరికి చెప్పి వ్రాయించే పద్ధతి తనకి నచ్చదంటుంది.

వ్యక్తిగత విషయాలు! నవ్వుకుంది అనిత. ఈ ఇంట్లో నాకు తెలియని రహస్యమంటూ వుందా? ఆమె నవ్వాపు

కుని గదిలో అడుగు పెట్టింది.

గది నిశ్శబ్దంగా వుంది. ఎడమవైపు సోఫాలో గిరిజ ప్రక్కకు వాలిపోయి కన్పించింది.... ఆలోచనలో అలసిపోయి వుంటుంది అనుకుంది అనిత.

కానీ, గిరిజ ఎడమచేతిలో టెలిఫోన్ చూసి కలవరం చెందింది. అవునూ, ఇందాక ఆమె ఫోన్‌లో మాట్లాడుతోంది కదూ? ఎందుకలా వాలిపోయింది? ఆమె గాభరాగా దగ్గరకెళ్ళి ట్రే టీపాయ్ పైన పెట్టింది. క్రిందమోకాళ్ళమీద కూర్చొని మాడమ్‌ని పిల్చింది. పలకలేదు. కంగారుగా తట్టింది. కదల్లేదు. గుండె అదురుతోంటే చెయ్యి పట్టుకొని నాడి చూసింది....

ఆమె నోటినుంచి గట్టికేక వెలువడి వెనక్కి విరుచుకుపడింది. టీపాయ్‌తో సహా దానిమీద పదార్థాలన్నీ చెల్లా చెదురయ్యాయి. ఆమె యింకా పిచ్చిగా అరుస్తూ బయటకురికింది. అతికష్టంమీద నిభాయించుకొని రావ్‌కి ఫోన్ చేసి విషయం చెప్పింది—

ఇరవై నిమిషాల్లో రావ్, డాక్టర్ని వెంటబెట్టుకొని వచ్చివాలాడు. డాక్టర్ గిరిజను పరీక్షించి ప్రయోజనం లేదని చెప్పాడు. రావ్ ముఖంలో నెత్తురుచుక్క లేదు! చెమటలు కక్కుతున్న అనితను చూసి బలహీన స్వరంతో అడిగాడు, "ఎలా జరిగిందిది?"

అనిత గొంతు వెంటనే పెగల్లేదు.

"ఆమె ఉత్తరాలు వ్రాస్తున్నారు. నేనీ గదిలోనే వున్నాను. ఇంతలో ఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తాను. కాని అవతలి మనిషి మాడమ్‌తోనే మాట్లాడాలన్నాడు. ఫోన్ ఆమెకిచ్చి, భోజనం తేవడానికి కిచెన్‌లో కెళ్ళాను.

పదినిమిషాల తర్వాత వచ్చి చూస్తే ఇక్కడ—"

"ఫోన్ చేసిందెవరు?"

"అతను పేరు చెప్పలేదు—"

"గొంతెలా వుంది?"

"అమితాబ్ బచ్చన్‌లా—"

"ఓహ్—అతనెవరు?"

"సర్! అతను మాట్లాడుతున్నప్పుడు వ్చ్! వ్చ్ అంటూ విపరీతంగా శబ్దాలు చేశాడు!"

రావ్ ఉలిక్కిపడ్డాడు: "ఏమిటీ!"

"అవును, సర్! సరిగ్గా విన్నాను!—" అంటూ అనిత మళ్ళీ ఆ చప్పుళ్ళు చేసి విన్పించింది.

రావ్ ఒక్కమాటులో ఫోన్ దగ్గరకెళ్ళి డయల్ చేశాడు.

"హలో ఇన్‌స్పెక్టర్! నేనొకడివల్ల మోసపోయాను! అతను నా అందుబాటులోనే వున్నాడు. కానీ మీ సహకారం కావాలి?—" అని అవతలి మాటలు కాస్సేపు విని బయటికి పరుగుదీశాడు.

హెడ్ క్వార్టర్స్‌లో డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్లు శివ నేశన్, డేవిడ్—రావ్ చెప్పింది జాగ్రత్తగా విని, తక్షణం బయలుదేరడానికి సిద్ధమయ్యారు.

పదినిమిషాల్లో కార్లో వారియర్ ఆఫీసుకు చేరుకున్నారు. వెనుక జీపులో మరో నల్గురు ఇన్‌స్పెక్టర్లు వచ్చారు.

రెండు చేతులమధ్య తల పెట్టుకొని తీవ్రంగా ఆలోచిస్తున్న వారియర్ పోలీసుల్ని చూసి అదిరిపడ్డాడు.

"హలో! ఏం జరిగింది?"

"వాడే! వాడ్ని నిలువుగా చీల్చండి, ఇన్‌స్పెక్టర్!"

రావ్ శక్తికొద్దీ అరిచాడు.

శివ నేశన్ వారియర్ దగ్గరకెళ్ళి తీక్షణంగా చూశాడు.

"వెల్, వారియర్. మాతో నీ దాగుడుమూతలు ఇవాళ్టితో ఆఖరు! బద్మాష్, డిసీజ్ ఎమర్జెన్సీ! నీ వెధవ బుకాయింపులతో మా సహనాన్ని పరీక్షించక ఒక ముక్కలో సరోజ ఎక్కడుందో చెప్పు."

"సరోజ! ఆమె యెవరు?" వారియర్ ముఖం ఎర్ర బడింది.

నేశన్ పిడికిలి విసురుగా అతని దవడ క్రింద తాకింది.

"ఇప్పుడు తెలుసా?"

"ఇన్‌స్పెక్టర్ డిటెక్టివ్‌ని కొట్టడం చట్ట—"

ఈసారి నేశన్ పిడికిలి గూబమీద తాకింది.

"ఓహ్! ఇది చట్టవిరుద్ధం! నన్ను కొట్టి—వ్చ్—"

డేవిడ్ అర్జెంటుగా అన్నాడు, "నేశన్, నా చెయ్యి గులపెడుతోంది—"

"నో, అబ్జెక్షన్. ప్రొసీడ్, మిస్టర్ డేవిడ్!"

డేవిడ్ ముందుకెళ్ళి వారియర్‌ని పట్టుకొని ఎడా పెడా వాయించాడు.

వారియర్ పెద్దగా రంకె వేశాడు.

"మీ సంగతి కోర్టులో చూస్తాను! సరోజ గాయత్రి దగ్గర వుంది—"

"గాయత్రి గ్యాంగ్?"

"యస్...." వారియర్ అన్నాడు మూలుగుతూ.

ఇన్‌స్పెక్టర్లంతా వారియర్‌నీ, అతని బ్రీఫ్ కేసునూ పట్టుకొని గాయత్రి స్థావరానికి బయలుదేరారు....

బార్లా తెరిచివున్న తలుపులోంచి లోనికొస్తోన్న వాహనాలన్ని చూసి గాయత్రి అదిరిపడింది. గుండె దడ

దడలాడింది! లేచి పరిగెత్తడానికి ప్రయత్నించి క్రిందపడి బాధగా కేకపెట్టింది. ఆమె కాళ్లలో సలుపు రక్తాన్ని తోడేసింది. నిస్సహాయంగా చూస్తూ గుటకలు వేయ సాగింది. కొన్ని క్షణాలు....మరో కొన్ని క్షణాలలో వాళ్ళు తనని....భరించలేకపోయింది. చీర కుచ్చిళ్లలోంచి రివాల్వర్ తీసి మేడమీదకు చూసింది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి అకస్మాత్తుగా.

"లోకేష్! నేనిక పోతున్నా్నరా!" అంది వణుకుతూ.

గాయత్రి రివాల్వర్ కణతికానించి కళ్ళు మూసుకుంది.

బయట కారు దిగుతోన్న ఇన్‌స్పెక్టర్లు లోన రివాల్వర్ షాట్ విని ఉలిక్కిపడ్డారు.

"ఏమిటది?" డేవిడ్ అడిగాడు చురుగ్గా చూస్తూ.

"హెచ్చరిక అనుకుంటాను...." అన్నాడు నేశన్.

ఇద్దరూ రివాల్వర్స్‌తో జాగ్రత్తగా వరండా చేరు కున్నారు. వాళ్ళు వారిస్తున్నా వినకుండా రావ్ వాళ్ళ ననుసరించాడు. మరో ఇద్దరు ఇన్‌స్పెక్టర్లు వెనుక వచ్చారు. తలుపు దగ్గర అందరూ ఆగి గాయత్రిని చూశారు.

ఆమె నేలమీద ప్రక్కకు ఒత్తిగిలి పడి వుంది....ఆమె తలనుంచి రక్తం ఇంకా ప్రవహిస్తోంది.

"ప్రాణాలు తీసుకుంది" అన్నాడు డేవిడ్.

"అక్కడ మరొకడు చచ్చాడు" అన్నాడు నేశన్, "కింద గదులన్నీ తెరిచవున్నాయి. సరోజ పైన వుండాలి! లెటజ్ గో!"

అందరూ మెట్లెక్కి పైకివెళ్ళారు. గాయత్రి గదిలో మరో రెండు శవాల్ని చూసి ఆగిపోయారు. స్వామిని చూసి రావ్ భయంగా అర్చి లోనికెళ్ళబోయాడు. డేవిడ్ వెనక్కి లాగాడు.

ముందుకు నడిచి శివ నేశన్ లోకేష్ గది ముందాగాడు. కాన్స్టేబు ఇన్‌స్పెక్టర్లతో గుసగుసలాడి, రివాల్వర్‌తో తాళాన్ని షూట్ చేశాడు. గడియ లాగి తలుపునో తాపు తన్నాడు——

భళ్లుమని తలుపులు తెరుచుకోవడంతో లోకేష్ ఛెంగు మని ఎగిరి, "హలో, హలో, సరోజని నేనే చంపేశాను ఇన్‌స్పెక్టర్!" అన్నాడు.

సరోజ బెదిరిన లేడిలా గుండెల్లో దిగబడిన కత్తితో క్రింద పడి ఉంది.

"సరోజా! మై డార్లింగ్!" రావ్ చిన్నపిల్లాడిలా విలపిస్తూ ఆ గదిలో దూరికాడు.

సరిగ్గా అప్పుడే లోకేష్ చెంగున వెనక్కి తిరిగి కిటికీ లోంచి బయటకు దూకేశాడు.

బయట ఫెళ ఫెళమంటోన్న అరుల చప్పుడుతో బాటు గావుకేక గాలిలో విన్పించి స్తంభించిపోయారు అంతా.

—: ఐపోయింది :—

# బర్త్ డే కానుక!

## వాణిశ్రీ

నాకు సబ్ ఇన్ స్పెక్టర్ నుంచి సర్కిల్ ఇన్ స్పెక్టర్ గా ప్రమోషన్ వచ్చినందుకు ఆనందంతో వుప్పొంగి పోయాను. జీతంలో పెరుగుదల, హోదా తల్చుకుని వుక్కిరి బిక్కిరయ్యాను. ఇన్నాళ్ళూ నేను హెడ్ లను, కానిస్టేబుళ్ళను మాత్రమే హడలగొట్టేవాడిని. ఇక నుంచి కొందరు యస్. ఐ. లను కూడా దడదడ లాడిస్తాను.

అయితే నన్ను పోస్టు జేసిన వూరు చూసి నీరుకారి పోవాల్సి వచ్చింది. అది వీర కేసరి పురం.

ఆ వూరు పేరుకి తగినట్లే వుంటుంది. ఆ వూరి పేరు ఇండియా ప్రజలకు సుపరిచితమే. ఆ వూళ్ళో వీరులు ఎక్కువగా వుంటారనడానికి నిదర్శనంగా దోపిడీలు, హత్యలు తరచుగా జరుగుతూ వుంటాయి. అక్కడి ప్రజలకు రాజకీయ చైతన్యం ఎక్కువట. అందుకే ఆ తాలూకాలో గొడవలు ఎక్కువట.

అక్కడికి ట్రాన్సఫర్ చేస్తే పనిష్మెంట్ వేసినట్టే

అని మా డిపార్ట్ మెంట్‌లో అనుకుంటారు. పోలీసు అధికారులు ఎవరూ అక్కడ వుండడానికి ఇష్టపడరు. ఏవేవో కుంటిసాకులు చెప్పి ట్రాన్స్‌ఫర్ కోసం ట్రై చేస్తుంటారు.

నేను ప్రమోషన్ మీద వెళ్తున్న వాడిని గనుక కొన్నాళ్ళు వుండక తప్పదు. తప్పదు గనుక బయల్దేరాను. అదృష్టవశాత్తు మా ఫాదర్ టౌన్‌లో ఇల్లు కట్టించి ఇచ్చి పోయాడు కాబట్టి, పిల్లల్ని కాలేజీలో చేర్పించి ఒంటరిగానే వీరకేసరిపురం బయల్దేరాను.

నాకు చార్జి ఇచ్చిన సర్కిల్ ఇన్‌స్పెక్టర్ నాకు పాత గురువే. నేను ఆయన క్రింద పనిచేశాను లోగడ.

"బ్రతికి పోయానోయ్!" అన్నాడు దీర్ఘంగా వూపిరి పీల్చుకుని.

"అయితే, నేను చచ్చానన్న మాట." అన్నాను నవ్వుతూ.

ఆయన గూడా నవ్వేశాడు.

ఇక ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా లారీలో సామాను వేసుకుని వెళ్ళిపోయాడు గురుడు ఫ్యామిలీతో సహా.

ఆ ఇంట్లోనే నేను దిగాను. ఒక్కడికే అంత ఇల్లు అనవసరమే అయినా హోటల్ భోజనం పడదు కాబట్టి వంటవాడిని పెట్టుకోవాలనుకున్నాను. ఆ ఏర్పాట్లన్నీ మావాళ్ళు చేసేశారు. తిరపతి అనేవాడిని వంటకు కుదిర్చారు. వయస్సు మళ్ళినవాడే అయినావంట బాగా చేస్తాడట.

ఆ ఏరియాలో యస్. ఐ. లు నన్ను కలుసుకుని పరిచయం చేసుకున్నారు. వీరకేసరిపురం తాలూకా కేంద్రం.

ఆ వూళ్ళో ఒక్కటే పోలీస్ స్టేషన్. అంగులో యస్. ఐ. కృష్ణమూర్తి పాత ఫ్రెండ్.

పేరుకి తాలూకా కేంద్రమేతప్ప మరుగుజ్జులా వుండి పోయింది వూరు. ఎలక్షన్స్ వచ్చినప్పుడు గొడవలు ఎక్కువట. ఆ వూళ్ళోకంటే చుట్టుప్రక్కల వూళ్ళల్లో జరుగుతుంటాయట రాజకీయ హత్యలు. అదంతా కృష్ణ మూర్తి చెప్పాడు.

"ప్రస్తుతానికి ఫరవాలేదు. ప్రశాంతంగానే వుంది. పంచాయితీ ఎలక్షన్స్ వస్తే మాత్రం మనం రిజర్వ్, సి. ఆర్. పి తెప్పించుకోవాల్సిందే." అన్నాడు కృష్ణ మూర్తి నవ్వుతూ.

అప్పుడు వుదయం తొమ్మిది గంటలైంది. నేను చార్జ తీసుకుని ఇరవై నాలుగు గంటలు కాలేదు.

కృష్ణమూర్తి నవ్వుతూనే వున్నాడు.

టెలిఫోన్ ఏడ్చింది.

రిసీవర్ ఎత్తి "పోలీస్ స్టేషన్ ప్లీజ్!" అన్నాను.

"కొండయ్యగారేనా?" ప్రశ్నించింది అవతల కంఠం.

"కాదు."

"మరి ఎవరు?"

"ఆయన నిన్ననే వెళ్ళిపోయాడు. నేను క్రొత్త సర్కిల్ ఇన్‌స్పెక్టర్ని."

"నమస్కారం సార్!" అంది అవతలి కంఠం.

"నమస్కారం. ఎవరు మీరు?"

"నా పేరు ప్రతాపరాయుడు సార్. జమీందారుగారి అబ్బాయిని."

"అలాగా!"

"కొండయ్యగారు నాకు ఫ్రెండ్."

"అలాగా!"

"మిమ్మల్ని కలుసుకోవడానికి వస్తాను. స్టేషన్లో వుంటారు కదా!"

"ఉంటాను. ఏమైనా పనా?"

"పనేం లేదు సార్! ఏమీ తోచక. మీరిప్పటికే తెలుసుకుని వుండాలి. ఈ వూళ్ళో చదువుకున్న వాళ్ళకి ఏమీ తోచదు. అందుకే వున్న కొద్దిమందితో కాలక్షేపం చేస్తుంటాను."

'పాపం' అనుకున్నాను.

"ఎవరీ ప్రతాపరాయుడు. ఫోన్లోనే బోర్ కొట్టేస్తున్నాడు?" అన్నాను నవ్వుతూ.

"ఒకప్పుడు ఈ ఏరియా జమీందార్ల క్రింద వుండేది. ఆ వంశం వాళ్ళు ఇంకా ఇక్కడే వున్నారు. నరసింహారాయుడని జమీందారు వున్నాడు. పక్షవాతం వచ్చి మూల పడ్డాడు లెండి. ఆయన ఏకైక కుమారరత్నం ఈ ప్రతాపరాయుడు. కొంచెం స్క్రూ లూజు. అయితేనేం మనకి కాలక్షేపం." అంటూ నవ్వాడు కృష్ణమూర్తి.

ఇంతలో ఎవరో అతను వచ్చి విష్ చేసి నిల్చున్నాడు.

"ఏమిటి?" ప్రశ్నించాను.

"నా పేరు రామారావు సార్!"

"వూఁ...."

"సెంటర్లో వెల్‌కమ్ హోటల్ నాదే."

"ఏం కావాలి?" విసుగ్గా అన్నాను.

"మా నాన్న కన్పించడంలేదు సార్!" విచారంగా అన్నాడు రామారావు.

"ఏం? మతిస్థిమితం లేదా?"

"వుహూఁ.... బాగానే వున్నాడు సార్."

"మరింకేమిటి? ఇంట్లో ఏదైనా గొడవ పెట్టుకున్నారా?"

"అటువంటిది ఏమీ లేదు సార్!"

"ఏమీ లేకపోతే ఎక్కడికి పోతాడు? ఎందుకు పోతాడు? చిన్నపిల్లవాడా తప్పిపోవడానికి." అన్నాడు కృష్ణమూర్తి.

"ఎప్పట్నుంచి కన్పించడంలేదు?" ప్రశ్నించాను.

"మొన్న రాత్రి ఇంటికి రాలేదు. వస్తాడులే అని వూరుకున్నాను. రాత్రివరకూ రాకపోతే అనుమానం వచ్చింది. ఎందుకైనా మంచిదని మీకు రిపోర్టు ఇవ్వాలని వచ్చాను." అన్నాడు రామారావు.

"కూర్చుని రిపోర్టు రాసివ్వు." అన్నాను.

అతను రిపోర్టు రాసిచ్చాడు.

వాళ్ళ నాన్న పేరు గోపయ్య. వయస్సు అరవై వరకు వుంటాయి. పొడుగ్గా వుంటాడు. తెల్లటి పంచె, లాల్చీ వేసుకుని వుంటాడు.

"ఫోటో వుందా?"

తల వూపాడు రామారావు.

"ఒకటి పంపిస్తే మంచిది." అన్నాను.

"అలాగే పంపిస్తాను సార్. మీరు దయచేసి మా నాన్న ఏమయ్యాడో చూడాలి సార్." అన్నాడు.

"సరే...." అన్నాను విసుగ్గా.

రామారావు వెళ్ళిపోబోతుంటే స్టేషన్ బైట జీప్ ఆగిన శబ్దం వినిపించింది.

అ వచ్చిన కుర్రాడు రామారావుని పలకరించి లోపలకు వచ్చి నాతో కరచాలనం చేసి "గ్లాడ్ టూ మీట్ యూ సార్." అన్నాడు.

"ఇతనే సార్ ప్రతాపరాయుడు. పిల్లజమీందారు." నవ్వుతూ అన్నాడు కృష్ణమూర్తి.

"భలేవాళ్ళు సార్! జమీందారులు పోయి ఎంత కాలమైంది. మేం పేరుకే జమీందారులం." అన్నాడు.

నేను అతన్ని పరీక్షగా చూశాను.

ఎర్రగా ఎత్తుగా వున్నాడు. పాతికేళ్ళు పైనే వుంటాయి అతనికి. హిప్పీక్రాపు, సైడ్ లాక్స్‌తో అప్టూడేట్‌గా డ్రెస్ చేసుకుని చలాకీగా మాట్లాడుతున్నాడు. కృష్ణమూర్తి చెప్పినట్లుగా కొంచెం వాగుడు ఎక్కువే. తనకు అనవసరమైన వాటిలో కూడా తలదూర్చేలా అనిపించాడు.

"రామారావు వచ్చాడెందుకు సార్!" అన్నాడు ఎంతో చనువుగా.

నాకు చిరాకు పుట్టింది. అవన్నీ ఇతనికెందుకు అనుకున్నాను. అందుకే చెప్పలేదు.

"వాళ్ళ నాన్న మొన్నట్నుంచి కన్పించడంలేదట. రిపోర్టు ఇవ్వడానికి వచ్చాడు." అన్నాడు యస్. ఐ. కృష్ణమూర్తి.

"ఎవరూ ఆ ముసలాయన గోపయ్యా!" అంటూ ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"ఆ ముసలాడు అసాధ్యుడు సార్! ఎక్కడికి పోతాడు?" అన్నాడు ప్రతాపరాయుడు.

"మీకు పరిచయం వుందా?"

"లేకపోవడం ఏమిటి సార్? చెప్పకూడదుగాని ఆ ముసలాడు గుడిని.... అందులో లింగంతో సహా మింగేసే రకం...."

"అలాగా?"

"నా చిన్నప్పుడు, మా కోటలో పనిచేసేవాడు సార్. అన్నం పెట్టి పాతిక రూపాయలు జీతం ఇచ్చేవాడు మా నాన్న."

"ఐ....సీ...."

"అటువంటి వాళ్ళ ఫామిలీ ఈరోజు ఏ పొజిషన్‌లో వుంది?"

"మీరే చెప్పండి?"

"మీకు క్రొత్త. తెలీదు గదా! నేనే చెప్తాను. కృష్ణమూర్తిగారికి తెలిసి వుండొచ్చు." అన్నాడు.

"నో....నో....నాకూ పెద్దగా తెలీదు. మీరే చెప్పండి." అన్నాడు కృష్ణమూర్తి.

"మెయిన్ బజార్లో బస్టాండు ఎదురుగా వెల్‌కమ్ హోటల్ వుంది. అది వాళ్ళదే. రోజుకు వెయ్యి రూపాయలు అమ్ముతుంది."

"వూఁ...."

"పాత పెంకుటిల్లు పడగొట్టించి రెండంతసుల మేడ కట్టించాడు. లక్షకు తక్కువ చెయ్యదు. పాతిక ఎకరాలు మాగాణీ కొన్నాడు. అదిగాక పది ఎకరాల మామిడి తోట...."

"ఎలా సంపాదించాడు?"

"చెప్పాను గదా సార్! అసాధ్యుడని. పాతికేళ్ళ క్రితం పాతిక రూపాయల జీతంతో బ్రతికినవాడు ఇంత ఆస్థి సంపాదించాడంటే ఆ ముసలాడి బ్రెయిన్ ఎంత గొప్పదో గదా! అటువంటివాడు తప్పిపోవడం ఏమిటి సార్!" అంటూ నవ్వాడు ప్రతాపరాయుడు.

"మరి ఎక్కడికి పోయివుంటాడు?" ప్రశ్నించాను.

"ఈ మధ్య ఆ ముసలాడు ఎక్కువగా త్రాగుతున్నట్లు

తెలుస్తోంది. ఇంట్లో గొడవలవల్లనట. విరక్తి పుట్టి త్రాగి త్రాగి ఎక్కడైనా హరీ అన్నాడేమో?"

"వాట్?" ఆశ్చర్యపోయాను ప్రతాపరాయుడు అంత ఖచ్చితంగా చెప్తుంటే.

"త్రాగి రోడ్డు ప్రక్కన పడిపోయివుంటే నా జీప్‌లో వేసుకుని ఇంట్లో జేర్చాను ఎన్నో సార్లు. తర్వాత చెప్పాను గూడా ఎప్పుడో అలాగే దిక్కులేని చావు చస్తావని." అన్నాడు.

"మరి ఇదంతా అతని కొడుకు చెప్పలేదే?" సందేహంగా అన్నాను.

"ఎందుకు చెప్తాడు సార్? ఈ మధ్య తండ్రికి కొడుక్కీ పడటంలేదు. ఈ ముసలాడు చావనన్నా చావడేమని విసుక్కుంటున్నాడు గూడా. అసలు కొడుకే చావగొట్టి పారేసి మీకు రిపోర్టు ఇచ్చాడేమోనని నా అనుమానం." అన్నాడు ప్రతాపరాయుడు.

నేను ఆశ్చర్యంతో నోరు తెరుచుకున్నాను. కృష్ణమూర్తి మతిపోయిన వాడిలా చూస్తున్నాడు గుడ్లప్పగించి. ఆ సమయంలో ఆ పిల్లజమీందారు మాకు డియస్పీలా కన్పించాడు.

"సరే సార్! ఆ గొడవలో పడి అసలు సంగతి మర్చిపోయాను. ఈ రాత్రి డిన్నరు మా ఇంట్లోనే మీకు." అన్నాడు.

"ఎందుకూ?" అన్నాను.

"ఎందుకేమిటి సార్! మీరు ఈ వూరు వచ్చిన సందర్భంలో అనుకోండి. ఏమంటారు కృష్ణమూర్తి గారూ! అసలు డిన్నర్‌కి రావడానికి ఒక సందర్భం అంటూ వుండాలని రూల్ ఏమన్నా వుందా ఏమిటి?" అన్నాడు.

యస్. ఐ. చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

నేనేమో ఇబ్బందిగా కదిలాను కుర్చీలో. అసలే ఈ ఏరియాలో రాజకీయాలు రావణ కాష్టాలు. ఈ పిల్ల జమీందారు ఏ పార్టీయో, ఏ వర్గమో, ఎవరి మనిషో, ఇతనితో క్లోజ్‌గా వుంటే ఏమేమి అనర్థాలు జరుగుతాయో! ఎవరెవరికి పుండుమీద కారం పడుతుందో? ఏ నాయకుడి ఆగ్రహానికి గురికావలసి వస్తుందో?

అదంతా ఆలోచించి డిన్నర్‌కి ప్రస్తుతానికి రానని ఏవేవో కుంటిసాకులు చెప్పి, ఆ పిల్లజమీందారుని డిస్పోజ్ చేసేసరికి నా తల ప్రాణం తోకకి వచ్చింది.

## 2

మధ్యాహ్నం భోజనంచేసి స్టేషన్‌కెళ్ళి పాత రికార్డులు తిరగేస్తూ కూర్చున్నాను, ఆ ఏరియాలో క్రైమ్స్ ఎలా వుంటాయో తెలుసుకోవడానికి.

హెడ్‌కానిస్టేబుల్ ఎవర్నో పట్టుకొచ్చి ఎదుట నిలబెట్టాడు. ఎవరో ముసలోడు. నన్నుచూసి రెండుచేతులూ ఎత్తి నమస్కారం చేశాడు.

"ఎవరు నువ్వు?"

"రుద్రయ్యపాలెం వెట్టోణ్ణి అయ్యా!" అన్నాడు.

"ఏమిటిది?"

"మునసుబు నాయుడు పంపారయ్యా!" అంటూ ఒక చీటీ అందించాడు.

అది చదివి తల చేత్తో పట్టుకోవాల్సి వచ్చింది. ఆ వూరి శివార్లలో ఒక పాడుబడిన బావిలో శవం తేలిందట.

"రుద్రయ్యపాలెం ఎక్కడ?" హెడ్‌ని అడిగాను.

"దగ్గరే సార్. ప్రక్కవూరే."

"ఎంత దూరం వుంటుంది?"

"నాలుగు మైళ్ళు వుంటుంది సార్!"

"జీప్ వెళ్తుందా?"

"ఎండాకాలం వెళ్తుంది సార్?."

"ఇది ఎండాకాలమే గదా?"

"అవును సార్!"

"మరి జీప్ వెళుతుంది గదా!"

"వెళుతుంది సార్!"

"మరి ఆ సంగతి ముందే చెప్పకుండా అతి తెలివి చూపిస్తావేం?" అని లెఫ్టరైట్ ఇచ్చాను హెడ్‌కి.

అతని ముఖం నయాపైసా అంత అయింది. నాకు చిరాకు ఇటువంటి డొంకతిరుగుడుగాళ్ళంటే.

"యస్. ఐ. ఏడి?"

"ఇంకా రాలేదు సార్!"

"వెళ్ళి పిలుచుకుని రా. అర్జెంట్. మర్డర్ కేస్ అని చెప్పు."

హెడ్ పరిగెత్తాడు.

కృష్ణమూర్తి హడావుడిగా వచ్చాడు. రాగానే రుద్రయ్యపాలెం మునసబు పంపిన రిపోర్టు చూపించాను.

"ఒకవేళ ఆ శవం ఆ గోపయ్యదేమో?" సందేహం వెలిబుచ్చాడు.

నాకా ఐడియా రానేలేదు. నిజమే అతని కొడుకుని గూడా తీసికెళ్తే గొడవ వదిలిపోతుంది అనిపించింది. రుద్రయ్యపాలెం పోతూ దార్లో రామారావుని ఎక్కించుకుని వెళ్లాం.

మేం వెళ్ళేసరికి పూరిబైటే వున్నారు జనం. లావుగా పొట్టిగా వున్నాయన మునసబు నాయుడట. పరిచయం

చేసుకున్నాడు. ఇంకా వూరి పెద్దలు కొందరు వున్నారు.

అక్కడికి దగ్గర్లోనే వుంది పాడుబడిన శవం. వెళ్ళి చూశాను. కుళ్ళిన వాసన వస్తోంది. బైటికితీసిన తర్వాత రామారావు శవాన్ని గుర్తుపట్టి గొల్లుమన్నాడు. అది తన తండ్రిదే అని ఏడుస్తూ చెప్పాడు.

రామారావు ఏడుస్తుంటే నాకు సానుభూతి కలగడం లేదు. ప్రతాపరాయుడు చెప్పిన విషయాలు గుర్తు కొచ్చాయి. ఒకవేళ కొడుకే తండ్రిని చంపి నాటకం ఆడుతున్నాడేమో అనిపించింది. ఈ రోజుల్లో కొడుకులు తండ్రిని చంపడం అనేది సర్వసామాన్యమైన విషయమై పోయింది. నా సర్వీసులో ఇటువంటివి లెక్కలేనన్ని చూశాను.

కాసేపు అతన్ని ఏడవనిచ్చి భుజంతట్టి "విచారించకు? ఎందుకు జరిగింది ఇలా? మీ ఇంట్లో ఏవైనా గొడవలు జరిగాయా?" అన్నాను.

"గొడవలు ఏం లేవు సార్! అదంతా మా తమ్ముడివల్ల వచ్చింది?" అన్నాడు కళ్ళు తుడుచుకుంటూ.

"ఏమిటి?"

రామారావు చెప్పుకొచ్చాడు. అతని తమ్ముడు లక్ష్మణ రావట. బి. ఏ. ప్యాసై ఇంట్లో వున్నాడట. చదువుకునే రోజుల్లోనే ఎవరో మాలవాళ్ళ అమ్మాయిని ప్రేమించాడట. ఆమెనే పెళ్ళి చేసుకుంటానని పట్టుబట్టాడట. అవతల ఎవరో ఏభై వేలు కట్నం ఇస్తానని తిరుగుతున్నారట. వాళ్ళ నాన్న ఈ సంబంధం చేసుకోమని తిడుతున్నాడట. కాని తమ్ముడు వినడంలేదట. ఇంట్లో ప్రతి రోజూ ఇదే గొడవట.

"మరి నీ వుద్దేశ్యం ఏమిటి?"

"తన మాట వినలేదని ఆత్మహత్య చేసుకుని వుండొచ్చు!" అన్నాడు రామారావు.

"దానికి ఇంత దూరం రావాలా?" ప్రశ్నించాను.

రామారావు సమాధానం చెప్పలేదు. అసలే దుఃఖంలో వున్నాడుగదా. అది నిజంకానీ, కాకపోనీ అనుకుని నేను రెట్టించి అడగలేదు. నిజం ఈవాళ కాకపోయినా రేపు బైటపడక తప్పదు.

శవ పంచాయితీ జరిపిన తర్వాత శవం హాస్పటల్ కి పంపాను పోస్టుమార్టమ్ రిపోర్టు కోసం.

అప్పుడు మాత్రం రామారావు ఎంతో రిక్వెస్టు చేశాడు. పోస్టుమార్టమ్ కోసం హాస్పటల్ కి పంపితే శవాన్ని కోస్తారనీ, అదంతా ఎందుకనీ, శవాన్ని ఇచ్చేస్తే అంత్యక్రియలకు ఏర్పాట్లు చేసుకుంటాననీ బ్రతిమాలాడు.

అతను బ్రతిమాలే కొద్దీ నాకు అనుమానం బలపడుతోంది. అదంతా కుదరదు అని చెప్పి స్టేషన్ కి వెళ్ళిపోయి కూర్చున్నాను.

కొంచెంసేపు కూర్చుని ఆలోచించాను. గోపయ్య ఆత్మహత్య చేసుకోవాలనుకుంటే ప్రక్క వూరుపోయి ఎందుకు చేసుకోవాలి? అందుకు ఎన్నో మార్గాలు వున్నాయి గదా! పోయి పోయి బావిలోనే పడాలా? అదీ నాలుగు మైళ్ళు నడచి. నమ్మశక్యంగా లేదు. ఏదో గోల్ మాల్ వుంది.

ఎఫ్. ఐ. ఆర్. తయారు చేయడంలో నిమగ్నమై పోయాను.

# 3

పోస్టుమార్టమ్ రిపోర్టు నా అనుమానాన్ని బలపర్చింది. గొంతునులిమి ఊపిరి ఆడకుండా చేసినందువలన ప్రాణం పోయిందని డాక్టర్ రిపోర్టులో రాశాడు.

అంటే ఎవరో చంపి ఆ శవాన్ని బావిలో పడేసి చేతులు దులుపుకున్నారన్నమాట.

పోస్టుమార్టమ్ రిపోర్టు ముందుపెట్టుకుని ఆలోచిస్తూ కూర్చున్నాను.

స్టేషన్ ముందు జీప్ ఆగింది.

ఇంకెవరు ప్రతాపరాయుడే. విష్ చేసి కూర్చున్నాడు నవ్వుతూ.

"ఏమిటి దీర్ఘాలోచనలో వున్నారు?"

"గోపయ్యను చంపిన హంతకుడు ఎవరా అని ఆలోచిస్తున్నాను."

ప్రతాపరాయుడు సీరియస్‌గా సిగిరెట్ వెలిగించి రెండు దమ్ములు పీల్చి "మీరేమీ అనుకోనంటే చెప్తాను" అన్నాడు.

"ఏ విషయం?"

"గోపయ్య మర్డర్ కేసు గురించి."

"మీరు క్లూ ఇస్తానంటే వద్దంటానా? సంతోషంగా వింటాను. అనుకోవడం ఎందుకు?"

"మీరు మంచివారు గనుక అలా అన్నారు. కొందరైతే.... పేర్లు చెప్పడం ఎందుకుగాని....ఎవరైనా నా బోటివాడు సలహా చెప్తే వినుక్కుంటారు. ఆ మాత్రం మాకు తెలియదా? నా సర్వీస్ ఎంతో తెలియదా? నీ వయస్సెంత వుంది. గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించింది అన్నట్లు అర్థం వచ్చేలా మాట్లాడతారు. అందుకని ముందే అలా

అన్నాను." అన్నాడు ప్రతాపరాయుడు.

నేను నవ్వి వూరుకున్నాను.

"నేను చెప్పే విషయాలు విని మీకు చాలా అసహ్యం కలగొచ్చు. కాని నగ్నసత్యం చెప్తున్నాను."

నాలో కుతూహలం హెచ్చింది. ప్రతాపరాయుడు ఆ వూరి వాడు. పైగా గోపయ్యతో అతనికి పరిచయం వుంది. కాబట్టి అతన్ని హత్యచెయ్యడానికి ఎవరికి అవకాశం వుందో తెలిసి వుండొచ్చు. ఆ విధంగా హంతకుడిని పట్టుకోవడానికి ఏదైనా క్లూ దొరకవచ్చు.

"కాంత, కనకం విషయాల్లో మనుష్యులు ఎంత నీచానికి దిగజారతారో వివరించే కథలు మనకు పురాణాల దగ్గర్నుంచి కోకొల్లలుగా వున్నాయి. రోజూ పేపర్లో ఎన్నో వార్తలు చూస్తున్నాం. అటువంటిదే ఈ కథ."

"మీకు కథలు రాసే అలవాటు వుందా?" నవ్వుతూ ప్రశ్నించాను.

ప్రతాపరాయుడు తెల్లబోయాడు.

"ఏం అలా అడుగుతున్నారు?" అన్నాడు.

"ఏం లేదు. మీరు కథ చెప్పే పద్ధతిలో చెప్తుంటే అనుమానం వచ్చింది."

అతను నవ్వాడు.

"భలే జోక్స్ వేస్తారే మీరు?"

"అయితే కథలు రాయరన్నమాట."

"చెప్పడం వచ్చుగాని, రాయడం రాదు. వస్తే కట్టలు, కట్టలు రాసి ఎడిటర్లను హడల గొట్టేవాడిని."

"బ్రతికి పోయారు."

"ఎవరు?"

"ఎడిటర్లు."

నవ్వాడు అతను.

"అసలు కథలోకి రండి."

"ఆఁ....వస్తున్నాను. ఊరి చివర మామిడితోటలో గోపయ్య ఇల్లు కట్టించాడు."

"ఆఁ...."

"అందులో ఒక ముండని వుంచాడు."

"ఎప్పుడు?"

"ఎప్పుడో పదేళ్ళక్రితం అనుకుంటాను."

"వూఁ...."

"ఆవిడ పేరు ముత్యాలు, అప్పటికే నలభై దాటి వుంటాయి. దానికొక కూతురు వుంది. ఇద్దరూ తోటలో వుండేవాళ్ళు. గోపయ్యకి అప్పటికే భార్య పోయింది గనుక ఏ గొడవా లేకపోయింది. రెండేళ్ళక్రితం ముత్యాలు చచ్చిపోయింది."

"ఏం పాపం?"

"ఏదో....వుబ్బసం లాంటి రోగం."

"అలాగా!"

"అంతవరకూ బాగానే వుంది. తనకి పుట్టకపోయినా తను వుంచుకున్న దాని కూతురు తనకి ఏ వరస అవుతుంది?"

"వరసైతే కూతురే." అన్నాను.

"అవునా? అది ధర్మం కూడాను. ఆ పిల్లకి ఇరవై ఏళ్లొచ్చాయి. పెళ్ళిచేసి పంపితే ఎంత బాగా వుండేది?"

"బాగానే వుండేది."

"ఆ ముసలాడు పెళ్ళి చెయ్యలేదు. సరిగదా తనే వుంచుకున్నాడు."

"ఈజిట్?"

"యస్సార్! వాడుట్టి నీచుడు."

"మీరు చెప్తుంటే నాకు అసహ్యం వేస్తోంది." అన్నాను.

"ఇంకా అసహ్యకరమైన విషయం చెప్పబోతున్నాను." అన్నాడు అతను సిగరెట్ పీకను బూటు క్రిందవేసి నలుపుతూ.

నాకు ఆశ్చర్యం వేస్తోంది ఆ కథంతా.

"వయస్సులో పిట పిటలాడుతున్న పిల్లను వుంచుకున్నాడేగాని లాభం ఏముంది? ఆ పిల్ల ఈ ముసలాడితో అడ్జెస్టు కాలేకపోయింది."

"వూఁ...."

"గోపయ్య కొడుకు మీకు తెలుసుగా! అదేసార్ రామారావు."

"ఆఁ...."

"వాడు ఆ పిల్లను లోబరుచుకున్నాడు. తండ్రీ కొడుకుతో నాటకం మొదలుపెట్టింది ఆ పిల్ల."

"ఛీ....ఛీ...." అన్నాను. అదంతా వింటుంటే నాకు జుగుప్స కలుగుతోంది. వాళ్ళు మనుష్యులేనా? లేక జంతువులా అనిపిస్తోంది.

"అదేసార్! అసలు గొడవ. ఇటువంటి వ్యవహారాలు ఎన్నాళ్ళు దాగుతాయి. అది తెలిసి గోపయ్య కొడుకుని కొట్టాడు. అది మనసులో వుంచుకుని ముసలాడిని పైకి పంపించి వుంటాడు రామారావు." నెమ్మదిగా అన్నాడు ప్రతాపరాయుడు.

"ఆ పిల్ల పేరు ఏమిటి?"

"అంజమ్మ సార్!"

నేను ఆలోచనలో పడ్డాను. ప్రతాపరాయుడు చెప్పే

దాంట్లో ఎంతో సూక్ష్మమైన పాయింట్ వుంది. వరసా వాయీ లేని వాళ్ళకి తండ్రీ కొడుకు అనే ఆప్యాయతలు ఎక్కడ ఏడుస్తాయి.

తండ్రి తనకు అడ్డం అనుకున్నాడు తొలగించుకున్నాడు. అందుకే ఆ రోజు పోస్టుమార్టం కోసం శవాన్ని హాస్పటల్‌కి పంపుతుంటే వద్దని బ్రతిమాలాడు. ఆ నియోజకవర్గం ఎమ్మెల్యేని తీసుకొచ్చి చెప్పించాడు. ఎందుకైనా మంచిదని తన తమ్ముడి కథ ఒకటి చెప్పి వుంచాడు. మనస్సు విరిగి ఆత్మహత్య చేసుకుని వుంటాడులే అని అనుకోవడానికి వీలుంటుందని.

ఆలోచించే కొద్దీ రామారావు దోషిలా కనిపించాడు. కాని కేసు పెట్టడానికి ఆధారాలు దొరకాలి. అది అంత సులభం కాదు.

"మనం ఒకసారి ఆ అంజమ్మను చూడ్డానికి మామిడి తోటకి వెళ్ళామా?" అన్నాను.

ప్రతాపరాయుడు ఇబ్బందిగా చూశాడు.

"మనం అక్కడికి వెళ్ళడం ఎందుకు సార్! దాన్నే ఇక్కడికి రప్పించండి!" అన్నాడు.

"వద్దులెండి. అసలే రోజులు బాగాలేవు. ఆడదాన్ని పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్తే చాలు. నన్ను రేప్ చేశారు నాయనోయ్ అని గొడవ చేసిందంటే మొదటికే మోసం వస్తుంది. అందులోనూ ఆ అంజమ్మ అసాధ్యురాలని మీరే చెప్తున్నారు." అన్నాను.

"అః.... అసాధ్యురాలే."

"మనం వెళ్తే కొంత ప్రయోజనం వుంటుంది." అన్నాను.

"అః.... నేనెందుకు లెండి. బాగోదు. ఆ రామారావు

గాడు ఏడ్చి చస్తాడు. నేనే వాడిని పట్టించానని గొడవ చేస్తాడు. వద్దులెండి. మీరు వెళ్ళిరండి.” అన్నాడు.

అక్కడికి రావడానికి అతనికి ఇష్టంలేదని వెళ్ళి పోయాడు.

నేను ఇద్దరు కానిస్టేబుళ్ళని తీసుకుని బయల్దేరాను.

## 4

తోట చుట్టూ సర్కార్ తుమ్మ దట్టంగా పెరిగివుంది. లోపలకి పోవడానికి ఇనుపగేటు వుంది. మా జీప్ వెళ్ళేసరికి మూసి వుంది.

డ్రైవర్ హారన్ కొట్టాక ఎవరో వచ్చి తాళంతీసి గేటు తెరిచాడు.

జీప్ లోపలకు వెళ్ళింది. తోట మధ్యలో వుంది పెంకుటిల్లు.

ఇంకా సూర్యుడు అస్తమించక పోయినా చుట్టూ చెట్లు వుండడంవల్ల చీకటిపడినట్లు వెలుతురు తక్కువగా వుంది అక్కడ.

జీప్ ఆగగానే చుట్ట కాల్చుకుంటూ కూర్చున్న ముసలాడొకడు చుట్ట ఆర్పి దూరంగా పారేసి భయంగా లేచి నిల్చుని చేతులు కట్టుకున్నాడు.

వరండాలో నవారు మంచం వేసి వుంది.

నేను జీప్ దిగాను.

కానిస్టేబుళ్ళు నావంక చూస్తూ నిల్చున్నారు.

“అంజమ్మను పిలవండి.” అన్నాను.

“అంజమ్మ ఎక్కడ?” అని మా కానిస్టేబులు ముసలాడిని ప్రశ్నించాడు.

“లోపల వుందయ్యా!” అన్నాడు ముసలాడు.

“పిలువు. అయ్యగారొచ్చారని చెప్పు.”

ముసలాడు లోపలకు వెళ్ళాడు.

నేను పరిసరాలు గమనిస్తూ నిల్చున్నాను. ఆ పెంకు టింటికి దక్షిణంగా పశువుల కొట్టం వుంది. అందులో గేదెలు, ఎద్దులు కట్టేసి వున్నాయి. ఆ ప్రక్కనే పెద్ద గడ్డివామి వేసి వుంది.

ముసలాడు అంజమ్మను వెంటబెట్టుకుని వచ్చాడు.

వచ్చి బెరుగ్గా చూస్తూ నిల్చుంది.

ఆమెకు ఇరవై ఏళ్ళుంటాయని ప్రతాపరాయుడు చెప్పాడుగాని అంతకంటే ఎక్కువే అంటే పాతికేళ్ళ వరకూ వుండొచ్చు. లావుగా వుండడంవలన అలా అని పిస్తున్నదేమో మరి. ఏమైనా ఆడవాళ్ళ అసలు వయస్సు కనిపెట్టడం అంత సులభం కాదు.

చామన చాయలో పొట్టిగా ఆకర్షణీయంగా వుంది. పల్చటి నైలెక్స్ చీరలో ఆమె అవయవాలు స్పష్టంగా మగాడిని రెచ్చగొట్టే విధంగా వున్నాయి. ముఖం గుండ్రంగా కరుకుగా వుంది.

ఆమెలో పెళ్ళి కావలసిన పిల్లకుండాల్సిన లక్షణాలు ఏమీ కన్పించలేదు నాకు. ఆ అమాయకత్వం, కన్నెపిల్ల సొగసు అదేం లేదు. చిన్న వయసులోనే మొగుడు పోయి పుట్టింటికి చేరిన దానిలా, జీవితంలో ఆటు పోటులన్నీ అనుభవించిన దానిలా వుంది.

"కూర్చోండయ్యా!" అంది.

నేను వరండాపైకి మెట్లెక్కి వెళ్ళి మంచం మీద కూర్చున్నాను. ఆ మంచంమీద దుప్పటి నలిగి వుంది. అంటే అప్పటివరకూ ఎవరో కూర్చుని లేచి వెళ్ళారన్న మాట. ఎవరై వుంటారు?

అంజమ్మ లోపలనుంచి వచ్చింది. ఆ ముసలాడ్ని

అక్కడ జీతగాడు. మంచంమీద కూర్చోడు. మరి ఎవరు? ఒకవేళ అంజమ్మే కూర్చుని లోపలకు వెళ్ళిందా? జీప్ వస్తున్న చప్పుడు విని వెళ్ళిపోయిందేమో? అంతే అనుకున్నాను.

కాని నా దృష్టి వరండాలో స్తంభం వద్ద ఆగిపోయింది. స్తంభం ప్రక్కన బీడీ వెలుగుతోంది. మంచంక్రింద అక్కడక్కడా బీడీ తాలూకు బూడిద గూడా పడివుంది.

అంటే ఎవరో మగవాడు అప్పటివరకూ కూర్చుని వెళ్ళాడు. బీడీ ఇంకా ఆరలేదు. కాబట్టి అతనెవరో చుట్టుప్రక్కలే వుండి వుండాలి. ఒకవేళ ఇంట్లోనే వున్నాదేమో?

నేను అంజమ్మను యెన్నో ప్రశ్నలు అడగాలని మనసులోనే రిహార్సల్స్ వేసుకుని వచ్చాను.

'కాని ఇప్పుడు అక్కడ అప్పటివరకూ కూర్చుని వెళ్ళింది యెవరు?' అనే ప్రశ్న తలెత్తింది.

జీప్ చూసి కంగారుగా వెళ్ళివుంటాడు.

ఎవరు?

ఒకవేళ రామారావు ఏమో?

"ఇంట్లో ఎవరున్నారు?" ప్రశ్నించాను అంజమ్మ ముఖంలోకి పరీక్షగా చూస్తూ.

అంజమ్మ ముఖంలో ఖంగారు కన్పించింది.

"ఎవరూ లేరయ్యా!" అంది.

"ఏయ్! ముసలాడా!" అని పిల్చాను.

"అయ్యా!" అంటూ వచ్చి చేతులు కట్టుకుని నిల్చున్నాడు.

"ఇంట్లో ఎవరున్నారు?"

"ఎవరూ లేరయ్యా! నేనూ, అమ్మాయి తప్ప ఎవరూ

లేరయ్యా!" ఎంతో నమ్మకంగా చెప్పాడు.

అంజమ్మ ముఖం చూశాను.

ఒకవేళ బీడీ త్రాగే అలవాటు అంజమ్మకు వుందేమో?

"ఇంట్లో ఎవరన్నా వున్నారేమో వెతకండి" అని మా కానిస్టేబుళ్ళకు ఆర్డర్ చేశాను.

వాళ్ళు ఇంట్లో చొరబడ్డారు.

అంజమ్మ ముఖం వెలవెలా పోయింది. చూస్తుంటేనే తెలిసిపోతోంది ఇంట్లో ఎవడో వున్నాడని.

నేను వూహించినట్లుగానే మా వాళ్ళు ఒకడిని చెరొక రెక్కా పట్టుకొని లాక్కొచ్చారు. వాడు భయంతో గజగజలాడిపోతున్నాడు.

"ఎవరు నువ్వు?"

వాడికి నోటంట మాట రాలేదు. చల్లటి వేళయినా వళ్ళంతా చెమటతో తడిసిపోయింది అతనికి.

"తీసుకెళ్ళి జీప్‌లో వెయ్యండి" అన్నాను.

మా వాళ్ళు లాక్కెళ్ళిపోతుంటే వాడు వాళ్ళిద్దర్నీ విడిపించుకొని వచ్చి నా కాళ్ళమీద పడి "నాకేం తెలియదు సార్!" అన్నాడు ఏడుపుముఖం పెట్టి.

"లే ముందు...." అంటూ నెట్టాను.

కానిస్టేబుళ్ళు వాడిని లాగి నిల్చోబెట్టారు.

"చెప్పు ఎవరు నువ్వు?"

"నా పేరు సత్యం సార్!"

"వూఁ....అయితే ఇక్కడెందుకు వున్నావు?"

"నేను ఇక్కడే పని చేస్తాను సార్!"

"ఏం పని చేస్తావ్?"

"పాలు వ్యాన్ దగ్గరికి తీసుకెళ్తాను. ఎరువుబస్తాలు లేపడం, తోటకి నీళ్ళు పెట్టించడం....అన్నీ చేస్తాను

సార్!"

"అంటే నువ్వు పెద్దపాలేరువన్న మాట."

"అవును సార్!"

"నీ అవతారం చూస్తే అలా లేదే! తోటకి యజమాని లాగా వున్నావుగాని" అన్నాను. అతను లాల్చీ పైజామా వేసుకుని శృంగార పురుషుడిలా వున్నాడు.

"అంజమ్మ సినిమాకి వెళ్దామంటే బయల్దేరాను సార్!"

ఓహో! అదన్నమాట సంగతి.

"నేను వస్తుంటే ఎందుకు దాక్కున్నావ్ చెప్పు?"

"భయం వేసింది సార్!"

"ఎందుకు?"

"గోపయ్యబాబు చచ్చిపోయాడు గదా!"

"అయితే నీకేం?"

సత్యం మాట్లాడలేదు.

"చెప్పు. గోపయ్య చచ్చిపోతే నీ కెందుకు భయం?"

"ఆయన పెద్దకొడుక్కి నేనంటే కోపం సార్! నా మీద ఏదైనా చెప్తాడేమోనని భయం వేసింది."

"నువ్వంటే అతనికి కోపం ఎందుకు?"

"ఏమో సార్!" అన్నాడు సత్యం.

"సత్యం ఏదో దాచిపెడుతున్నాడని నాకు అనుమానంగా వుంది. రామారావుకి సత్యం అంటే కోపం. ఎందుకు? ఒకవేళ అంజమ్మ విషయంలో కోపమా? వీళ్ళిద్దరికీ సంబంధం వుండివుంటుంది. అందుకు రామారావుకి కోపంగా వుండవచ్చు. అంతే. అంతకంటే యింకేం కారణం వుండివుంటుంది.

అయినా ఈ కేసులో యింతవరకూ యెవర్నీ అరెస్ట్ చెయ్యలేదు. ఈ సత్యంగాడిని అనుమానం మీద అరెస్ట్

చేసి లాకప్‌లో పడేస్తే కొంత సంచలనం కలుగుతుంది. తీగ లాగితే డొంక కదలవచ్చు.

"గోపయ్య నీకు ఏమవుతాడు?" ప్రశ్నించాను అంజమ్మను.

"అయ్యసార్!" అంది.

"నువ్వు గోపయ్యకే పుట్టావా?"

"మా అమ్మను వుంచుకున్నాడు."

"మీ అమ్మ పోయిందిగా?"

అవును అన్నట్టు తల వూపింది.

"మరి ఇంకా గోపయ్య దగ్గరే ఎందుకున్నావ్?"

"ఈ తోట మా అమ్మకి రాసిచ్చాడు. మా అమ్మ తర్వాత నాకు వచ్చింది. ఇంకా నాకు ఎవరూలేరు."

"మీ అయ్య బావిలోపడి చచ్చిపోయింది ఎందుకో తెలుసా?"

"తెలీదు."

"నీతో ఏమీ చెప్పలేదా?"

"లేదు."

అంజమ్మ దగ్గర ముఖ్యమైన సమాచారం రాదు. కిటుకంతా సత్యంగాడి దగ్గరే వుంది.

"వాడిని జీప్‌లో పడెయ్యండి" అన్నాను.

సత్యం గిలగిల కొట్టుకుంటుంటే మా వాళ్ళు జీప్‌లో పడేశారు.

నేను అంజమ్మలో వస్తున్న రియాక్షన్స్ కనిపెడుతున్నాను.

సత్యాన్ని కానిస్టేబుళ్ళు తీసుకెళ్తుంటే అంజమ్మ ఎంతో బాధపడుతోంది.

సత్యం ఏడుస్తున్నాడు నాకేం తెలియదు బాబోయ్!

అని.

అప్పుడు అంజమ్మ గూడా దుఃఖం ఆపుకోలేక పోయింది.

వీళ్ళిద్దరికీ సంబంధం వుందని నేను రూఢి చేసుకున్నాను.

## 5

సత్యం, అంజమ్మ పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. అందుకు గోపయ్య ఒప్పుకోలేదు. అంజమ్మ గోపయ్య సంరక్షణలో వుంది. అందుకని సత్యం గోపయ్యని గొంతు నులిపి హత్యచేసి పాడుబడిన బావిలో పడేశాడు.

అదీ నా అభియోగం. అలాగే జరిగివుండడానికి అవకాశం వుంది. అందుకే సత్యాన్ని అరెస్టు చేశాను.

మర్నాడు సత్యం చిన్నాన్న వచ్చి బెయిల్ మీద విడిపించుకుపోయాడు.

ఆతర్వాత కేసు కొంచెం గూడా ముందుకు జరగలేదు. రామారావుమీద మనుష్యుల్ని నిఘా వేసి వుంచాను. అతని తమ్ముడిని ప్రశ్నించాను. తను కులం తక్కువ పిల్లను చేసుకోబోతున్నందుకు తండ్రి బాధపడలేదనీ, కట్నం రాకుండాపోతున్నందుకే బాధపడ్డాడనీ అతను చెప్పాడు.

తన తండ్రి కిందనుంచి పైకి వచ్చినవాడనీ, అతనికి పరువుప్రతిష్టల గురించి పట్టింపులు గూడా లేవనీ, డబ్బే ముఖ్యమని అన్నాడు. పరువుప్రతిష్టలు గౌరవించేవాడైతే మామిడితోటలో ముండని పెట్టుకుని ఎందుకు వున్నాడు? సారాయిత్రాగి రోడ్లమీద ఎందుకు దొర్లుతున్నాడు? అని ప్రశ్నించాడు.

లక్ష్మణరావు చెప్పేదంతాగూడా నాకు సమంజసంగానే అనిపించింది. గోపయ్య డబ్బుమనిషే అని నిశ్చ

యానికి వచ్చాను.

పోతే, తన అన్నకూ అంజమ్మకూ సంబంధం వుందనే సంగతి తను ఏమీ చెప్పలేనన్నాడు. తన తండ్రి మాత్రం ఎప్పుడూ అక్కడే వుండేవాడనీ, అన్న మాత్రం అప్పు డప్పుడూ వెళ్ళివస్తూ వుంటాడనీ చెప్పాడు.

అతనికి వాళ్ళంటే మొదటినుంచీ అసహ్యమట. అందుకే ఆ మామిడితోట వైపు వెళ్ళడట.

లక్ష్మణరావులో నిజాయితీ వుందనిపించింది నాకు. తండ్రి, అన్న అని అభిమానం లేకుండా వాళ్ళ బలహీన తలు విమర్శించాడు.

"మీకు ఎవరిమీదనైనా అనుమానం వుందా?" ప్రశ్నించాను అతన్ని.

"నాలుగేళ్ళ నుంచీ ఇక్కడి పరిస్థితులు నాకు అంతగా తెలియదు. ఈ ఊళ్ళో ఇంటర్ వరకే వుంది. డిగ్రీ చదువుకి పరాయి వూరెళ్ళాను. మా నాన్నకు ఎవరైనా విరోధు లున్నారా? అనే విషయం నాకు తెలియదు. మా అన్నయ్యకి పూర్తి వివరాలు తెలుస్తాయి. ఒక్క విషయం మాత్రం చెప్పగలను. ఈ హత్య ఏదో డబ్బు గురించిన లావాదేవీల వలన జరిగింది" అన్నాడు.

"మీ నాన్న ఎవరికైనా పెద్దమొత్తంలో డబ్బు అప్పు యిచ్చాడేమో చూడండి. ప్రామిసరీ నోట్లు వగైరా వుంటాయి" అన్నాను.

"అవన్నీ మా అన్నయ్యకి తెలుసు."

"అడిగి తెలుసుకోండి. మీ నాన్న పోయాడు కాబట్టి రావలసిన బాకీలు రాబట్టుకుని పంచుకునే బాధ్యత మీకు వుందిగదా!"

"అవును." అన్నాడు లక్ష్మణరావు.

ఆ తర్వాత రామారావు ఫోన్ చేసి చెప్పాడు అటు వంటివి ఏమీ లేవని.

ఆ రోజు నే నింకా నిద్ర లేవకముందే హెడ్ కానిస్టేబుల్ హడావుడిగా వచ్చాడు యింటికి.

నేను నిద్రలేచి వళ్ళు విరుచుకుని ఆవలించి "ఏమిటి ప్రొద్దు నే?" అన్నాను చిరాకుగా.

"సత్యాన్ని ఎవరో మర్డర్ చేశారు సార్!"

"ఏ సత్యం?"

"మొన్న బెయిల్ మీద రిలీజ్ చేశాం గోపయ్య కేసులో, అత నే సార్!"

"ఆ మామిడితోటలో వుండే వా డేనా?"

"అవును సార్!"

"ఓ మైగాడ్!" అని లేచి పచార్లు చేశాను చిరాకుగా.

"ఎక్కడుంది శవం?"

"ఊరి చివర గంగానమ్మ గుడికి దగ్గర్లో సార్!"

"పద వస్తున్నా!" అన్నాను.

నేను వెళ్ళేసరికి గుంపులుగా వున్న జనం చీలి నాకు దారి యిచ్చారు. అప్పటికే కృష్ణమూర్తి వచ్చివున్నాడు. నన్ను చూసి సెల్యూట్ చేశాడు.

దగ్గర్లోనే గంగానమ్మ గుడి వుంది. ఆ ప్రాంతం అంతా మిట్టపల్లాలతో రాళ్ళు రప్పలతో నిండివుంది. అక్కడక్కడా ఈతచెట్లు ఎక్కువగా వున్నాయి.

సత్యం శవం వెల్లకిలా పడివుంది.

మెడమీద, గుండెల్లో కత్తితో పొడిచిన గాయాలు వున్నాయి. పైజామా, లాల్చి వేసుకుని వున్నాడు. తెల్లటి బట్టలు రక్తంతో తడిసి అట్టగట్టి వున్నాయి. నేలమీద రక్తం కారి ఎండిపోయి వుంది.

హతుడు పెనుగులాడిన సూచనలు ఏవీ లేవు.

శవ పంచాయితీ జరిపించి శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపేశాను.

# 6

సత్యం గొంతుదాకా ఈతకల్లు తాగివున్నాడనీ, ఆ నిషాలో వున్నప్పుడే ఎవరో పొడిచి చంపారనీ, ప్రాణం రాత్రి పదింటికి పోయివుంటుందని పోస్టుమార్టమ్ రిపోర్టు.

ఒకటికి రెండు హత్యలు జరగడంతో డియస్పీ అంత క్రితమే ఫోన్ చేసి గొడవ చేశాడు. అంతగా హంతకుల్ని పట్టుకోవడం చేతగాకపోతే క్రైంబ్రాంచి వాళ్ళని పంపుతాననీ ఇన్సల్టింగ్‌గా మాట్లాడాడు.

తొందర్లోనే హంతకుల్ని పట్టుకుని కేసు పెడతానని గట్టిగా చెప్పాను. ప్రమోషన్ వచ్చిన క్రొత్తలోనే హంతకుల్ని పట్టుకోలేక కేసులు క్రైంబ్రాంచికి ట్రాన్స్‌ఫర్ చేస్తే నేను అసమర్థుడిగా ముద్రపడిపోతుంది.

అదంతా తల్చుకుని నాకు వేడెక్కింది. తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చున్నాను.

"గుడ్ మార్నింగ్ సార్!" అంటూ వచ్చి కూర్చున్నాడు ప్రతాపరాయుడు.

"రండి....రండి" అని ఆహ్వానించాను.

"ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారే?" అన్నాడు.

"మామూలే. మర్డర్ కేస్."

"అవును ఎవడో మర్డర్ చేయబడ్డాడట గదా! అనుకుంటుంటే విన్నాను. వారం నుంచి వూళ్ళో లేనులెండి. మెడ్రాస్ వెళ్ళాను" అన్నాడు.

"సత్యం అని గోపయ్య మామిడితోటలో పాలేరు. అతన్ని ఎవరో కత్తితో పొడిచి చంపారు!" అన్నాను.

"సత్యమా?"

"అవును. మీరెప్పుడూ చూశ్ళేదా అతన్ని."

ప్రతాపరాయుడు అడ్డంగా తల వూపాడు.

"లేదుసార్. మనకేం పని వాళ్ళతోటి."

నేనూ తల వూపాను.

"ఆ కుర్రాడు మామిడితోటలో వుంటాడా?"

"ఆఁ....అనుమానం మీద అరెస్టుగూడా చేశాను. వాళ్ళ చిన్నాన్న బెయిల్ మీద విడిపించుకు వెళ్ళాడు."

"ఐ.సీ...." అని ఏదో ఆలోచనలోపడ్డాడు.

"హత్యమీద హత్య."

"ఒకవేళ అతగాడికి ఆ అంజమ్మతో ఏదైనా లౌ ఎఫైర్ వుందేమో?"

"కరెక్ట్."

"అయితే మరి ఇంకేం. అది రామారావుగాడి పనే."

"ఏమిటీ?"

"ఇంకా సందేహం యెందుకు సార్! ముసలోడిని వదిలించుకున్నాడు. ఆ అంజమ్మ, సత్యాన్ని పెళ్ళి చేసుకోవాలని ప్లానులో వుందని పసిగట్టి వుంటాడు. వాడు బ్రతికుంటే తనకి అంజమ్మ లాంగి వుండదు. పైగా తోట అంజమ్మ తల్లిది. తనకు హక్కులేదు. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటే తనని గేటుగూడా దాటనివ్వరు. అదంతా ఆలోచించి అంజమ్మకు మగదిక్కు లేకుండా నిర్మూలించాడు. ఇప్పుడు అంజమ్మ తన చెప్పుక్రింద తేలులా పడి వుంటుంది" అన్నాడు ప్రతాపరాయుడు.

నేను అతని మాటలు వింటూ ఆలోచిస్తున్నాను.

"ఏమిటి సార్! పరధ్యానంగా వున్నారు?"

"ఏంలేదు" అన్నాను నవ్వుతూ.

"ఈ రోజు మీరు తప్పకుండా డిన్నర్‌కి ఎటెండ్ కావాలి. ఈ సారి తప్పించుకోవడానికి వీల్లేదు" అన్నాడు.

"ఏమిటి విశేషం?"

"విశేషం వుంది."

"ఏమిటో చెప్పండి. ఉట్టినే డిన్నర్లకి రావాలంటే నాకు యెందుకో ఎలర్జి. బంధువుల యిళ్ళకే వెళ్ళను సామాన్యంగా."

"ఈ రోజు నా పుట్టినరోజు."

"హేపీ బర్త్‌డే టూ యూ!" అంటూ చేయి కలిపాను.

"థాంక్యూ!" అన్నాడు.

"ముందే చెప్తే బాగుండేదిగా!"

"ఏంలేదు-ఫ్రెండ్స్ ప్రెజెంటేషన్స్ తెచ్చి ఇబ్బంది పెడుతుంటారు. అందుకే నేను సర్‌ప్రయిజింగ్‌గా డిన్నర్ యిచ్చి అప్పుడు చెప్తుంటాను అసలు సంగతి" అన్నాడు.

"అలాగా!" అని తలవూపాను.

"వస్తా సార్! ఇంకా చాలా మందికి చెప్పి రావాలి." అంటూ వెళ్ళిపోయాడు ప్రతాపరాయుడు.

ప్రతాపరాయుడు బర్త్‌డే పార్టీకి యెటువంటి ప్రజెంటేషన్ తీసుకెళ్ళాలా? అని ఆలోచిస్తూ కూర్చున్నాను. అతనికి ఇటువంటివి ఇష్టం లేకపోయినా చేతులూపుకుంటూ పార్టీకి వెళ్ళడం నాకూ ఇష్టంలేదు.

యస్.ఐ. కృష్ణమూర్తి వచ్చి కూర్చున్నాడు.

"ఏమైంది?" అన్నాను.

"ఆ రోజు, మర్నాడు గూడా రామారావు విజయ

వాడలో వున్నట్లు ఎలిబీ వుంది సార్! కొన్ని షాపుల్లో బిల్స్ కూడా చూశాను. రామారావు సంతకాలు వున్నాయి. వాళ్ళకి రామారావు పర్మినెంట్ కస్టమర్. సులభంగా నే గుర్తుపట్టారు. ఆ రెండు రోజులూ అతను వూళ్ళో లేడు. విజయవాడాలో వున్నాడు."

"రామారావు ఈ హత్యలు స్వయంగా చేస్తాడా? ఎవర్నో వుపయోగించాడు. ఆలోచించు" అన్నాను.

"ఎవర్ని వుపయోగించినా వాళ్ళు తనను బ్లాక్ మెయిల్ చేస్తారని తెలియదా?" ప్రశ్నించాడు కృష్ణమూర్తి.

"అదంతా ముందు ఎవడు ఆలోచిస్తాడు?"

"ఆ మాటా నిజమే అనుకోండి" అన్నాడు కృష్ణమూర్తి ఆలోచనలో పడిపోయి.

"మనం ఒకసారి అంజమ్మను కలుసుకోవాలి" అన్నాను.

"యస్సార్!" అన్నాడు కృష్ణమూర్తి.

కాసేపటికి జీపు సిద్ధమైంది.

అంజమ్మ తోటలోనే వుంది మేం వెళ్ళేసరికి.

నన్ను చూసి నమస్కారం చేసింది.

నేను క్రితంసారి చూసినప్పటిలా లేదు ఆమె. ఒక్కసారిగా ఎంతో మార్పు కనిపించింది. ముఖంలో జీవకళ లేదు. ఎంతో దిగులుగా వుంది.

"సత్యం హత్య ఎవరు చేశారో చెప్పగలవా?" ప్రశ్నించాను.

అంజమ్మ అయోమయంగా చూసింది మా వంక. సత్యం మరణం ఆమెను ఎంతో కృంగదీసినట్లు నేను వూహించగలిగాను.

వరండాలో మంచం మీద కూర్చునివున్నాను నేను.

కృష్ణమూర్తి అక్కడే పచార్లు చేస్తున్నాడు.

అంజమ్మ గుమ్మంలో నిల్చొనివుంది.

మెట్లక్రింద ఒక మధ్యవయస్కుడు మమ్మల్ని గమనిస్తూ కూర్చుని వుండడం నేను గమనించాను. అతనికి నలభై ఏళ్ళు పైనే వుంటాయి. పంచె కట్టుకుని వున్నాడు. వంటిమీద చొక్కా లేదు. తలపాగా చుట్టుకున్నాడు.

అతను అంజమ్మను, మమ్మల్నీ గమనించడం నాకు అనుమానం కలిగింది. అంజమ్మ గూడా అతన్ని అప్పుడప్పుడూ చూస్తూ మాట్లాడుతోంది.

అంజమ్మ తనకు ఏమీ తెలియదనే చెప్తోంది.

"కాఫీ తెస్తాను" అంటూ అంజమ్మ లోపలకు వెళ్ళింది.

"ఎందుకమ్మా! ఇప్పుడేమీ అవసరంలేదు" అన్నాను.

అప్పటికే ఆమె లోపలకి వెళ్ళింది. నా మాట విని నిలబడిపోయింది.

నా కళ్ళల్లోకి చూస్తూ లోపలకి రమ్మని చెయ్యి ఊపింది.

నేను త్రుళ్ళిపడ్డాను ఒక్కసారిగా!

ఏమిటి ఆమె ఉద్దేశ్యం?

నా బుర్రలో ఒక మెరుపు మెరిసింది.

ఆమె ప్రవర్తన నాకు అర్థమైంది.

ఆమె నాతో ఏదో చెప్పదల్చుకుంది. కాని ఆ మెట్ల క్రింద వున్నవాడు ఆమె ఏమీ చెప్పకుండా యెవరో నియోగించిన మనిషి.

వాడి ముందు ఏమీ చెప్పినా వాడు బుర్రలో రికార్డు చేసుకుని అందజేస్తాడు. అది చాలా ప్రమాదమై వుంటుంది. బహుశా ఆమెను గూడా హత్య చెయ్యొచ్చు. అందుకే ఆమె భయపడిపోతోంది.

అదంతా నేను గ్రహించాను.

ఆమె పిలవగానే నేను వెళ్ళి ఆమె లోపల్నుంచి నన్ను రమ్మని పిల్చివుంటుందని వాడు గ్రహించవచ్చు.

అందుకే నేనొక ప్లాన్ వేశాను.

"ఇలారా!" అని అతన్ని పిల్చాను.

వచ్చి చేతులు కట్టుకుని నిల్చుని వున్నాడు.

"ఎవరు నువ్వు?" గద్దించాను.

"నా పేరు సాంబయ్య" అన్నాడు.

"ఇక్కడేం చేస్తావ్?"

"తోటలో పని అయ్యా!" వినయంగా అన్నాడు.

"ఈ ఇంట్లో ఎవరున్నారు?"

"అంజమ్మ."

"ఇంకా ఎవరైనా వున్నారా?"

"లేరు అయ్యా!"

"కృష్ణమూర్తీ!"

"సార్!" అన్నాడు కృష్ణమూర్తి.

"ఇంట్లో ఎవరన్నా వున్నారేమో సెర్చి చెయ్యి" అన్నాడు.

"ఎవరూ లేరయ్యా!" అన్నాడు సాంబయ్య.

"నోర్ముయ్! షో...." అన్నాను దబాయించి.

సాంబయ్య తోక ముడుచుకుని దూరంగా పోయాడు.

కాసేపటికి కృష్ణమూర్తి బైటకు వచ్చి "ఎవరూ లేరు సార్!" అన్నాడు.

సాంబయ్యవంక కళ్ళతో చూస్తూ "వుయ్ హేవ్ టూ అరెస్ట్ హిమ్" అన్నాడు.

"వై."

"ఐ విల్ టెల్ యూ లేటర్ సర్" అన్నాడు.

సాంబయ్య మెడమీద చెయ్యి పెట్టి నెట్టుకుంటూ "ఎక్కరా జీపు" అన్నాడు కృష్ణమూర్తి.

సాంబయ్య భయంతో "ఎందుకయ్యా! నేనేం చేశాను?" అన్నాడు.

"ముందు స్టేషన్‌కి రా అక్కడ చెప్తాను" అని జీపు లోకి ఎక్కించాడు సాంబయ్యని.

స్టేషన్‌కి వెళ్ళాక లాఠీ చేత్తో పట్టుకుని "మర్యాదగా అంతా చెప్తావా? వడ్డించమంటావా?" అన్నాడు కృష్ణ మూర్తి హుంకరిస్తూ.

"ఏంటయ్యా?.... నేనేం చేశాను?" గజగజలాడి పోతూ అన్నాడు సాంబయ్య.

"నువ్వు తోటలో ఎన్నాళ్ళనుంచి పని చేస్తున్నావు?"

సాంబయ్య నోరు తెరవలేదు;

"నాకు తెలుసురా! నువ్వు రిక్షా తొక్కుతుండే వాడివి. ఎన్నోసార్లు బస్టాండులో చూశాను నిన్ను" అన్నాడు కృష్ణమూర్తి.

"అవునయ్యా! అది మానేసి ఈ మధ్యనే తోటలో పనికి చేరాను."

"ఈ మధ్యనే అంటే ఎన్నాళ్ళ క్రితం జేరావు."

"వారం నుంచి."

"ఎవరు పెట్టారు నిన్ను పనిలో."

"సత్యం."

"సత్యం హత్య చేయబడిన రోజు రాత్రి ఏడింటికి సత్యాన్ని నువ్వు తోటలో నుంచి బైటికి తీసుకెళ్ళావు."

సాంబయ్య ముఖం తెల్లగా పాలిపోయింది.

"సత్యాన్ని ఎవరు పిల్చుకుని రమ్మన్నారు?"

సాంబయ్య మౌనం వహించాడు. వాడు అంత తేలిగ్గా

చెప్పేటట్టులేదు. పెట్టవలసినవి పెట్టాక, వడ్డించినవి తిన్నాక చెప్పక తప్పలేదు.

"గంగులుసార్!" అనేమాట వెలువడింది వాడినోట.

7

జమీందారుగారి భవనంలో ప్రతాపరాయుడి పుట్టిన రోజు వేడుక వైభవంగా జరుగుతోంది.

జమీందారుగారి బంధువులు, ప్రతాపరాయుడి ముఖ్య స్నేహితులు, వూళ్ళోని ఆఫీసర్లు, వర్తక ప్రముఖులతో హాలంతా కళకళ లాడుతోంది.

రిసెప్షన్ వద్ద ఇద్దరు అమ్మాయిలు అప్సరసలవలె అలంకరించుకున్న అందగత్తెలు స్వాగతం చెప్తున్నారు. ఒకామె గులాబీ పువ్వును చేతికి అందిస్తుంటే, మరొకామె వెండి పన్నీరు బుడ్డితో పన్నీరు జల్లుతోంది అతిథులకు.

వాళ్ళకి కొంచెం దూరంలోనే ప్రతాపరాయుడు సినీ హీరోలా మేకప్ చేసుకుని పుట్టినరోజు శుభాకాంక్షలు అందుకుంటూ, చిరునవ్వుతో కరచాలనాలు చేస్తూ సంతోషంగా వున్నాడు.

ప్రతాపరాయుడి తండ్రి నరసింహరాయుడు ఒక సోఫాలో కూర్చుని స్నేహితులతో ముచ్చటలాడుతున్నాడు.

పోలీస్ జీపు ఆగింది.

దూరంనుంచి ఒక చెట్టుక్రింద నిల్చుని నేను అంతా చూస్తూనే వున్నాను.

పోలీస్ జీప్ ఆగగానే చెట్టుక్రిందనుంచి జీపు దగ్గరకి వచ్చాను.

ప్రతాపరాయుడు వెలుతురులో వున్నాడు. నేను చీకట్లో చెట్టుక్రింద నిల్చున్నాను. వెలుతురులో వున్న

వారికి చీకట్లో వున్నవారు కనిపించరు. అలాగే నన్ను అతను చూడలేక పోయాడు.

జీపులోనుంచి కృష్ణమూర్తి దిగాడు.

ఇద్దరం కలసే వెళ్ళాం.

"ఇంత ఆలస్యం చేశారేం?" నవ్వుతూ ప్రశ్నించాడు ప్రతాపరాయుడు.

"మీకు ఎటువంటి ప్రెజెంటేషన్ తెస్తే బాగుంటుందో తేల్చుకోలేక ఇంత ఆలస్యం చేశాను." నవ్వుతూ అన్నాను.

"బలేవారే! ఇంతకీ ఏం తెచ్చారు?" అన్నాడు నవ్వుతూ. మా ఇద్దరి చేతులు ఖాళీగానే వున్నాయి.

నేను చప్పట్లు చరిచాను.

హెడ్ కానిస్టేబుళ్ళు ఇద్దరువచ్చి ప్రతాపరాయుడి చేతులకు బేడీలు తగిలించారు.

"బాగుందా ప్రజెంటేషన్?"అన్నాడు కృష్ణమూర్తి.

హాలంతా ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయింది. అంతా ప్రాణాలు పోయి బొమ్మలైపోయిన వాళ్ళలా చూస్తూ వుండిపోయారు.

ప్రతాపరాయుడి తండ్రి నరసింహారాయుడు మాత్రం పెద్దపులిలా విరుచుకుని పడ్డాడు.

"ఏమిటి మీరు చేసిన పని? ఎవరింట్లో వున్నారో తెలుసుకునే చేస్తున్నారా? ఎంత ధైర్యం మీకు?" అంటూ ఇష్టం వచ్చినట్లు మాట్లాడాడు.

ప్రతాపరాయుడి ముఖం అవమానంతో కోపంతో కందగడ్డలా ఎర్రబడిపోయింది. కళ్ళతోనే నిప్పుల వర్షం కురిపిస్తున్నాడు.

"నరసింహారాయుడుగారూ ఆవేశపడకండి. చట్టానికి

ఎవరూ అతీతులు కాలేరు. జరిగినదంతా దయచేసి మీరు వినాలి. తర్వాత నిజం తెలుసుకుంటారు," అన్నాను.

"ఏమిటా నిజం?"

"పోలీస్ స్టేషన్‌కి రండి చెప్తాను. ఇక్కడ చెప్తే మీ పరువు పోతుంది." అన్నాను.

"మా ఇంటికొచ్చి నా కొడుకు చేతులకు బేడీలు వేసి నప్పుడే పోయింది పరువు." అన్నాడు ఆవేశంతో.

"అలా అనుకుంటే నేను చేసేదేంలేదు. మీరు వస్తే అంతా తెలుస్తుంది," అన్నాడు.

ప్రతాపరాయుడిని లాకప్‌లో పడేసి వచ్చాడు కృష్ణమూర్తి.

నరసింహారాయుడు తెల్లటి మీసాలతో ముసలి సింహంలా నా ఎదురుగా కూర్చుని వున్నాడు. అవమానంతో కళ్ళు ఎర్రబడి వున్నాయి.

అప్పటికి రాత్రి తొమ్మిదైంది.

"చెప్పండి. నేను బెయిల్ మీద వాడిని పిడిపించుకుని పోవాలనుకుంటున్నాను. ఇంతకీ వాడు చేసిన నేరం ఏమిటో?" అన్నాడు.

"హత్య?" అన్నాడు.

నరసింహారాయుడు తన ముందు బాంబు పడినట్లు వులిక్కిపడ్డాడు.

"ఏమిటి మీర నేది?"

"అవును సార్! సత్యం అనే అతన్ని గంగులు అనే వాడితో హత్య చేయించాడు."

"ఎందుకు చేయించాడు?"

"ఒక హత్యకాదు రెండు హత్యలు చేయించాడు. సత్యంతో గోపయ్యను హత్య చేయించాడు" అన్నాను.

ఆ ముసలి సింహం మతిపోయినట్లు చూశాడు.

"సరే! అదంతా కోర్టులో తేల్తుంది. వాడు నా కొడుకు కాబట్టి ముందు బెయిల్ మీద విడిపించుకుని పోవాలి. లేకపోతే నా ప్రెస్టేజి ఏమైపోతుంది" అన్నాడు.

నేను నవ్వాను.

"మీరు కంగారు పడకండి. అతను మీ కొడుకు కాదు," అన్నాను.

ఈ సారి నరసింహారాయుడు నెత్తిన పిడుగు పడిన వాడిలా దిమ్మెర పోయాడు.

"ఏమిటి సార్ మీరనేది?"

"నిజమే."

"మీకు ఎలా తెలుసు?"

"నిజం తెలుసుకోవడమే మా వుద్యోగం. దోషులను శిక్షించడం మా విధి" అన్నాను.

"వివరంగా చెప్పండి."

"మీ ఏకైక కుమారుడు ప్రతాపరాయుడు."

"అవును."

"అతను ఏడేళ్ళ వయస్సులో వున్నప్పుడు కృష్ణ పుష్కరాలకు వెళ్ళారు మీరు."

"అవును."

"అప్పుడు గోపయ్య మీ దగ్గర నౌకరు. అతన్ని వెంట తీసుకెళ్ళారు."

"నిజమే."

"మీరు స్నానం చేస్తున్నారు. మీ అబ్బాయిని గోపయ్య స్నానం చేయిస్తున్నాడు. మీ అబ్బాయి కొంచెం ముందుకు వెళ్ళి మునిగిపోయాడు."

"ఆc...."

"అవును. అప్పుడు గోపయ్యే సమయస్ఫూర్తితో వ్యవహరించాడు. ఒడ్డుకెళ్ళి బట్టలు ఇసుకలో కప్పెట్టాడు. అతని పులిగోరుపతకం మాత్రం బొడ్లో దోపుకున్నాడు. 'బాబుగారూ!' 'బాబుగారూ!' 'చినబాబుగారూ!' అంటూ అరవసాగాడు. తప్పిపోయినట్లు అందర్నీ నమ్మించాడు. అంతమంది జనంలో ఎక్కడో తప్పిపోయాడని అంతా నమ్మారు. పోలీసు రిపోర్టు ఇచ్చినా మీ అబ్బాయి దొరకలేదు."

"అవును సార్!"

"ఐదేళ్ళ క్రితం మీ అబ్బాయి మీకు దొరికాడు."

"అవునా?"

"అవును."

"పదిహేను సంవత్సరాల తర్వాత మీరు మీ కొడుకుని యెలా గుర్తించారు?"

"చిన్నతనంలో వాడి మెడలో వున్న పులిగోరు పతకం. అందులో వాడి ఫోటోవల్ల గుర్తించాను."

"అతన్ని యెవరు పంపారో గుర్తుందా?"

"ఆఁ....గోపయ్యే."

"అదంతా గోపయ్య నాటకం. మీ కొడుకు పోలికలు వున్న వాడి పేరు చిత్తరంజన్. వాడిది గుంటూరు. అక్కడ వీడిని చూసి గోపయ్య పట్టుకొచ్చాడు - వాడు తన తల్లిని వదిలి వచ్చాడు. జమీందారు కొడుకుని చేసినందుకు తను ఐదు లక్షలు ముట్టజెప్పాలని కండిషన్ పెట్టాడు గోపయ్య. పూరికే వచ్చేదానిలో యెంత యిస్తే మాత్రం నష్టం యేముంది? చిత్తరంజన్ ఒప్పుకున్నాడు. గోపయ్య అతన్ని మీ కొడుకుగా నమ్మించాడు."

నరసింహరాయుడు తెల్లబోయి వింటున్నాడు.

"అతను మీ కొడుకుగా నటిస్తూ గోపయ్యను చాలా డబ్బు ముట్టజెప్పాడు. కాని గోపయ్య అత్యాశకుపోయి అతన్ని డబ్బుకోసం పీడించేవాడు. అతని పీడ వదిలించుకోవడానికి సత్యం ద్వారా గోపయ్యను చంపించాడు. కేసు వస్తే తను చూసుకుంటానని ధైర్యం చెప్పాడు.

గోపయ్య చచ్చిపోయాక సత్యాన్ని మేము అనుమానంమీద అరెస్టు చేశాం. సత్యం భయపడి ఎప్పుడైనా తనమీద చెప్తాడేమోనని జాగ్రత్త కోసం సత్యాన్ని గంగులు అనేవాడితో చంపించాడు. గంగులు డబ్బు తీసుకుని యిటువంటి పనులు చెయ్యడంలో దిట్ట."

నరసింహరాయుడి ముఖం కళ తప్పింది. ఆవేశం నీళ్ళుపోసినట్లు చల్లారిపోయింది.

"గోపయ్య పీడ వదిలించుకోవాలనే ఉద్దేశ్యంతోనే వాడు మాతో స్నేహంగా వుండేవాడు యెందుకైనా మంచిదని."

"మీకు యెందుకు అనుమానం వచ్చింది?" అన్నాడు నరసింహరాయుడు.

"గోపయ్య చనిపోయినప్పుడు సత్యం అనే వాడిని అరెస్టుచేశామని చెప్పినప్పుడు అత నెవరో తెలియదని అన్నాడు. మా అనుమానం గోపయ్య కొడుకు రామారావు మీదకు మళ్ళేటట్టు కబుర్లు చెప్పేవాడు. ఒకరోజు నేను మీ యింటికి వచ్చాను మీ అబ్బాయి లేనప్పుడు. మనం అప్పుడు మొదటిసారి కలుసుకున్నాం.

"అవును గుర్తుంది."

"ఆ రోజు మీ యింట్లో వున్న గ్రూప్ ఫోటోలలో ఒక దానిలో సత్యం వున్నాడు. నాకు అప్పుడే అనుమానం వచ్చింది. తన యింట్లో పనిచేసిన సత్యం అతనికి

యెందుకు గుర్తులేదు? అని ఆలోచించాను. ఆ తర్వాత మాటల సందర్భంలో మీ అబ్బాయి కృష్ణపుష్కరాలలో తప్పిపోయిన సంగతి, ఐదేళ్ళ క్రితం దొరికిన సంగతి చెప్పారు."

"అవును. చెప్పాను."

"ఆ తర్వాత మీ వాడిమీద సి.ఐ.డీ.లను వేసి పాత కథంతా రాబట్టాను" అన్నాడు.

నరసింహారాయుడు గంభీరవదనంతో నా వంక కృతజ్ఞతతో చూశాడు.

—:ఐపోయింది:—

# హంతకుడి వేట

## ప్రతాప రవిశంకర్

"ఎవరు కావాలి?" అడిగిందా అమ్మాయి.

"మీరే కావాలి."

"నేనా!" ఆశ్చర్యంగా అడిగింది.

"అవును. మీ పేరు కస్తూరి అయినట్లయితే తప్ప కుండా నేను మీ కోసమే వచ్చాను" అన్నది ఆమె.

"నా పేరు కస్తూరి. అయితే మీరు నా కోసమే వచ్చారు" అన్నది కస్తూరి నవ్వుతూ.

"అవును. నేను మీతో మాట్లాడాలి. నా పేరు నిర్మల" అన్నది నిర్మల.

"రండి. నా గదిలో కూర్చుని మాట్లాడుకుందాం" అన్నది కస్తూరి.

"కింద వద్దు. మేడమీద గది ఖాళీగా వుంటే ఆ గదిలో కూర్చుని మాట్లాడుకుందాం."

కస్తూరి ఆశ్చర్యపోయింది. తన యెదురుగా నిలబడి వున్న నిర్మలకేసి పరిశీలనగా చూసింది. నిర్మల అందంగా

వుంది. పెద్ద పెద్ద కళ్ళు, చిన్న నోరు, ఎర్రని పెదవులు. సన్నగా నాజూకుగా వుంది.

అటూ ఇటూ చూసి "రహస్యమా?" అని అడిగింది కస్తూరి.

"అవును" అన్నది నిర్మల.

"అయితే పదండి" అని మెట్లవయిపు నడిచింది కస్తూరి.

ఇద్దరూ మేడమీదకు వెళ్ళారు. అక్కడ పక్క పక్కనే రెండు గదులు వున్నాయి. ఒక గదికి బయట గొళ్లెం వేసి వుంది. గొళ్ళెం తీసి తలుపులు తెరిచింది కస్తూరి.

లోపలకు వెళ్ళారు. కిటికీ తలుపులు తెరిచే వున్నాయి. ఎండ లోపలకు పడుతోంది. ఎండతోపాటు గాలికూడా రివ్వున లోపలకు వస్తోంది.

ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పండి. ఏమిటా రహస్యం?" అన్నది కస్తూరి.

"చెబుతాను. ఈ గది తలుపులు మూయాలి" అని లేచి తలుపులను మూసి గడియ పెట్టింది.

"అంతా సస్పెన్స్‌గా ఉంది. ఏమిటిదంతా?" అన్నది కస్తూరి.

నవ్వింది నిర్మల.

"భయపడకండి. నేను మిమ్మల్ని ఏమీ చెయ్యటానికి రాలేదు" అన్నది.

"మరెందుకు వచ్చారు?"

"సుందరం గురించి మాట్లాడటానికి వచ్చాను" అన్నది నిర్మల.

ఉలిక్కిపడింది కస్తూరి.

గబుక్కున "సుందరం విషయమా!" అన్నది.

"అవును. మీ గురించి నాకు అంతా తెలుసు. సుందరంను మీరు ప్రేమించారనీ, చివరకు మోసపోయారనీ అతను మీకు తీరని ద్రోహం చేశాడనీ తెలుసు. అందుకే నేను మీ దగ్గరకు వచ్చాను" అన్నది నిర్మల.

ఆమె అలా అనగానే కస్తూరి ముఖం అదోలా అయిపోయింది. కళ్ళు యెర్రగా అయిపోయాయి. పెదవులు ఆవేశంతో వొణికాయి.

"నేను కూడా మీలాంటిదాన్నే. మీలాగే సుందరం నన్ను కూడా ఘోరంగా మోసం చేశాడు" అన్నది నిర్మల.

"నిజమా!" అన్నది కస్తూరి.

"అవును. నేను కూడా అతన్ని ప్రేమించాను. నన్ను కూడా తను ప్రేమించానని అన్నాడు. పెళ్ళి చేసుకుంటానని యెంతో ఆశపెట్టాడు. తీరా తన మోజు తీరిన తర్వాత నన్ను అవమానించి గెంటేశాడు. అందుకే నేను మీ దగ్గరకు వచ్చాను" అన్నది నిర్మల.

"ఎందుకు?" అడిగింది కస్తూరి.

"సుందరాన్ని హత్య చెయ్యటానికి."

"హత్యా!" అదిరిపడింది కస్తూరి.

"అవును. హత్యే! మనిద్దర్నీ యింత దారుణంగా మోసం చేసిన దుర్మార్గుడు బతికి వుండటానికి వీలులేదు. వాడిని మనం హత్య చెయ్యాలి" ఆవేశంగా అన్నది నిర్మల.

"నాకూ పగ తీర్చుకోవాలనే వుంది. కాని హత్య చెయ్యటానికి నేను వొప్పుకోను. హత్యలంటే నాకు

చచ్చే భయం. హత్యచేస్తే మనం జైలుకి వెళ్ళాలి. జరిగిందేదో జరిగిపోయింది. ఇదంతా నా తలరాత అని సరిపెట్టుకున్నాను. నేను అతన్ని హత్య చెయ్యటానికి వొప్పుకోను" అన్నది కస్తూరి భయంగా.

నవ్వింది నిర్మల.

"నువ్వింత పిరికిదానివనుకోలేదు. 'నువ్వూ' అంటున్నందుకు యేమీ అనుకోకు. మనిద్దరం అక్క-చెల్లెళ్ళ వంటి వాళ్ళం. మనిద్దరం దగా పడినవాళ్ళమే. కాబట్టి యిలాగే అనుకుందాం. నువ్వుకూడా నన్ను 'నువ్వు' అనే అను. ఇక మన విషయానికి వస్తాను. 'హత్య' అంటే నువ్వు కంగారుపడవలసిన పనిలేదు. అసలు ఆ హత్య యేదో నేనే చేస్తాను. నువ్వు నాకు కొంచెం సాయపడితే చాలు."

"నువ్వు హత్య చేస్తావా?" కళ్ళు పెద్దవిచేసి అడిగింది కస్తూరి.

"అవును. తప్పకుండా చేస్తాను. ఆడదాన్ని ఆట బొమ్మలా వాడుకున్న ఆ నీచుడిని నేను హత్య చెయ్యకుండా వదిలిపెట్టను. నువ్వు కూడా నాలాగే వాడిచేత మోసపోయినదానివి కాబట్టి నీ దగ్గరకు వచ్చాను. నువ్వు కూడా ఆలోచించు. మనం ఆడవాళ్ళమే కావచ్చు. కాని అబలలం కాదు. మన బుర్రలో కూడా తెలివి ఉంది. వంట్లో శక్తి ఉంది. మనకు జరిగిన అన్యాయానికి తగిన ప్రతీకారం తీర్చుకోవాలి.ఇందుకు నాకు నీ సహాయం కావాలి. ఏమంటావ్? చెప్పు కస్తూరీ. ఆ సుందరంగాడి కథ అంతమయిపోవాలి. వాడింకా యీ భూమ్మీద బతికి ఉండటానికి వీలులేదు. వాడు చచ్చిపోవాలి"

అన్నది నిర్మల.

"నాకు భయంగా ఉంది" అన్నది కస్తూరి.

అప్పటికే కస్తూరి వంటినిండా చెమటలు పట్టాయి.

"భయం యెందుకు? యెవ్వరికీ దొరక్కుండా హత్య చేద్దాం. దేవుడు కూడా మనల్ని పట్టుకోలేడు. హత్య చెయ్యటానికి తగిన ప్లానును నేను తయారుచేస్తాను. వాడిని యీ లోకం నించి పంపించేద్దాం. నువ్వు సరేనంటే నేను ప్లాను తయారుచేస్తాను" అన్నది నిర్మల.

కస్తూరి వెంటనే మాట్లాడలేదు. లేచి నిలబడి ఆ గదిలో ఉన్న కూజాలోనించి రెండు గ్లాసుల నీళ్ళు వంచుకుని తాగింది.

పమిటతో ముఖానికి పట్టిన చెమటను తుడుచుకుంది.

"ఇప్పుడే నువ్వు నీళ్ళు కారిపోతున్నావు. కొంచెం ధైర్యంగా ఉండు. బాగా ఆవేశాన్ని తెచ్చుకో. పగనీ, ప్రతీకారాన్ని పెంచుకో. అప్పుడు నీలో భయం ఉండదు. పగ, కసి భయాన్ని తరిమేస్తాయి. మరి నువ్వు వొప్పుకున్నట్లేనా?" అన్నది నర్మల.

చిన్నగా తల వూపింది కస్తూరి.

"థాంక్ యూ కస్తూరి! ఇక ఆ సుందరంగాడికి రోజులు దగ్గర పడ్డాయి. ఈ భూమ్మీద వాడికి నూకలు చెల్లిపోయాయి. మనల్ని మోసం చేసి వాడి చావును వాడే కోరి తెచ్చుకున్నాడు. మరి నేను వెళతాను. ఈ రాత్రికి నేను ఆ సుందరంగాడిని హత్య చెయ్యటానికి పటిష్టమయిన పథకాన్ని తయారుచేస్తాను. రేపు మళ్ళీ కలుస్తాను. నువ్వు ధైర్యంగా వుండు" అని కస్తూరి భుజంతట్టి లేచి నిలబడింది నిర్మల.

తర్వాత గది తలుపులను తెరిచింది. ఇద్దరూ బయటకు

వచ్చారు.

"ఈ పక్కగదిలో యెవరైనా వున్నారా?" అడిగింది నిర్మల కస్తూరిని.

"ఇది మా మావయ్య గది. ఎప్పుడూ తాగి నిద్ర పోతూ వుంటాడు. వొట్టి మొద్దు" అన్నది చిన్నగా నవ్వి.

నిర్మల కూడా నవ్వి "యిక దిగుదాం" అన్నది మెట్ల వయిపు నడచి.

కస్తూరి పాలిపోయిన మొహంతో నిర్మల వెనుకే నడిచింది.

## 2

'అరుణా ఐరన్ స్టోర్సు' ముందు ఆటో దిగింది అరుంధతి.

మీటర్ చూసి ఫేర్ చెల్లించింది.

"చిల్లరలేదు" అన్నాడు డ్రయివర్.

"ఫర్వాలేదు వుంచుకో" అని హేండు బ్యాగ్ వూపుకుంటూ స్టోర్స లోపలకు నడిచింది.

షాపులో యెవరో ఒక మనిషి యేదో బేరం చేస్తున్నాడు. అతను వెనక్కి తిరిగి అరుంధతిని చూశాడు. అతను చూపులను ఆమె మీద నించి మరల్చుకోలేక పోయాడు.

షాపులో గుమస్తాలు కూడా ఆమెను తినేసేలా చూశారు.

"రండి....రండి" అన్నాడు ఒక నడివయసు గుమస్తా.

ఆతని దగ్గరకు నడిచింది అరుంధతి.

"ఏం కావాలి?" అడిగాడతను.

"కత్తి."

ఉలిక్కిపడ్డాడతను. ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"ఉన్నాయా? లేవా?" అంది అరుంధతి విసుగ్గా మొహంపెట్టి.

"ఉన్నాయి. ఎటువంటివి కావాలి??"

"బాగా పదునుగా వున్నది. ఒక్క పోటుకే మనిషిని చంపగలిగేది."

ఈ సారి షాపులో వున్న గుమస్తాలు బేరంచేస్తున్న అతను కూడా అదిరిపడ్డారు.

"ఏమిటి అలా చూస్తావ్? ఇంతవరకూ నువ్వు ఆడదాన్ని చూడలేదా?" అనడిగింది.

అతను తేరుకున్నాడు.

గబగబా ఒక అరలోనించి కత్తి ఒకటి బయటకు తీసి "దీన్ని చూడండి" అన్నాడు.

"ఇంతకంటే పెద్దది లేదా?" అడిగింది.

"ఇదే పెద్దది. ఒక్క పోటుతో ఖాళీ" అన్నాడతను నవ్వుతూ.

"పాడిచేదా?" అన్నది నవ్వి అరుంధతి.

"మీరు బలే జోక్‌గా మాట్లాడతారు" అన్నాడతను.

నవ్వింది అరుంధతి.

"ఎంత?" అన్నది.

"పన్నెండు రూపాయలు."

హాండుబ్యాగ్ తెరిచింది అరుంధతి. పదిహేను రూపాయలు బయటకు తీసింది.

"పేరు చెప్పండి" అన్నాడు గుమస్తా బిల్లు రాయడానికి.

"కస్తూరి" అన్నది అరుంధతి.

అతను బిల్లు రాసి ఇచ్చాడు. డబ్బులు తీసుకుని చిల్లర

ఇచ్చాడు.

ఒకసారి ఆతనికేసి చూసి నవ్వి అక్కడినించి కదిలింది అరుంధతి.

"అప్పుడప్పుడు వస్తూ వుండండి" అన్నాడు పాపతను.

"అలాగే. ఇంకో కత్తి అవసరమయితే యిక్కడికే వస్తాను" అన్నది.

తర్వాత బయటకు నడిచింది.

షాపులో మనుషులందరూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

## 3

ఉదయం తొమ్మిది గంటల సమయంలో నిర్మల— కస్తూరి యింటికి వెళ్ళింది.

ఇద్దరూ కలిసి మేడమీదకు వెళ్ళారు.

గది లోపలకు వెళ్ళి తలుపులు వేసుకున్నారు.

"ప్లాను ఆలోచించావా?" అడిగింది కస్తూరి.

"ఆ. పటిష్టమైన ప్లాను."

"చెప్పు. ఏమిటది?" అడిగింది కస్తూరి.

"చెప్పమంటున్నావు. నీకు కొంచెం ధైర్యం వచ్చి నట్టుంది" అన్నది నిర్మల.

"అవును. రాత్రంతా బాగా ఆలోచించాను. వాడంత ఘోరంగా మనల్ని మోసం చేసినందుకు వాడిని ఎందుకు చంపకూడదు? అనిపించింది" అన్నది.

"వెరీగుడ్. అయితే విను. సుందరం వుంటున్న ఇంటి గురించి నీకు బాగా తెలుసు కదా. బాత్ రూంలో నించి లోపలి గదిలోకి దారి వుంది. ఆ బాత్ రూం తలుపును సుందరం సాధారణంగా ఎప్పుడూ బోల్టువేసి వుంచడు. ఎందుకంటే ఎవరయినా రాత్రిపూట ఎవ్వరికీ తెలియ

కుండా రావటానికీ పోవటానికీ అలా చేస్తాడు. అందుకని మనం సులభంగా సుందరం ఇంట్లోకి ప్రవేశించవచ్చు.

రేపు రాత్రి పన్నెండు గంటలకు ఇద్దరం ఆ దారిలో నించి లోపలకు వెళదాం. సుందరం రోజూ బాగా తాగి గదికి వస్తాడు. మంచి మత్తులో వుంటాడు. కాబట్టి వాడిని మనం అప్పుడే కత్తితో పొడిచి చంపటం చాలా సులభం. ఒక్క పోటుతో కిక్కురుమనకుండా చస్తాడు. మనం వెంటనే మనకు సంబంధించిన ఆధారాలు వాడి దగ్గర ఏవీ లేకుండా వెతికి తీసుకురావాలి. అప్పుడు మనల్ని యెవ్వరూ అనుమానించలేరు. ఇదీ ప్లాను. అయితే మనం దీన్ని అమలు జరపటానికి కొన్ని ఇబ్బందులు ఎదుర్కోవాలి" అన్నది నిర్మల.

"ఏమిటి అవి?" అడిగింది కస్తూరి.

"ముందు మనం హత్యాయుధం ఐన మంచి పదునైన కత్తిని ఒకటి సంపాదించాలి. నా దగ్గర కత్తిలేదు. మీ ఇంట్లో వుందా?"

"మా ఇంట్లో చిన్న చిన్న కత్తులు వున్నాయి. వాడితో పొడిస్తే కోడి కూడా చావదు" అన్నది కస్తూరి.

"అయితే మనం తప్పకుండా ఒక కత్తిని కొనాలి."

"కొనేద్దాం."

"కొనవచ్చు. కాని కొనడానికి మనం షాపుకు వెళితే ప్రమాదం. షాపువాడు మనిద్దరిలో ఎవరు వెళితే వాళ్ళను గుర్తుపెట్టుకుంటాడు. హత్య జరిగిన తర్వాత పోలీసులు దర్యాప్తు చేస్తారు. అప్పుడు మనం కత్తి కొన్న విషయం బయటపడుతుంది. షాపువాళ్ళు మనల్ని గుర్తుపడతారు. కాబట్టి మనం షాపుకు వెళ్ళకూడదు" అన్నది నిర్మల.

"వెళ్ళకుండా ఎలా?"

"అదే అసలు సమస్య. ఎవర్నయినా పంపించాలి."

"ఎవరు వెళతారు?"

"ఎవరు వెళ్ళినా వాళ్ళకయినా మన విషయం తెలుస్తుంది."

"మరేం చేద్దాం?"

"మనిద్దరిలో ఒకరు మారు వేషంలో వెళ్ళి కత్తిని కొనుక్కురావాలి."

"మారువేషంలోనా?"

"అవును. నేనో, నువ్వో మారువేషంలో వెళ్ళి కత్తిని కొనుక్కురావాలి. సరే, నువ్వు ముందే భయస్థురాలివి. నేను కొంటాలే. రాత్రి ఎనిమిదింటికి రెడీగా వుండు.... వస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది నిర్మల.

## 4

ఇంటిముందు ఆటోలోనించి దిగాడు సుందరం.

"ఎంతయ్యింది?" అడిగాడు డ్రైవర్‌ని.

"అయిదూ ఇరవై."

ఆరు రూపాయలు అతని చేతిలో పెట్టి తూలుకుంటూ గేటు నెట్టుకుని లోపలకు వచ్చాడు అతను.

పదకొండు గంటలు కావస్తోంది. తాళం తీసి లోపలకు నడిచాడు. లోపలంతా చీకటిగా వుంది.

స్విచ్ నొక్కాడు. దీపం వెలిగింది.

దీపం వెలుతురులో ఆ గదిలో కుర్చీలో కూర్చున్న అరుంధతిని చూసి అతను ఆశ్చర్యపడ్డాడు.

"ఎవరు నువ్వు?" అడిగాడు సుందరం.

"ఎవరయితేనేం? నీ కోసమే వచ్చాను."

నవ్వాడు సుందరం. తర్వాత "థాంక్ యూ" అన్నాడు.

అతను పాంటు—షర్టు విప్పలేదు. అలాగే బెడ్ మీద

పడిపోయాడు.

ఆమె కుర్చీలోనించి లేచి తలుపులను మూసింది.

"అందమైనదానివి" అన్నాడు అతను.

"అందుకే నిన్ను కోరి వచ్చాను."

"అయితే ఆలస్యం దేనికి? ఇలారా?" అన్నాడు.

"కొంచెం సేపు దూరంగానే వుండి మాట్లాడుకుందాం" అని ఆమె హ్యాండుబ్యాగ్ లోనించి సిగరెట్టు పెట్టె బయటకు తీసి లైటర్ తో ఓ సిగరెట్టును వెలిగించింది.

"నువ్వు సిగరెట్లు కూడా కాలుస్తావా?" అన్నాడు సుందరం.

"సిగరెట్లే కాదు. బ్రాంది కూడా తాగుతాను" అన్నదామె.

"నీ పేరు?"

"కస్తూరి అనుకో."

"అబద్ధం. నీ పేరు కస్తూరి కాదు."

"కాదు. కాని అనుకోమంటున్నాను."

"ఇంతకీ నువ్వు లోపలకు ఎలా వచ్చావ్?"

"మనసుంటే మార్గంలేదా? బాత్ రూంలోనించి వచ్చాను."

"ఆ దారి నీ కెలా తెలుసు?"

"నాకు నీ గురించి అంతా తెలుసు?"

"ఇంతకీ నువ్వెవరు?"

"నీ పొందుకోరి వచ్చిన ఓ అందమైన ఆడదాన్ని."

అతను బెడ్ మీదనించి లేవబోయాడు.

కాని అప్పటివరకు బీరువా చాటున దాక్కున్న మనిషి గబుక్కున బయటకు వచ్చి సుందరం నోరు నొక్కి బెడ్ మీదకు పడేశాడు. మరునిముషంలో సుందరం

గుండెల్లో పొడుగాటి కత్తి బలంగా దిగబడింది.

చిన్నగా మూల్గి ప్రాణం వదిలాడు సుందరం.

తర్వాత ఇద్దరూ కత్తి పిడిమీద వేలిముద్రలు చెరిపి వేశారు.

తర్వాత ఆ గదిలో లైటార్పి అరుంధతి—కత్తితో పొడిచిన మనిషి గబగబా బాత్ రూంలోనించి బయటకు వెళ్ళిపోయారు.

## 5

"నన్ను మీరే కాపాడాలి" అన్నది కస్తూరి.

"చెప్పండి. మిమ్మల్ని ఎవరినించి కాపాడాలి" అన్నాడు డిటెక్టివ్ జగదీష్ సిగరెట్టు ముట్టించి.

"పోలీసులనించి."

"ఎందుకు మీరేదయినా నేరం చేశారా?"

"చెయ్యలేదు."

"ఐతే మీరు భయపడాల్సిన అవసరంలేదు. మిమ్మల్ని తప్పకుండా రక్షిస్తాను. కేసు గురించి వివరంగా చెప్పండి" అన్నాడు జగదీష్.

మొహానికి పట్టిన చెమటను కర్చీఫ్‌తో తుడుచుకుంది కస్తూరి.

తర్వాత "మంచినీళ్ళు కావాలి" అన్నది.

ఫ్రిజ్‌లో వున్న వాటర్ బాటల్ తీసి నీళ్ళు ఓ గ్లాసులోకి వంచి ఆమెకు ఇచ్చాడతను.

ఆమె నీళ్ళుతాగి గట్టిగా శ్వాస వదిలింది.

అందమైన ఆమె ముఖం భయంతో పాలిపోయి వుండటాన్ని అతను మొదట్లోనే గ్రహించాడు.

కస్తూరి తను సుందరాన్ని ప్రేమించటం మొదలు నిర్మల తనని కలుసుకుని అతన్ని హత్యచెయ్యటానికి

పథకం వెయ్యటం తర్వాత వాళ్ళిద్దరూ కలిసి క్రితంరాత్రి పన్నెండు గంటలకు సుందరం యింట్లోకి వెళ్ళినవరకు చెప్పింది.

"తర్వాత ఏమయ్యింది? నిర్మల అతన్ని హత్య చేసిందా?" అడిగాడు జగదీష్.

"లేదు. చెయ్యలేదు. ఇద్దరం సరిగ్గా పన్నెండు గంటకు ఆ యింట్లోకి వెళ్ళాము. లోపలంతా చీకటిగా వుంది. నిర్మల తనతో చిన్న టార్చ్‌లైటును కూడా తీసుకు వచ్చింది. దాన్ని వెలిగించి చూసింది. ఆ వెలుతురులో చూశాను. సుందరం బెడ్‌మీద వెల్లకిలా పడిపోయి వున్నాడు. అతని గుండెల్లో నించి కత్తిపిడి బయటకు కనిపిస్తోంది. అప్పుడే ఎవరో అతన్ని పొడిచి వుండాలి. రక్తం బెడ్‌మీద నించి కిందకు కారుతోంది.

ఇక అక్కడ నిలబడలేకపోయాము. రోడ్డుమీద ఎవరో నడుస్తున్న బూట్ల చప్పుడు వినిపించింది. గబుక్కున వెనక్కు పరుగుదీయబోయాను. నా పక్కనే నిర్మల నిలబడి వుండటంవల్ల ఆమెకు తగిలి నేను పడబోయాను. ఆమె నన్ను పట్టుకుంది.

వెంటనే ఇద్దరం బాత్‌రూంలోనించి బయటపడి రోడ్డెక్కాము. సగం దూరం వెళ్ళిన తర్వాత గుర్తుకు వచ్చింది. నా హ్యాండ్‌బ్యాగ్ అక్కడే పడిపోయింది. వెనక్కు వెళ్ళి దాన్ని తెచ్చుకోవాలంటే భయమేసింది. రాత్రి ఇంటికి వెళ్ళలేదు. నిర్మల గదిలోనే పడుకున్నాను. తెల్లవార్లూ మేమిద్దరం సుందరాన్ని చంపినవాళ్ళ గురించి ఆలోచించాము. కాని వూహించలేకపోయాము.

తెల్లవారిన తర్వాత ఇంటికి వెళ్ళాను. ఇంటి బయటనే పోలీసుజీపు కనిపించింది.

నా హ్యాండుబ్యాగ్ ఆధారంగా పోలీసులు నా కోసం వచ్చారనీ, హత్యానేరం నా మీద పడుతుందనీ భయమేసింది—ఈ పరిస్థితుల్లో నన్ను కాపాడగల మనుషుల గురించి ఆలోచించాను. మీరు గుర్తుకు వచ్చారు. వెంటనే మీ దగ్గరకు వచ్చాను. నేను నిర్దోషిని. ఆవేశంలో ఏదో చెయ్యబోయాను. నన్ను మీరే రక్షించాలి" అన్నది కస్తూరి.

"ఆల్ రైట్. మీరు నిజంగా నిర్దోషయితే మీకు నా రక్షణ లభిస్తుంది. ముందు నేను నిర్మలని కలుసుకోవాలి. ఆమె ఎడ్రసు ఇవ్వండి" అన్నాడు జగదీష్.

చెప్పింది కస్తూరి.

"నేను యీ హత్యకేసును దర్యాప్తు చేస్తున్న ఇన్ స్పెక్టర్ని కూడా కలుసుకుంటాను. వీలయినంత త్వరలో హంతకుడిని పట్టుకుంటాను. అప్పటివరకూ మీరు యిక్కడే వుండండి. లోపల ఇంకో గది వుంది. మీకు కావలసిన సదుపాయాలన్నీ వున్నాయి" అన్నాడు.

"థాంక్ యూ" అన్నది కస్తూరి.

"నో మెన్షన్. ఇది నా బాధ్యత. మీ ఎడ్రసు కూడా యివ్వండి" అని కస్తూరి ఇంటి ఎడ్రసు తీసుకుని బయటకు నడిచాడు డిటెక్టివ్ జగదీష్.

# 6

డిటెక్టివ్ జగదీష్ తన స్కూటర్ని పోలీసుస్టేషన్ ముందు ఆపాడు.

లోపలకు నడిచాడు.

ఇన్ స్పెక్టర్ ప్రదీప్ అప్పుడే యెక్కడికో బయల్దేరే ప్రయత్నంలో వున్నాడు.

జగదీష్ను చూడగానే "నీ కోసమే బయల్దేరు

తున్నాను. నువ్వే వచ్చావ్? ఏమిటీ విశేషం?" అని అడిగాడు.

"విశేషం ఏమీ లేదు. చూసి పోదామని వచ్చాను" అన్నాడు జగదీష్.

"ఓ హత్య జరిగింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఎప్పుడు? ఎక్కడ?"

"రామ్‌నగర్‌లో. ఉదయం ఎనిమిది గంటలకు ఫోన్ వచ్చింది. వెళ్ళాను. సుందరం అనే ముప్పయేళ్ళు దాటిన మనిషి తన ఇంట్లో హత్యచెయ్యబడ్డాడు. హత్యాయుధం కత్తి. హత్య రాత్రి పదకొండు పన్నెండు గంటల మధ్య జరిగింది."

"హంతకుడి గురించిన ఆచూకీ ఏదయినా దొరికిందా?" జగదీష్ అడిగాడు.

"దొరికింది. హంతకుడు మగమనిషి కాదు. ఓ ఆడది. ఆమె పేరు కస్తూరి."

"ఇవన్నీ నీకు ఎలా తెలుసు. అప్పుడే ఇంత దర్యాప్తు చేశావా?"

"ఇప్పుడు నేను చేసిన దర్యాప్తు ఏమీలేదు. హత్యాస్థలంలోనే ఓ హ్యాండుబ్యాంగ్ దొరికింది. ఆ బ్యాగ్‌లోనే ఆ కస్తూరి ఎడ్రస్ వుంది. అంతేకాదు-హత్యాయుధమైన కత్తిని ఆమె 'అరుణా ఐరన్ స్టోర్స్'లో కొన్నట్టుగా రశీదు కూడా వుంది. అయితే కత్తి పిడిమీద వేలిముద్రలు లేవు."

"ఈ హత్య జరగటానికి మోటివ్ ఏమిటో తెలిసిందా?"

"తెలీలేదు. కాని వూహించవచ్చు. హతుడి గదిని సెర్చ్ చేశాము. అతని గదిలో కస్తూరి_హతుడయిన

సుందరానికి రాసిన ఉత్తరాలు కొన్ని దొరికాయి. ఒక ఉత్తరంలో ఆమె తనని మోసం చెయ్యవద్దనీ, పెళ్ళి చేసుకొమ్మనీ రాసింది. దీన్నిబట్టి అతను ఆమెను మోసం చేసి వుంటాడనీ అందుకని కస్తూరి అతన్ని హత్యచేసి వుంటుందనీ అనుకుంటున్నాను."

"నీ ఆలోచన సరయినదే కావచ్చు. ఒప్పుకుంటాను. కాని నువ్వు చెప్పినట్టుగా హత్యచేసిన మనిషి కస్తూరి అవకపోవచ్చు" అన్నాడు జగదీష్.

"ఎలా?" ప్రదీప్ అడిగాడు.

"ఒకటి: కత్తిపిడిమీద వేలిముద్రలు లేవని అన్నావు. అంటే హత్యచేసిన మనిషే తన వేలిముద్రలను చెరిపివేసి వుండాలి. లేదా వేలిముద్రలు పడకుండా గ్లవ్స్ తొడుక్కుని హత్యచేసి వుండవచ్చు. అంటే హంతకుడు తను బయటపడకుండా వుండటానికి తగిన జాగ్రత్తలు తీసుకుంటున్నట్టే లెఖ్ఖ.

ఒకవేళ కస్తూరి నిజంగా సుందరాన్ని హత్యచేసినట్టయితే తన హేండు బ్యాగ్‌ను అక్కడ వదిలి వెళ్ళిపోదు. ఒకవేళ హత్యచేసిన హడావిడిలో మరచిపోయినా ఆమె హేండు బ్యాగ్‌లో కత్తిని కొన్నప్పుడు యిచ్చిన రసీదు వుండదు. ఆమె షాపులోనించి బయటకు రాగానే ఆ రసీదును చింపి వేస్తుంది. అంతేగానీ హేండు బ్యాగ్‌లో వేసుకుని తిరగదు.

ఇంకో విషయం....కస్తూరే సుందరాన్ని హత్యచేసి వున్నట్టయితే తను అతనికి రాసిన ఉత్తరాలను తీసుకుని వెళ్ళి ఉండేది. అక్కడ ఉంచేది కాదు. ఈ కారణాలను బట్టి నేను యీ హత్యచేసింది కస్తూరి కాదని అనుకుంటున్నాను" అన్నాడు జగదీష్.

"నువ్వు కేసును తికమక చేసేట్టుగా ఉన్నావు" ప్రదీప్ నవ్వుతూ అన్నాడు.

"నువ్వు కస్తూరి యింటికి వెళ్ళావా?"

"వెళ్ళాను. కాని ఆమె రాత్రి ఎనిమిది గంటలకు యిల్లు వదలి వెళ్ళిందట. ఉదయానిక్కూడా తిరిగి రాలేదు. ఆమె హత్య చేసిందనీ, ఆమెను పట్టుకునే ప్రయత్నంలో వున్నామనీ చెప్పి వచ్చాను. ఆమె ఫోటో ఒకటి సంపాదించాము. ఆమె కోసం వేట జరుగుతోంది. సాయంత్రం లోపల ఆమె ఎక్కడ వున్నా పట్టుకుంటారు పోలీసులు."

"అరుణా ఐరన్ స్టోర్సులో ఎంక్వయిరీ చేశావా?" జగదీష్ అడిగాడు.

"వెళ్ళాము. ఉదయం మేము వెళ్ళేసరికి యింకా షాపు తెరవలేదు. ఇప్పుడు వెళ్ళాలి" చెప్పాడు ప్రదీప్.

"నేనుకూడా వస్తాను."

"నీ యిష్టం. నువ్వు పూనుకుంటే యీ కేసు ఇరవై నాలుగు గంటల్లోనే తేలిపోతుందనే నమ్మకం నాకు వుంది. పద మై డియర్ జగదీష్" అని లేచి నిలబడ్డాడు. హేట్ పెట్టుకున్నాడు.

ఇద్దరూ స్కూటర్ మీద బయలుదేరారు.

పావుగంట తర్వాత 'అరుణా ఐరన్ స్టోర్స్' ముందు ఆగింది స్కూటరు.

లోపలకు వెళ్ళారు.

ఇద్దరు మనుషులు ఏవో ఇనుపసామానులు చూస్తున్నారు.

ప్రదీప్‌ను చూడగానే "రండి....రండి" అని ఆహ్వానించాడు షాపతను.

కూర్చున్నారు.

ఇన్‌స్పెక్టర్ రశీదు తీసి పాపతనికి చూపించి "పదహారో తారీకున ఒక అమ్మాయి మీ దగ్గర కత్తి కొన్నది గుర్తుందా?" అనడిగాడు.

"కస్తూరి కదూ!" అనడిగాడతను.

"అవును."

"గుర్తులేకేం. చాలా అందమైన మనిషి" అన్నాడతను అరుంధతి అందాన్ని గుర్తుచేసుకుంటూ.

తర్వాత ఆ రోజు ఆమె పాపులోకి ప్రవేశించడం, ఒక్కపోటుతో మనిషిని చంపే కత్తి కావాలని అడగడం తర్వాత కత్తి తీసుకుని వెళ్ళడం అంతా చెప్పాడతను.

"ఎందుకు యివన్నీ? ఇంతకీ ఆమె హత్య చేసిందా?" అడిగాడు పాపతను.

"అవును."

ఉలిక్కిపడ్డాడు అతను. "ఆమె జోక్ చేస్తుందని అనుకున్నాము. నిజంగానే హత్య చేసిందా?"

"అవును. ఆమె ఎట్లా వుంటుందో వర్ణించి చెప్పండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

చెప్పాడు పాపతను.

ఇన్‌స్పెక్టర్ మొహం అదోలా అయింది. అతను వెంటనే షర్టు జేబులోనించి కస్తూరి ఫోటో తీసి పాపతనికి చూపించి "ఈ అమ్మాయే కదూ కత్తిని కొన్నది?" అనడిగాడు.

"కాదు. ఈ అమ్మాయి కాదు. ఈమెను మేము యింతవరకూ చూడలేదు. పదహారో తారీకున కత్తి కొన్న ఆమె యింకా లావుగా ఉంటుంది. ఈమె కాదు" అన్నాడు పాపతను గట్టిగా.

"సరిగ్గా చూసి చెప్పండి. ఈమె పేరే కస్తూరి" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"కావాలంటే మా షాపులో ఉన్న గుమస్తా లందరికీ చూపించండి. ఆ రోజున అందరూ ఆమెను చూశారు. ఎవరయినా చెప్పగలరు" అన్నాడు.

ఇన్ స్పెక్టర్ కస్తూరి ఫోటోను గుమస్తా లందరికీ చూపించాడు. వాళ్ళు ఆమెను యింతవరగూ చూడలేదని చెప్పారు.

జగదీష్ "ఇక వెడదాం" అన్నాడు ఇన్ స్పెక్టర్ తో

ఆ షాపతనికి థాంక్స్ చెప్పి అక్కడినించి బయటకు వచ్చాడు ఇన్ స్పెక్టర్.

జగదీష్ షాపతనితో "మీ దగ్గర కత్తికొన్న అమ్మాయి ఎప్పుడయినా కనబడితే వెంటనే నాకు ఫోన్ చెయ్యండి" అని తన ఫోన్ నెంబర్ యిచ్చాడు. పోలీస్ స్టేషన్ కు కూడా ఫోన్ చేసి చెప్పమన్నాడు.

సరేనన్నాడు అతను.

స్కూటరుమీద బయలుదేరారిద్దరూ.

"ఇప్పు డేమంటావ్?" అన్నాడు జగదీష్ ఇన్ స్పెక్టర్ తో.

"ఆశ్చర్యంగా ఉంది. కస్తూరి కత్తిని కొనలేదు. కాని కస్తూరి హేండు బ్యాగ్ లో కత్తిని కొన్నట్టుగా ఆమె పేరు మీద రశీదు ఉంది. ఇదెలా సాధ్యం?" అన్నాడు.

"అర్థమయిందనుకుంటాను. ఎవరో కస్తూరిని యీ హత్య కేసులో యిరికించాలని ప్రయత్నం చేశారు. అసలు యీ హత్య చేసింది యింకెవరో. వాళ్ళే కస్తూరిని నేరస్థురాలిని చెయ్యాలని చూశారు."

ఇన్ స్పెక్టర్ మాట్లాడలేదు.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు తర్వాత.

"ఈ కేసు ఫైలు ఓసారి యివ్వు....తర్వాత అంతా నేను చూసుకుంటాను" అన్నాడు జగదీష్.

"అలాగే" అన్నాడు ఇన్స్పెక్టర్.

స్కూటరు పోలీస్ స్టేషన్ ముందు ఆగింది.

## 7

జగదీష్ తనని తను పరిచయం చేసుకున్న తర్వాత "రండి" అని గౌరవంగా లోపలకు ఆహ్వానించాడు కస్తూరి తండ్రి.

ఆయన మొహం విచారంగా వుంది.

ఇద్దరూ ఓ గదిలోకి వెళ్ళారు.

కూర్చున్న తర్వాత "చెప్పండి. ఏం పనిమీద వచ్చారు" అనడిగాడాయన.

"మీ అమ్మాయి కస్తూరి గురించి మాట్లాడటానికి వచ్చాను."

ఆయన కుతూహలంగా ముందుకు వొంగి "కస్తూరి గురించా!" అన్నాడు.

"అవును."

"ఇప్పుడు ఎక్కడ వుంది? మా అమ్మాయి మీకు తెలుసా?" గబగబా అడిగాడాయన.

"తెలుసు. ఆమె యిప్పుడు నా దగ్గరే ఉంది."

"వివరంగా చెప్పండి. అది ఎవర్నో హత్యచేసిందని పోలీసులు దానికోసం తిరుగుతున్నారు. దాని తల్లి యింట్లో ఏడుస్తూ పడుకుంది. నాకు అంతా అయోమయంగా వుంది. అది హత్యచెయ్యటమేమిటి? మీకేమయినా చెప్పిందా?"

జరిగిందంతా చెప్పాడు జగదీష్.

ఆయన అంతా విని ఆశ్చర్యపోయాడు.

"నాకు అసలు ఏమీ తెలియదు. ఇప్పుడేమిటి చెయ్యటం? చెప్పండి. దాన్ని నిజంగా కనబడితే పోలీసులు అరెస్టు చేస్తారా?" అనడిగాడు.

"అరెస్టు చెయ్యకపోవచ్చు. ఇంతకు ముందే యిన్‌స్పెక్టర్ కస్తూరి యీ హత్య చేసివుండదనే అభిప్రాయానికి వచ్చాడు. కాబట్టి అనుమానితుల జాబితాలో ఆమెను ఉంచుతాడు. స్టేట్‌మెంట్ తీసుకుంటాడు. మీరు నాతో రండి. కస్తూరి నా దగ్గర వున్నట్టు నేను ఇన్‌స్పెక్టర్‌తో చెప్పలేదు."

"థాంక్‌యూ జగదీష్. మీరే అసలు హంతకుడిని పట్టుకోవాలి. ఎంత ఫీజయినా సరే యిచ్చుకుంటాను. నాకు ఉన్నది ఒక్కతే కూతురు. మేము బతుకుతున్నది దాని కోసమే" అన్నాడు అర్థిస్తున్నట్టుగా.

"అలాగే! త్వరలోనే హంతకుడిని పట్టుకుంటాను" అన్నాడు జగదీష్.

"ఒక్క నిముషం ఆగండి. ఈ వార్త నా భార్యతో చెప్పి వస్తాను" అని లోపలకు వెళ్ళాడాయన.

ఐదు నిముషాల తర్వాత రెండు కూల్ డ్రింకులతో తిరిగి వచ్చాడు. ఒకటి జగదీష్‌కు యిచ్చాడు.

"నా భార్యకు వొంట్లో బాగాలేదు. దానికి తోడు యీ చెడువార్త. ఇప్పుడు ఎంతో సంతోషపడుతోంది" అన్నాడాయన.

డ్రింకులు తాగిన తర్వాత యిద్దరూ స్కూటరుమీద బయలుదేరారు.

"కస్తూరిని ఏమీ అనకండి. అసలే ఆమె భయపడు

తోంది" అన్నాడు జగదీష్ దారిలో.

తల వూపాడు కస్తూరి తండ్రి.

# 8

ఫోన్ మోగింది. డిటెక్టివ్ జగదీష్ రిసీవర్ ఎత్తి "హలో" అన్నాడు.

"నేను భాయ్ ఇన్‌స్పెక్టర్ని. ఎంతవరకు వచ్చింది నీ పరిశోధన?" అడిగాడు.

"ఇంతవరకు కొంచెం కూడా ముందుకు పోలేదు. కస్తూరి యింటికి వచ్చింది."

"నిజమా! ఎప్పుడు తెలిసింది?"

"ఇంతకు ముందే. ఎందుకు? ఆమెను అరెస్టు చేస్తావా?"

"ఇంకెట్లా చేస్తాను? ఆమె యీ హత్య చేసివుండదనే విషయం తెలిసింది గదా!"

"మరేం చేస్తావ్?"

"కలుసుకుని మాట్లాడతాను. ఇప్పటివరకు ఎక్కడ ఉన్నదో తెలుసుకుంటాను."

"నీకు అంత శ్రమ అనవసరం భాయ్. కస్తూరి ఇప్పటివరకు ఎక్కడ వుందో నన్ను చెప్పమంటావా?"

"నీకు తెలుసా?"

"అవును. నా దగ్గరే ఉంది."

"వాట్!"

"అవును భాయ్. ఆమె నీ గురించి భయపడింది. అందుకే తన యింటిదగ్గర నిన్ను, నీ బలగాన్ని చూడగానే భయపడి వచ్చి నా సహాయం కోరింది. ఇంతకు ముందే ఆమెను తండ్రితో యింటికి పంపించాను. నువ్వు ఆమెను కలుసుకోవాలంటే కలుసుకోవచ్చు."

"నాకు అంతా అయోమయంగా ఉంది. అసలు కస్తూరి నీ సహాయం ఎందుకు కోరింది? ఆమె ఈ కేసులో ఎలా యిరుక్కుంది? నువ్వు నాకు యీ విషయాలన్నీ ఎందుకు చెప్పలేదు?" కొంచెం నిష్ఠూరంగా అడిగాడు ఇన్స్పెక్టర్.

"చెబుదామనే అనుకున్నాను. కాని నువ్వు కస్తూరే యీ హత్య చేసివుంటుందనే అభిప్రాయంలో ఉన్నావు. ముందు నీకు ఆ అపోహ పోయిన తర్వాత యీ విషయం చెబుదామని ముందుగా చెప్పలేదు. ఇదీ విషయం. నువ్వు నిశ్చింతగా వుండు. నేను కస్తూరి తరఫున పరిశోధన చేస్తున్నాను. కొన్ని గంటల్లో హంతకుడిని నీకు పట్టి యిస్తాను" అన్నాడు జగదీష్.

"ఇప్పుడు ఎక్కడికయినా వెళుతున్నావా?"

"అవును. ఈ కేసులో ఓ ముఖ్యమయిన మనిషిని కలుసుకోవడానికి వెళుతున్నాను. నువ్వు కస్తూరిని కలుసుకో. ఆమె నీకు అంతా చెబుతుంది" అని ఫోన్ పెట్టేశాడు అతను.

తర్వాత సిగరెట్టు వెలిగించాడు. గది తలుపులు మూసి స్కూటరుతో బయటకు వచ్చాడు.

కస్తూరి చెప్పిన నిర్మల అడ్రసును గుర్తు తెచ్చుకుని స్కూటరు మీద బయలుదేరాడు.

నిర్మల - సంజీవరెడ్డి నగర్‌లో ఉంటోంది.

రివ్వున దూసుకు వెడుతోంది స్కూటరు. ఆలోచిస్తూ స్కూటర్ని పోనిస్తున్నాడు. అతని మస్తిష్కంలో అనేక ఆలోచనలు దొర్లిపోతున్నాయి. కేసు పరిశోధించ టానికి తగిన ఆధారాలు కనిపిస్తూనే ఉన్నాయి. కొంచెం లాజికల్‌గా ఆలోచిస్తే సులభంగానే అసలు హంతకుడు

ఎవరో తెలుస్తుంది.

ఈ కేసులో అనుమానితులు ముగ్గురూ ఆడవాళ్ళే. ఒకటి: కస్తూరి, రెండు: నిర్మల, మూడు: అరుణా ఐరన్ స్టోర్సులో కస్తూరి పేరుతో కత్తిని కొన్న స్త్రీ.

ఇంతకీ ఆమె ఎవరు?

కస్తూరి పేరుతో ఆమె ఎందుకు కత్తిని కొన్నది? ఆమె కత్తిని కొన్న రశీదు కస్తూరి హేండు బ్యాగ్ లోకి ఎలా వచ్చింది?

ఈ విషయం తెలిస్తే అంతా తెలిసిపోతుంది. ముందు నిర్మలను కలుసుకోవాలి.

సంజీవరెడ్డి నగర్ లో ప్రవేశించింది స్కూటరు. రెండు నిముషాల తర్వాత అతను ఓ యింటి ముందు ఆగాడు.

వరండాలో నలభైయేళ్ళ మనిషి ఏదో రాసుకుంటూ కూర్చున్నాడు.

జగదీష్ని చూడగానే "ఎవరు కావాలి?" అని అడిగాడు.

"ఈ యింట్లో నిర్మల అనే అమ్మాయి అద్దెకు ఉంటోంది. ఆమె కావాలి" అన్నాడు.

"నిర్మలా!" అన్నాడాయన ఆశ్చర్యంగా.

"అవును."

"సారీ. అయితే యీ యిల్లు కాదు. ఈ యింట్లో ఎవ్వరూ అద్దెకు ఉండడం లేదు."

"174 డి6 నెంబరు గల యిల్లు యిదే కదూ!"

"అవును. అయినా యీ యింట్లో అద్దెకు ఎవ్వరూ లేరు. మొత్తం యింట్లో మేమే ఉంటున్నాము."

"సారీ! అయితే నేనే పొరపాటుపడ్డాను" అని

ఆయనకు థాంక్స్ చెప్పి అక్కడినించి బయలుదేరాడు.

జగదీష్ ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి.

అసలు నిర్మల అనే అమ్మాయి లేనేలేదు. ఇంకెవరో అమ్మాయి ఉంది. ఆ అమ్మాయి నిర్మల పేరుతో కస్తూరిని కలుసుకుంది. అదే పేరుతో ఆమే 'అరుణా ఐరన్ స్టోర్స్'లో కత్తిని కొని వుండవచ్చు. తెలివిగా నాటకమాడి కస్తూరిని యీ హత్య కేసులో యిరికించాలని చూసింది. తన పని అయిపోగానే కనిపించకుండా మాయమయ్యింది. ముందు ఆమె కోసం వేట సాగించాలి.

స్కూటర్ని కస్తూరి యింటిముందు ఆపాడు జగదీష్.

అతను లోపలకు వెళ్ళేసరికి కస్తూరి, ఆమె తండ్రి మాట్లాడుకుంటున్నారు.

జగదీష్ను చూడగానే యిద్దరూ లేచి నిలబడ్డారు.

అతను కూర్చోగానే "ఇంతకు ముందే ఇన్స్పెక్టర్ గారు వచ్చి వెళ్ళారు" అన్నాడాయన.

"ఏమన్నాడు ఆయన?"

"జరిగిందంతా చెప్పమన్నారు, చెప్పాను."

"వెరీగుడ్. చెప్పటమే మంచిది. నేనే ఆయనకు ఫోన్ చేసి మిమ్మల్ని కలవమని చెప్పాను."

"ఎంతవరకు వచ్చింది మీ పరిశోధన?" అడిగింది కస్తూరి.

"మధ్యలోనే వుంది. మీరు నాకు సరయిన ఇన్ఫర్మేషన్ యివ్వలేదు" అన్నాడు జగదీష్ కస్తూరితో.

"ఏమిటీ?"

"నిర్మల అడ్రస్ తప్పు చెప్పారు."

"కాదు. నేను చెప్పిన అడ్రసు తప్పు కాదు. కావాలంటే మీకు ఆ యిల్లు చూపిస్తాను."

"పదండి వెళదాం."

ఇద్దరూ స్కూటరుమీద బయలుదేరారు.

ఇరవై నిముషాల తర్వాత యింతకు ముందు తను వెళ్ళిన రోడ్డులోకి స్కూటర్ని మళ్ళించాడు అతను.

"అదిగో! ఆ నీలం రంగు గేటు వున్న యిల్లే" అన్నది కస్తూరి నూరంనించే.

గబుక్కున స్కూటర్ని ఆపేశాడు అతను. "బాగా చూడండి" అన్నాడు కస్తూరితో.

నవ్వింది కస్తూరి. "నాకు బాగా గుర్తు. నేను హత్య జరిగిన రోజు రాత్రి యీ యింట్లో ఎడమవైపున ఉన్న గదిలో పడుకున్నాను. నాతో పాటు నిర్మల కూడా అదే గదిలో పడుకుంది. తెల్లవారి లేచి ఇంటికి వచ్చాను" అన్నది.

"ఐతే నిర్మల మిమ్మల్ని మోసం చేసింది" అన్నాడు జగదీష్.

"ఏమిటి?"

"అవును. ఇంతకుముందు నేను ఆ ఇంటికే వెళ్ళి నిర్మల గురించి అడిగాను. అసలు ఆ ఇంట్లో యెవ్వరూ అద్దెకు లేరని చెప్పాడా ఇంటాయన. ఇందులో ఏదో మిస్టరీ వుంది."

"నిర్మల ఆ ఇంట్లో లేదని చెప్పాడా?" కస్తూరి అడిగింది.

"అవును."

"అబద్ధం. పోనివ్వండి స్కూటర్ని. ఆయనతో నేను మాట్లాడతాను" అన్నది.

"వద్దు. ఇప్పుడు ఆయన నిజం చెప్పడు. ఆయన చేత

నిజం ఇంకో విధంగా చెప్పించాలి" అని స్కూటర్ని వెనక్కి మళ్ళించాడు జగదీష్.

# 9

జగదీష్ తలుపులు తెరిచి లోపలకు వెళ్ళేసరికి ఫోన్ విరామలేకుండా మోగుతోంది.

రిసీవర్ ఎత్తి "నేను జగదీష్ని" అన్నాడు.

"నేను 'అరుణా ఐరన్ స్టోర్స్' ప్రొప్రయిటర్ని. పదహారవ తారీకున మా షాపులో కత్తికొన్న అమ్మాయి ఇంతకుముందే మా గుమస్తాకు కనిపించిందట."

"ఎక్కడ?" ఆత్రంగా అడిగాడు జగదీష్.

"కల్పనా థియేటర్కు వచ్చిందట. బాల్కనీ టిక్కెట్టు క్యూలో నిలబడిందట. మా గుమస్తా చూసి పది నిముషాలయ్యింది. మీరు వెంటనే బయల్దేరి వస్తే ఆమె కనపడుతుంది. షాపుకు రండి. గుమస్తానిచ్చి పంపిస్తాను" అన్నాడాయన.

"థాంక్స్. ఇప్పుడే వస్తున్నాను" అని ఇన్స్పెక్టర్కు డయల్ చేసి అతనికి ఈ విషయం చెప్పాడు.

తర్వాత సంజీవరెడ్డి నగర్ 174 డి6. ఇంటి యజమానిని స్టేషన్కు తీసుకువచ్చి నిర్మల గురించి ఎట్లాగయినా బెదిరించి చెప్పించమని చెప్పాడు.

సరేనన్నాడు ఇన్స్పెక్టర్.

ఫోన్ పెట్టేసి గదికి లాక్ చేసి స్కూటర్ మీద వేగంగా బయల్దేరాడు.

పదినిముషాల్లో 'అరుణా ఐరన్ స్టోర్స్' ముందుకు వెళ్ళాడు. అప్పటికే షాపు బయట గుమస్తా జగదీష్ కోసం ఎదురు చూస్తూ నిలబడ్డాడు.

స్కూటర్ మీద గుమస్తా వెనక ఎక్కి కూర్చున్నాడు.

ముందుకు నూకించాడు జగదీష్ స్కూటర్ని.

ఐదు నిముషాల్లో కల్పనా థియేటర్ ముందు ఇద్దరూ దిగారు.

"మీకు అవసరమని బాల్కనీ టిక్కెట్టు ఒకటి సంపాదించాను" అన్నాడు షాపు గుమస్తా.

బుక్కింగ్ దగ్గర ఎవ్వరూలేరు. మూసివున్నాయి.

"మంచిపని చేశావ్" అని స్కూటర్ లాక్ చేసి గబ గబా గుమస్తాతో బాల్కనీవైపు నడిచాడు.

ఇంకా పిక్చర్ బిగిన్ కాలేదు.

మ్యాట్నీ షో కావటంవల్ల లోపల వెలుతురుగానే వుంది.

గుమస్తా గేటు దగ్గర నిలబడి లోపలకు చూశాడు. ఒక్కొక్కరినే పరిశీలనగా చూస్తున్నాడు. చటుక్కున ఆతని చూపు ఆగిపోయింది.

"అదిగో....ఆమే. ఆ ఎరుపురంగు శారీ కట్టుకుంది. వాలుజడ వేసుకున్నది. ఆమే" అన్నాడు గుమాస్తా.

చూశాడు జగదీష్. అరుంధతిని కూర్చుని వుంది.

"థాంక్స్. ఇదిగో ఈ పదిరూపాయలూ వుంచు టిక్కెట్టు తీసినందుకు" అని గుమస్తా చేతిలో నోటువుంచి లోపలకు వెళ్ళాడు జగదీష్.

అరుంధతికి రెండు వరసల వెనకవున్న సీట్లో కూర్చున్నాడు.

సినిమా మొదలయ్యింది.

జగదీష్ ముందు కూర్చున్న ఆమెనే చూస్తున్నాడు.

పదినిముషాలు గడిచాయి. అరుంధతి సినిమా చూడ టంలో లీనమయిపోయినట్టుగా వుంది.

"చాలా అందంగా వుంది" అనుకున్నాడు జగదీష్.

గేటు దగ్గర వుండే కుర్రాడు అరుంధతి దగ్గరకువచ్చి చిన్న మడత పెట్టిన కాగితాన్ని ఇచ్చి వెళ్ళిపోయాడు.

జగదీష్ చూస్తూనే వున్నాడు.

ఆ కాగితంలో ఏముంది?

మడత విప్పింది అరుంధతి.

'డిటెక్టివ్ జగదీష్ నీ కోసం వచ్చాడు. పదినిముషాల తర్వాత థియేటర్లోనించి బయటకు వచ్చి ఆటోలో పాత ఇంటికి బయల్దేరు. అతను కూడా వెనకే వస్తాడు. పాత ఇంట్లో అతనికి సన్మానం చేద్దాం.'

చదివి దాన్ని ముక్కలు ముక్కలుగా చించివేసింది అరుంధతి.

ఒక్కసారి చేతినున్న వాచీకేసి చూసుకుంది. తర్వాత మళ్ళీ సినిమా చూడటం మొదలుపెట్టింది.

పదినిముషాలు గడిచింది.

లేచి నిలబడింది అరుంధతి.

ఎటూ చూడకుండా బయటకు వచ్చింది. గబగబా కిందకు దిగింది.

జగదీష్ కూడా థియేటర్లో నించి బయటకు వచ్చాడు.

ఆమె రోడ్డుమీదకు వచ్చి రోడ్డువారగా ఆగివున్న ఆటోలో ఎక్కి ఏదో చిన్నగా చెప్పింది.

ఆటో బయల్దేరింది.

స్కూటర్ని ఆటో వెనుకే పోనిచ్చాడు జగదీష్.

ఆటో స్టేషన్ రోడ్డులోకి మళ్ళింది. దానిని కొంచెం దూరంలో ఫాలో అవుతున్నాడు అతను.

యూనివర్శిటీ ఏరియా వైపు వెళుతోంది అరుంధతి ఎక్కిన ఆటో. వెళుతూ గబుక్కున ఓ సందులోకి మళ్ళి ఒక ఇంటిముందు ఆగింది.

అరుంధతి గబుక్కున ఆటోలో నించి దిగి తలుపుల మీద టకటక కొట్టింది. తలుపులు తెరుచుకున్నాయి. లోపలకు వెళ్ళింది. తలుపులు మూసుకున్నాయి.

ఆటో వెళ్ళిపోయింది.

ఆ ఇంటిముందు స్కూటర్ని ఆపాడు జగదీష్.

తలుపులమీద చప్పుడు చేశాడు.

పదినిముషాల తర్వాత తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా అరుంధతి నిలబడివుంది.

జగదీష్‌ను చూసి "ఎవరు కావాలి?" అని అడిగింది.

"నువ్వే కావాలి కస్తూరీ" అన్నాడు జగదీష్ నవ్వుతూ.

"నా పేరు కస్తూరి కాదు" అన్నది.

"ఆ విషయం నాకు తెలుసు. కాని నువ్వు కస్తూరి పేరుతోనే 'అరుణా ఐరన్ స్టోర్స్'లో కత్తిని కొన్నావు. ఔనా?"

"అవును. మాట్లాడుకుందాం రండి. అన్ని విషయాలూ వివరంగా చెబుతాను" అని వెనక్కి మళ్ళింది అరుంధతి.

ఆమె ముందు నడుస్తోంది. ఆమె వెనుకే నడుస్తున్నాడు జగదీష్. ఆమె ఏదో ఎత్తు వేస్తోందని అతనికి తెలుసు.

ఏమిటది?

మరో గదిలోకి ప్రవేశించారు.

జగదీష్ లోపలకు వెళుతుండగా ఏదో అలికిడి వినిపించి తలతిప్పి చూడబోయాడు. అప్పటికే అతని తల మీద బలమయిన దెబ్బ తగిలింది.

మొదలు నరికిన చెట్టులా వెనక్కి పడిపోయాడు. పడిపోతూ చూశాడు తనని కొట్టిన వ్యక్తిని. ఆ తర్వాత అతనికి స్పృహ పోయింది. స్పృహపోతున్నప్పుడు అతనికి

అరుంధతి నవ్వుతో పాటు మరో యువతి నవ్వు కూడా వినిపించింది.

# 10

"మర్యాదగా నిజం చెప్పు. లేకపోతే నీ ఒళ్ళు హూనం చేస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రదీప్ ఆయనతో

"నా కేమీ తెలీదు. నిజంగా నా ఇంట్లో యెవ్వరూ అద్దెకు లేరు" అన్నాడాయన.

"అబద్ధం. నీ యింట్లో ఒక గదిలో నిర్మల అనే అమ్మాయి అద్దెకు వుంది. ఆ అమ్మాయితో పాటు ఇంకో అమ్మాయి కూడా ఆ గదిలో ఓ రాత్రి గడిపింది. ఆ అమ్మాయి నీ ఇంటిని గుర్తుపట్టింది. ఇక నువ్వు అబద్ధం చెప్పి ప్రయోజనం లేదు. ఇది హత్యకేసు. ఇందులో నిన్ను కూడా ఇరికిస్తాం."

"నిర్మల యెవరో నాకు తెలీదు. నన్ను నమ్మండి" అన్నాడాయన.

ఈడ్చి అతని దవడమీద అరచేతో కొట్టాడు ప్రదీప్. బాధగా అరిచాడాయన.

"ఇది అన్యాయం నాకేం తెలియదు" అన్నాడు పళ్ళు బిగపెట్టి.

"తెలీదా?" అని బెల్టు వూడదీశాడు ప్రదీప్.

"నన్ను కొట్టవద్దు. నేను నిర్దోషిని" కేకలు పెట్టాడాయన.

బెల్టుతో ఆయన వీపుమీద కొట్టాడు ప్రదీప్.

"నన్ను చంపకండి. నిజం చెబుతాను. ఆపండి" అన్నాడు పెద్దగా.

"త్వరగా చెప్పు" గర్జించాడు.

"నిర్మల నిన్ననే గది ఖాళీచేసి వెళ్ళిపోయింది. తన గురించి యెవ్వరికీ చెప్పవద్దని నాకు వెయ్యిరూపాయలు యిచ్చింది. అంతేకాదు, వారంరోజుల తర్వాత నేను తన గురించి యెవ్వరికీ చెప్పకపోతే నాకు లొంగిపోతానన్నది. అందుకే నేను అబద్ధం చెప్పాను" అన్నాడాయన.

"ఇప్పుడు నిర్మల ఎక్కడ వుందో చెప్పు."

"నాకు తెలీదు."

"కాదు తెలుసు" అని బెల్టుతో యింకో దెబ్బ కొట్టాడు.

"చెబుతాను. ఆమె ఫ్రెండ్ ఒకామె వుంది. ఆమె పేరు అరుంధతి. ఆమె ఇల్లు విద్యానగర్ రైల్వేస్టేషన్ దగ్గర. ఇంటి నెంబర్ నూటనలభై ఆరు. నిర్మల అక్కడే వుండొచ్చు."

"వెరీగుడ్. నువ్వు ఇక్కడే వుండు మేము అక్కడకు వెళ్ళొచ్చేవరకు. నువ్వు అబద్ధం చెప్పావని తెలిస్తే ఈ హత్యానేరాన్ని నీ మీద నెడతాను" అన్నాడు ప్రదీప్ హేట్‌ను తలమీద పెట్టుకుంటూ.

అతను నలుగురు పోలీసులతో విద్యానగర్‌కు బయలుదేరాడు.

పావుగంట తర్వాత జీపు విద్యానగర్ స్టేషన్ దగ్గరకు వెళ్ళింది.

నూటనలభై ఆరు నెంబరు ఇంటిముందు ఆగింది జీపు.

తలుపులమీద చప్పుడు చేశాడు ప్రదీప్.

లోపల్నించి "ఎవరు?" అని అడిగింది ఓ ఆడగొంతు.

"టెలిగ్రాం."

తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా వున్న నిర్మల పోలీసులను చూడగానే

కంగారుపడి వెనక్కి పరుగుదీసింది.

ఆమె వెనుకే పరుగుదీశాడు ప్రదీప్.

లోపలి గదిలో కూర్చుని విస్కీ త్రాగుతున్నారు అరుంధతి—ఇంకో మగమనిషి. ఆ ప్రక్కనే స్పృహ లేని స్థితిలో డిటెక్టివ్ జగదీష్ పడివున్నాడు.

పోలీసులు కనిపించగానే గబుక్కున లేచి నిలబడ బోయాడు అతను.

అరుంధతి—నిర్మల ఏడుపు మొహాలతో ఇన్‌స్పెక్టర్‌ని చూశారు.

ముగ్గురు నేరస్థులకీ బేడీలు పడ్డాయి.

# 11

"మా మామయ్యే హంతకుడని నేనింకా నమ్మలేక పోతున్నాను. మీ రెలా వూహించగలిగారు?" అడిగింది కస్తూరి విప్ఫారిన మొహంతో.

"చాలా సింపుల్. ఎవరో హత్యానేరాన్ని మీ మీదకు నెట్టాలని మిమ్మల్ని జైలుకు పంపించటానికి ప్రయత్నించారని అర్థమయింది. అంత అవసరం యెవరికి వుంటుంది? మీకు ఎవ్వరూ శత్రువులు లేరని చెప్పారు. ఇక వున్న శత్రువల్లా మీ మామయ్యే.

మీరు మీ మామయ్యను పెళ్లి చేసుకోటానికి ఒప్పుకో లేదన్న విషయం మీ నాన్నగారి ద్వారా తెలిసింది. కాబట్టి ఆయనకు మీ మీద శత్రుత్వం పెట్టుకునే అవ కాశం వుంది! మీరు ఆయన్ని పెళ్లి చేసుకున్నట్లయితే ఆ స్తంతా ఆయనదవుతుంది. మీరు ఆయన్ని తిరస్క రించటంవల్ల ఆ అవకాశం పోయింది. అందుకే ఆయన మీ మీద పగ తీర్చుకోవాలని అనుకున్నాడు.

మీరు సుందరాన్ని ప్రేమించి మోసగించబడ్డారని

ఆయనకు తెలుసు. అసలు సుందరం కారణంగానే మీరు ఆయన్ని రెఫ్యూజ్ చేశారని ఆయనకు సుందరమంటే కోపం. అందుకే సుందరాన్ని హత్యచేసి, ఆ నేరాన్ని మీ మీదకు నెట్టి మిమ్మల్ని జైలుకు పంపించాలని ప్లాను వేశాడు.

నిర్మల—అరుంధతి ఆయన మనుషులు. నిర్మలను మీలాగే సుందరంచేత మోసపోయిన ఆడదానిలా మీ దగ్గరకి పంపించాడు. మీలో ఆవేశాన్ని కలిగించి, సుందరాన్ని హత్య చెయ్యటానికి మిమ్మల్ని ఒప్పించింది నిర్మల. ఈ లోపలే అరుంధతి మీ పేరుతో 'అరుణా ఐరన్ స్టోర్స్'లో కత్తిని కొన్నది. ఆ రశీదును నిర్మల మీ హ్యాండ్ బ్యాగ్ లో పడేసింది.

ఆ తర్వాత అరుంధతి-మీ మావయ్య సుందరాన్ని హత్యచేశారు. తర్వాత మీరు నిర్మలతో అక్కడికి వెళ్ళారు. మీ హ్యాండుబ్యాగ్ ను నిర్మలే అక్కడ పడేలా చేసింది. ఎట్లాగయినా సుందరం హత్యలో మిమ్మల్ని ఇరికించాలని అనుకున్నారు. వాళ్ళ ప్రయత్నం అయిపోయింది. నిర్మల తను వుంటున్న గదిని మార్చేసింది. తన గురించి యెవ్వరికీ చెప్పవద్దని ఇంటి యజమానికి ఆశ చూపించింది. ఐనా ఆయన భయపడి ఆమె గురించి చెప్పాడు.

అరుంధతిని థియేటర్ నించి వెంటాడుతూ ఓ ఇంట్లోకి వెళ్లిన నన్ను మీ మావయ్య తలమీద కొట్టాడు. పడిపోతూ ఆయన్ని చూసి గుర్తుపట్టాను. అంతకుముందు రెండుసార్లు నేను మీ ఇంటికి వచ్చినప్పుడు ఆయన మేడ మీదనించి నన్ను చూడటం గమనించాను" చెప్పాడు డిటెక్టివ్ జగదీష్.

"చాలా థాంక్స్ జగదీష్‌గారూ. నన్ను ఒక హత్యా నేరంలో ఇరుక్కోకుండా బయటపడేశారు" అన్నది కస్తూరి కృతజ్ఞతగా.

"ఇదిగో జగదీష్‌గారూ. పదివేల రూపాయలకు చెక్కు. మీరు పరిశోధనకు పూనుకోకుండా వున్నట్లయితే మా అమ్మాయినే పోలీసులు హంతకి అని జైల్లో పెట్టేవాళ్ళు. మీ మేలు పరచిపోలేను" అన్నాడు కస్తూరి తండ్రి జగదీష్కు చెక్కు అందిస్తూ.

"కానీ తవాళ్ళని నమ్మవద్దు. ఆవేశం-పగ-ప్రతీకారం మనల్ని కష్టాలకు గురిచేస్తాయి" అన్నాడు డిటెక్టివ్ జగదీష్ సిగరెట్టు వెలిగిస్తూ.

—: ఐపోయింది :—

# పొగమంచు

సీరియల్



ముద్దా సురేష్

# (తొమ్మిదవ భాగము)

"విశ్వామిత్ర మైక్రోప్లాస్మాను మార్పులు చేసి సాధిం చిన యీ ప్రక్రియను మ్యుటేషన్ (Mutation) అంటారు. విశ్వామిత్ర మరణించిన తర్వాత యిక ఆ మ్యుటేషన్‌ని హాండిల్ చేయడం, ఉపయోగించడం యెంత ప్రమాద కరమో మాకు తెల్సింది. దాన్ని వదిలించుకోవాలని రక్షణశాఖ భావించింది. దాన్ని వదిలించుకోడానికి మూడు పద్ధతులు ఉన్నాయి. ఒకటి—దాన్ని నాశనం చేయడం, రెండు—సముద్రంలో కప్పెడ్డం, మూడు—భూగర్భంలో లోతుగా పాతిపెట్టడం."

"మైగాడ్!" విస్తుపోయాడు ప్రొఫెసర్ సన్యాల్. బరువుగా ఊపిరి పీలుస్తూ "దాన్ని అప్పుడు భూమిలో పాతిపెట్టడానికి మీరు నిర్ణయించారన్నమాట!"

" 'నేను' కాదు మిస్టర్ సన్యాల్! అప్పుడు వున్న నా పై అధికారులు. ఇది పది సంవత్సరాల క్రిందటి సంగతి అని మరువకూడదు."

"కారీ ఆన్ మిస్టర్ సేన్!" హోమ్ సెక్రెటరీ కంఠం కరుగ్గా పలికింది.

"మొదటి పద్ధతి ప్రకారం దాన్ని నాశనం చేయడం యెలాగో మాకు తెలీదు. రెండో పద్ధతి ప్రకారం సము ద్రంలో దాన్ని పాతిపెట్టడం ప్రమాదకరం అని భావించాం. అందుచేత మూడో ఆల్టర్నేటివ్ తప్పలేదు. భూగర్భంలో చాలా చాలా లోతుగా సీసపు కాప్స్యూల్స్‌లో బంధించి, దాన్ని మళ్ళీ స్టీల్ గొట్టంలో సీలు చేసి పాతిపెట్టాం."

"భూకంపం వచ్చిన గ్రామం క్రింద" అన్నాడు రాణా.

"కాదు. మేము మైక్రోప్లాస్మా మ్యుటేషన్‌ని కప్పెట్టింది సరిగ్గా ఆ గ్రామానికి అరమైలు దూరంలో" అన్నాడు ప్రచండసేన్ రాణాకేసి యిబ్బందిగా చూస్తూ.

"గో ఆన్ మిస్టర్ సేన్!" అన్నాడు మళ్ళీ హోం సెక్రటరీ కళ్ళాల్ని తన చేతులో పట్టుకుని, వాదోపవాదాలు చెలరేగే ప్రమాదాన్ని నివారించే ప్రయత్నంలో.

"మైక్రోప్లాస్మా ప్రభావాన్ని గురించిన వివరాలు, దాన్ని సమాధిచేసిన స్థలం వివరాలు మొదలగునవన్నీ ఓ ఫైల్లో పొందుపరచబడి రహస్యంగా దాచబడింది. తర్వాత...యిప్పుడు..." తటపటాయిస్తూ ఉండిపోయాడు ప్రచండసేన్ ఏ ప్రభావమూ లేని ముఖాల వైపు చూస్తూ "కొ....కొద్ది వారాల క్రితం ఆర్మీ భూగర్భంలో ప్రేలుడు పరీక్ష...."

"వో ముఝే మాలూమ్ హై!" అరిచాడు ప్రొఫెసర్ సన్యాల్, ఉద్రేకంగా పైకిలేస్తూ "ఆర్మీను ప్రజలు యిక్కడ్నుంచీ బాగా విశ్వసిస్తారు. ఖుల్నా ఏరియాలో 150 ఎకరాల స్థలం ఏడుస్తూండగా, యింతకుముందు ప్రాణాంతకమయిన వ్యాధిని పాతిపెట్టిన ఆ స్థలం మాత్రమే దొరికింది మీకు భూగర్భంలో బాంబు ప్రయోగాలు చేయడానికి. అంతేనా?"

"సర్టెన్లీ నాట్! ఈ భూగర్భ ప్రేలుడు ప్రయోగం అక్కడ్నుంచీ రెండు మైళ్ళ కివతల జరిగింది!"

"అయితే భావ్‌నగర్ గ్రామం రెండుగా చీలిపోవడానికి కారణం ఏమిటి?"

"ప్రొఫెసర్ సన్యాల్! ప్లీజ్ సిడౌన్. విల్ యూ?" తీవ్రమయిన కంఠంతో ఆదేశించాడు హోం సెక్రటరీ. "మీకు ముందే హెచ్చరిక చేసాను. ఈ

సమావేశం కొట్లాట సభంగా మారడానికి నేను అనుమతించను. మనం యిక్కడ సమావేశమయింది ఓ పరిష్కారం కనుక్కోడానికి. మిస్టర్ ప్రచండసేన్! ప్లీజ్ కంటిన్యూ....."

"మేము ఒక శక్తివంతమయిన కొత్త ఎక్స్ప్లోజివ్ పై ఎక్స్పెరిమెంట్ చేస్తున్నాం. ఇరవై సంవత్సరాలుగా భూమిలోనికి తీసుకునిపోయి యిలాంటి ప్రయోగాలు చేస్తున్నాం. ఇది మొదటిసారిగా కాదు. చాలా దేశాలు యిదే పద్ధతిని అవలంబిస్తాయ్, తమ బాంబుల యొక్క శక్తిని పరీక్షించడానికి. ఇలా కాకుండా భూమి ఉపరితలంపై యీ ప్రయోగంచేసి గ్రామాన్ని యెగర గొట్టడం మంచిదంటారా సన్యాల్?"

"మీరు అసలు ఏ బాంబునీ పరీక్ష చేయకపోవడం మంచిదంటాను" అన్నాడు సన్యాల్ కసిగా.

"అప్పుడు రక్షణశాఖ మనుగడకే అర్థం లేదు. ఇక పోతే యిది యే రకం బాంబో మీకు బయటపెట్టలేక పోతున్నందుకు క్షమించాలి. ఇది భూమి పొరల్లో అతివేగంగా, అడ్డంగా పగులు సృష్టించింది. దీనివల్లనే భూకంపం, భూమి చీలిపోవడం, మైక్రోప్లాస్మా బయట పడడం జరిగాయ్."

"దీని అర్థం రెండు మైళ్ళ దూరం అవతల ఆ విధమయిన ప్రమాదాన్ని కలిగించే బాంబు మీరు ప్రయోగించారనా?"

"అవును. కాని ఆ సమయంలో ఆ విషయం తెలియదు. ప్రేలుడు చుట్టూ భూమి విపరీతంగా కూలిపోయింది. కాని బాంబు సృష్టించిన ప్రకంపనాన్కి భూమిలో అడ్డంగా ఏర్పడ్డ పగులు కొన్ని మైళ్ళ దూరం

వరకూ విద్యుత్‌లా వ్యాపించింది. ఈ పగులు సీసపు క్యాప్‌స్యూల్ నిక్షిప్తం చేయబడ్డ ప్రదేశాన్ని తీవ్రంగా తాకి ఉండాలి. నేలలో ఒత్తిడివల్ల అది చటుక్కున విడిపోయింది. మైక్రోప్లాస్మా బైటపడింది. అత్యంత వేగంగా పరిగెట్టే యీ పగులు ప్రకంపనం, భావ్‌నగర్‌లో క్రింద నుంచి భూమి ఉపరితలాన్ని తాకే దాకా నెమ్మదించలేదు."

"మీరు సృష్టించిన ఎక్స్‌ప్లోషన్‌వల్ల భూకంపం ఏర్పడిందని మీకు తెలుసు. అయినా మీ డిపార్టుమెంటు యిన్నాళ్ళూ యీ విషయాన్ని బయటకు చెప్పలేదు" అన్నాడు సన్యాల్ నిందాపూర్వకంగా.

ప్రచండసేన్ తల వూపాడు.

అందరి కళ్ళూ సేన్‌మీద నిల్చిపోయాయి, అతడొక్కడే యీ సర్వనాశనానికీ కారణమన్నట్లుగా.

ఎవరైనా మాట్లాడే అవకాశం యివ్వకుండా హోం సెక్రెటరీ వెంటనే కలగజేసుకున్నాడు. "మాకు ముందుగానే తెల్సు. అయినా ఆ విషయాలు బయటపెట్టడం వల్ల ఎట్టి ప్రయోజనం లేదని భావించాం ఈ రోజువాకా. థాంక్స్ ప్రచండసేన్!"

తన బాధ్యత తీరినందుకు ప్రచండసేన్ గుండె తేలికపడి విశ్రాంతిగా నిట్టూర్పు విడుస్తూ కూర్చున్నాడు.

హోం సెక్రెటరీ తిరిగి ప్రారంభించాడు. "జంటిల్మెన్! యిది ఆరోపణలకు, క్షమాపణలకు సమయం కాదు. ఇప్పుడు మన ముందు అన్ని నిజాలు బయటపడ్డాయి. కాబట్టి పరిష్కారమార్గం చర్చిద్దాం. బొంబాయికి ఉత్తరాన ఉన్న బస్సీన్ పట్టణంలోకి అడుగుపెట్టకుండా యీ విషమేఘంలో చేసిన పోరాటంలో మనం

ఓడిపోయామని చెప్పడానికి విచారిస్తున్నాను. అదృష్ట వశాత్తూ బస్తీన్ ప్రజలందర్నీ ఊరినుంచి ఖాళీ చేయించడం జరిగింది."

"ఏ విధంగా ప్రయత్నించారు దాన్ని ఆపడానికి?" అడిగేడు రాణా.

"పెర్‌హాప్స్ యు విల్ టెల్ అజ్ రణధావే?" హోం సెక్రెటరీ ఆర్మీ అండర్ సెక్రెటరీ రణధావే వైపు తిరిగాడు.

"ఎస్" తల ఊపాడు రణధావే. "ఈ పొగమంచును ఎదుర్కోడానికి నాలుగు రకాల పద్ధతు లున్నాయ్. ఇప్పుడు మనం అనుసరిస్తున్న విధానం - తక్కువ ఎత్తులో ఎగిరే విమానాలనుండి మేఘం మీదికి 'కాల్షియం క్లోరైడ్' ద్రవాన్ని చల్లడం. శీతల దేశాల్లో పొగమంచుని నివారించడానికి యీ పద్ధతి అమలుచేస్తారు. ఇది గాలిలో తేమను వేడిచేసే ఒక రసాయనం. కాని యీ విధంగా మనం టన్నుల రసాయనాన్ని ఖర్చుచేసినా ఫలితం లేకపోయింది. ఇది చాలా ఖరీదయిన పద్ధతి కూడా. కొంత పొగమంచు అదృశ్యమయింది. కాని యీ పొగమంచుకి తనను తాను ఉత్పత్తి చేసుకునే లక్షణం వుంది. అది తనకు తాను పెద్దదవుతూ పెరిగిపోతూ వుంటే మనం చేయగలిగిందేముంది?"

"మిగతా పద్ధతులు ఉపయోగించారా?" అడిగాడు ప్రొఫెసర్ సన్యాల్.

"ఇంకా లేదు. కారణం సమయం లేకపోవడంవల్ల. ఏది యేమయినా యిప్పుడు అమలుపర్చిన విధానమే యెక్కువ ఉపయోగకరమయినది. మిగతా పద్ధతులు చెప్పినప్పుడు మీకు యీ విషయం అర్థమవుతుంది.

"యుద్ధాల్లో F100 అనే పురాతన పద్ధతి ఒకటి అమల్లో ఉండేది. ఇది కూడా ఖరీదయినా విధానమే. కాని యిప్పు డెక్కడా ఆచరణలో లేదు. దట్టమయిన మంచుతో నిండిన సరిహద్దులు యీ రోజుల్లో పెద్ద సమస్య కాదు. ఎందుకంటే రాడార్ అభివృద్ధి చెందింది కాబట్టి. అప్పటి పద్ధతి చెప్తాను. పెట్రోలు సహాయంతో ప్రత్యేకమయిన పద్ధతుల్లో ఎయిర్ ఫీల్డు చుట్టూ వున్న తేమను వెచ్చపరిచేవారు. అది వాతావరణాలో వేడి సృష్టించే కొలదీ తేమ తొలగిపోయి నీటిబొట్టులు ఏర్పడి తిరిగి ఆవిరిగా మారి, పొగమంచు మాయమయ్యేది, యుద్ధ విమానాలు లాండ్ కావడానికి వీలుగా.

"పట్టణమంతా యీ పద్ధతి ప్రవేశపెట్టాలంటే అంత టైం మనకు లేదు. ఇలా చేయటంవల్ల మనం సాధించేది పొగమంచును అవతలికి నెట్టడం మాత్రమే. దాన్ని మొత్తం నాశనం చేయలేము."

"మూడవ పద్ధతి అల్ట్రాసోనిక్ తరంగాల్ని ఉపయోగించడం. ఒక ప్రదేశంలో వెనక్కీ, ముందుకీ అతి తీవ్రంగా గాలిలో యీ శబ్దతరంగాల్ని ఉత్పత్తిచేయడం వల్ల గాలిలో తేమ నీటి బిందువులుగా మారి వర్షంగా కురుస్తుంది.

ఈ పద్ధతిలో సమస్య ఏమిటంటే—ఆ శబ్దతరంగాల ఒత్తిడి ప్రాణమున్న ఏ జీవికైనా హానికరం.

మరోసారి, ఈ పరిస్థితిని నిష్ప్రయోజనకరంగా భావించవొచ్చు. ఎందుకంటే విష మేఘాన్కి తనను తాను ఉత్పత్తి చేసుకొనే లక్షణం వుండడంవల్ల."

"ఆఖరి పద్ధతి?" అడిగాడు హోం సెక్రటరీ, ఆతృతగా.

"చివరి విధానం పూర్తిగా నిరుపయోగం. దానిలో కార్బన్-డై-ఆక్సైడ్‌ని ఉపయోగించాలి. కాని ప్రస్తుత సందర్భంలో.... ఈ విష మేఘం జీవించేది కార్బన్-డై-ఆక్సైడ్ ఆసరాతోనే.

"కార్బన్-డై-ఆక్సైడ్‌ని పొగమంచుమీద ప్రయోగించినపుడు, పొగమంచులో వుండే నీటి అణువులు-దగ్గరగా ఏర్పడి—బిందువులుగా మారి-–బరువెక్కి నేలమీద పడ్డాయి. కాని ఈ కేసులో మైక్రోప్లాస్మాకు ఆహారం కార్బన్-డై-ఆక్సైడ్. మీరూహించుకోగలరు దాన్ని ప్రయోగిస్తే ఏమవుతుందో."

"ఇంతకీ మీరు చెప్పబోయేది మనం చేయగలిగేది ఏమీ లేదనా?" అన్నాడు సన్యాల్, సందేహాస్పదంగా చూస్తూ.

"ఇతరమార్గాల కోసం అన్వేషిస్తున్నాం!"

బలహీనమైన జవాబు వచ్చింది.

హోం సెక్రటరీ కలగజేసుకుంటూ అన్నాడు "ఈ విషయంలో పరిష్కారం కనుక్కోడానికి కావలసినంత మంది వైజ్ఞానికులు మన దేశంతా ఉన్నారని నా నమ్మకం. అమెరికా, రష్యాలు కూడా ఈ విషయంలో మనకు సహాయపడ్డాన్కి ముందుకు వచ్చాయి. చైనా కూడా మన పరిశోధనలలో—వారి శాస్త్రవేత్తలను పంపడం ద్వారా—చేయూతనివ్వడాన్కి ముందుకు వచ్చింది."

"ఒక విషయం మర్చిపోకండి. ఈ విష మేఘం సముద్రం దాటి మరి ఏ యితర దేశంమీదన్నా పడొచ్చు. ఈ ప్రమాదం మనకొక్కరికే కాదు. ప్రపంచానికే ఉమ్మడి శత్రువుగా మారింది.

ఈ పొగమంచుని మనం విడగొట్టలేకపోయినట్లయితే,

వ్యాధికి విరుగుడు మందు కనుక్కోవడం ఒక్కటే మిగిలిన ఆశ! ఈ సెరమ్‌ను కనుక్కోవాలంటే ముందుగా కొంత పరిమాణంలో, ఎంతయెక్కువ అయినప్పటికీ-ఈ మార్పులు చేయబడ్డ మైక్రోప్లాస్మాను సంగ్రహించవల్సి వుంది. ప్రొఫెసర్ అశ్వత్థామ చెప్పినట్లుగా — శుద్ధమైన రూపంలో."

"కాని అది యెంత అసంభవమో మీకు తెల్సు" అన్నాడు అశ్వత్థామ, విచారం గూడుకట్టుకున్న వదనంతో.

"ఎందుకు అసంభవం?" ఆశ్చర్యంగా చూశాడు సన్యాల్, సైంటిస్టు వేపు. "ప్రత్యేకమైన దుస్తులు ధరించి, ఊపిరి పీల్చుకునే పరికరాలు, మొదలైనవాటి సాయంతో ఎవరైనా విష మేఘం వద్దకి చేరవచ్చుకదా శాంపిల్ కోసం?"

"సమస్య విష మేఘాన్ని చేరటం గురించికాదు" చెప్పాడు అశ్వత్థామ "దాని మధ్యభాగంలో ప్రవేశించాలి."

"మ....ధ్య....భా...."

"ఎస్, మిస్టర్ సన్యాల్!" చెప్పాడు హోం సెక్రటరీ "విమానంలోని కొన్ని పరికరాలు విష మేఘం మధ్య భాగంలో ఒక విధమైన శక్తి ఉన్నట్లు కనిపెట్టాయి. ఇది నిస్సందేహంగా మైక్రోప్లాస్మాకు చెందిన న్యూక్లియస్. మనిషికి-గుండెకి ఏ విధమైన సంబంధముందో న్యూక్లియస్‌కీ మైక్రోప్లాస్మాకి అదే సంబంధం వుంటుంది."

"ఆ మెరుపు!" తటాలున అన్నాడు రాణా ఆశ్చర్యంగా "మేం పొగమంచులోంచి డ్రైవ్ చేస్తుండగా లూసీ ఒక మెరుపుని చూసానని చెప్పింది!"

"అవును రాణా!" తల వూపాడు అశ్వత్థామ. సైన్సు లోని ఆ శాఖలో ఏ విధమైన పరిచయంలేని ప్రొఫెసర్ సన్యాల్ చురుగ్గా పలికాడు "ఆల్ రైట్. పరిశుద్ధమైన కీలకపదార్థం విషమేఘం మధ్యభాగంలో ఉంటుందన్న మాట. ఆల్ ది సేమ్, మనిషి ఎందుకు వెళ్ళలేడు అందు లోకి, సరియైన ప్రొటెక్షన్ ఉంటే?"

అశ్వత్థామ, హోమ్ సెక్రటరీ వైపు సందిగ్ధంగా చూసాడు.

హోం సెక్రటరీ తల ఊపాడు, నిర్ధారణగా.

"విశ్వామిత్ర అజాగ్రత్తగా ప్రవర్తించాడని ఇంతకు ముందు చెప్పాం" అన్నాడు అశ్వత్థామ—సన్యాల్ వైపు చూస్తూ "కాని అతను చేసింది చిన్నచిన్న పొరపాట్లే. ప్రమాదకరమైన రసాయనాలతో పరిశోధనలు చేస్తున్నప్పుడు ఏ సైంటిస్టూ నిర్లక్ష్యంగా వుండడు. విశ్వామిత్ర అప్పుడు కూడా తలనుండి పాదంవరకూ సంరక్షక దుస్తులు ధరించాడు."

"హోలీగాడ్! విషమేఘం బారినుంచి రక్షించబడ్డానికి మనిషికి అసలు ఏ విధమైన ప్రొటెక్షన్ లేదంటారా?"

"ఉంటుంది. కాని మనిషి కదలడానికి వీలుగా వుండే సంరక్షక దుస్తులు మనకు కావాలి. ఎలాంటి దట్టమైన మూలపదార్థంతో చేయబడిన దుస్తుల్లో నుంచైనా ఈ పొగమంచు చొచ్చుకుపోగలదు."

"సీసంతో అల్లిన సూటు ధరిస్తే?" రాణా అడిగాడు. "ఈ విధమైన ఆపరేషన్ నిర్వహించడాన్కి అది అనుకూలం కాదు. పైగా చాల బరువుగాను, స్వేచ్ఛగా కదలడాన్కి యిబ్బందిగాను వుంటాయి ఆ దుస్తులు. ఈ సంరక్షక దుస్తులు ధరించిన వ్యక్తి దాదాపు

అర మైలు నడవాలి, విష మేఘం మధ్యభాగం చేరాలంటే. 'దట్టమైన' మేఘంలో దారి కనపడదు. పైగా-మధ్యలో వుండే మైక్రోప్లాస్మా చాల పవర్ ఫుల్ గా వుంటుంది. దాని దుష్టశక్తికి తట్టుకోగలమన్న గారంటీ లేదు."

'ఏదో అనుమానం రాణా మెదడులో పొడసూపి నట్లయింది.

"మళ్ళీ వెనక్కి వచ్చాం. భద్రత పాయింట్ కి" అన్నాడు హోమ్ సెక్రటరీ వైపు సూటిగా చూస్తూ.

"ఎస్" అన్నాడు హోమ్ సెక్రటరీ ఏవిధమైన తత్తరపాటులేని స్వరంతో. " 'ఈ వ్యాధినుండి భద్రత' కలిగిన వ్యక్తి మాకు కావాలి, లోపలికి వెళ్లి శాంపిల్ తీసుకురావడానికి. ఆ వ్యక్తి....నువ్వొక్కడివే మిస్టర్ మహారాణా."

•   •   •

బస్సీన్ పట్టణం నిర్మానుష్యంగా ఉంది.

విష మేఘం ప్రవేశించడంవల్ల ప్రభుత్వం ప్రజలనందర్నీ ఊరినుండి ఖాళీ చేయించింది.

పసుపు పచ్చని ఛాయ కలిగిన దట్టమైన పొగమంచు వీధుల్లో ఆవరించింది.

నాలుగు మానవాకారాలు ఆ పొగ మంచులో ముందుకు అడుగులేస్తున్నాయ్.

మొదట నడిచే వ్యక్తి- ఒక చిన్న చక్రాలబండిని నడిపిస్తున్నాడు. దానిమీద పెద్ద పెట్టె వుంది. ఆ పెట్టెకు విచిత్రమైన పరికరాలు అమర్చబడి ఉన్నాయ్.

వెనక నడిచే వ్యక్తులు సురక్షిత (లోహపు) దుస్తులు ధరించారు. ముఖాలకు మాస్క్లున్నాయ్.

బరువైన దుస్తులు ధరించిన ఓ వ్యక్తి రాణా

ముఖాన్ని తట్టేడు.

దాని అర్థం—

వారు అంతకు మించి ముందుకు నడవలేరు. నడవ కూడదు. మిగతా బాధ్యత అంతా రాణాదే!

అతని కంఠం సరిగ్గా వినబడటం లేదు ముఖానికి మాస్క్ వుండడంవల్ల. బొటనవ్రేలు పైకెత్తి 'ఓ.కే.' గుర్తు చూపాడతను.

విచిత్రమైన దుస్తులు ధరించిన ఆ ముగ్గురు సైంటిస్టులు ఆగిపోయారు.

మాస్క్ అద్దాల్లోంచి రెండడుగుల అవతల ఏముందో ఎవరికీ స్పష్టంగా కనబడడంలేదు - దట్టమైన పొగవల్ల.

రాణా విషయం అర్థంచేసుకున్నాడు.

అతని శరీరంమీద ఎలాంటి సురక్షిత దుస్తులూ లేవు- వీపు వెనకవున్న ఆక్సిజన్ సిలండర్ తప్ప.

రాణాకు కూడా సైంటిస్టులు ఎవరెవరో తెల్సినా ఎవరు-ఎవరో తెలియటంలేదు మాస్క్‌లు వుండడంవల్ల.

అతని భుజంతట్టిన వ్యక్తి, రాణాకి చక్రాలబండిని అందజేసాడు. చిన్నదైనా, మోటారుతో, నడిచే బరువైన అధునాతన వాహనం ఆ ట్రాలీయంత్రం. ఐస్‌క్రీం తోపుడుబండిలా వుంటుందది. దాని హాండిల్‌కున్న బటన్ నొక్కితే, , అది ఆటోమాటిక్‌గా కదులుతుంది.... ఆ వ్యక్తి ట్రాలీ వేగాన్ని కంట్రోల్ చేయవచ్చు. రాణా, ఆ సైంటిస్టు చేతిని తట్టాడు కృతజ్ఞతా సూచకంగా....

ఆ మానవాకారాలు పసుపుపచ్చని పొగమంచు లోంచి నడుచుకుంటూ వెనక్కి వెళ్ళిపోయాయి.

రాణాలో అకస్మాత్తుగా భయం ఆవహించింది! భయంకరమైన ఒంటరితనం అతన్ని వేధించసాగింది.

తనని నరకంలో వదిలిపెట్టి వారు వెళ్లిపోయినట్లు ఫీల య్యాడు. వాళ్ళని వెనక్కి పిలవాలన్న కోరికను బల వంతంగా ఆపుకున్నాడు రాణా.

కాని వారు యిప్పటికే పెద్దరిస్కు తీసుకున్నారని రాణాకి తెల్సు, తనని యిక్కడిదాకా తీసుకురావడం ద్వారా.

విష మేఘం అంచులు, ఎక్కువ శక్తివంతంగా వుండ వన్న వుద్దేశంతో వారు యిక్కడిదాకా వచ్చారు.

కాని అవి యెంతవరకు బలహీనమో వారికి స్పష్టంగా తెలీదు.

గతరాత్రి తను స్టడీచేసిన రోడ్డు మాప్‌ని గుర్తుచేసు కుంటూ ముందుకు కదిలాడు రాణా.

కళ్ళు మూసుకుని వెళ్లినా అతను దారి తప్పడు. అంతగా బట్టీపట్టాడు రోడ్డుమాప్‌ని.

వీపునవున్న చిన్న ఆక్సిజన్ టాంకు నడవడాన్కి యిబ్బంది కల్గిస్తోంది.... కాని విష మేఘం దట్టమై, ఊపిరి పీల్చుకోడం కష్టమైతే దాని ఉపయోగం అంతా ఇంతా కాదని తెల్సు రాణాకి.

ట్రాలీని కంట్రోల్ చేసే బటన్ నొక్కి, ముందుకు నడుస్తున్నాడు రాణా.

గతరాత్రి అతనిని పరీక్షచేసి 'రెండవసారి వ్యాధి సోకే ప్రమాదం' లేదని హామీ ఇచ్చారు డాక్టర్లు.

కాని 'నిర్ణయాధికారాన్ని' అతనికే వదిలేసారు.

విష మేఘాన్ని నాశనం చేయలేనట్లయితే, లక్షలాది ప్రజలు దిక్కులేని చావు చస్తారు.

ఒకే ఒక పరిష్కార మార్గం—విరుగుడు మందు కనుక్కోడం. ఈ ఎస్సయిన్‌మెంట్‌లో సహాయపడగల

ఒకే ఒక వ్యక్తి—

తాను—

తను రక్షణశాఖ పొరపాట్లను ఎంతసేపు తిట్టిపోసినా ప్రయోజనంలేదు.

నడుంకట్టి నిర్మాణాత్మకమైన సహాయం చేయడాన్కి యిదే సమయం.

ప్రజలు ఈ భయం పూర్తిగా తొలగిపోయిన తర్వాత ఈ విషయం జ్ఞాపకం ఉంచుకుంటారా?

రాణా ఆలోచనలు లూసీ మీదకు మళ్ళాయ్.

గతరాత్రి ఆమె ముఖం తెల్లగా పాలిపోయి వుంది....

కాని....నిశ్చలంగా, మత్తులో పడివున్న పరిస్థితిలో కూడా ఆమె ముఖంలో అమాయకత్వం తెచ్చే అందం తగ్గలేదు....

తను ఆమె లేకుండా జీవించలేడు.

ఆమె లేకుండా జీవించడంకంటే, తను ఇప్పుడే మరణించడం మంచిది.

రాణా తక్కున నిల్చిపోయాడు....

ఒక్క క్షణంపాటు అతనికి దట్టమైన పొగలో ఏదో కదిలినట్లు అనిపించింది.

'లేక సుడులు తిరుగుతున్న మేఘం తన కళ్ళను మోసం చేస్తోందా?' సంధిగ్ధావస్థలో మళ్ళీ ముందుకి కదిలాడు రాణా.

ప్రక్కన వున్న భవనాలు కనబడేలా రోడ్డుకు సాధ్యమైనంత ఓరగా నడుచుకుంటూ వెళ్తున్నాడు రాణా.

మలుపు తిరగడాన్కి, వెనకాల వున్న ట్రాలీవల్ల ప్లాట్ ఫాంకి యివతలగా నడవాల్సి వస్తోంది.

లూసీ మీద రక్తశుద్ధి చికిత్స జయప్రదంగా ముగిసింది.

ఈ ఉదయం ఆమెకు రేడియోలజీ చికిత్స చేస్తారు....

రేడియేషన్ — చెడును కాల్చేస్తుంది....

ఎక్స్‌రే కిరణాల యొక్క యాంగిల్ అస్తమానూ మారుస్తారు ఆరోగ్యవంతమైన మెదడు కణాలు పాడై పోకుండా—

ఈ చికిత్స ఫెయిలయితే?

ఆ ఆలోచన తను భరించలేడు—

భగవాన్! నా లూసీని నాకు దక్కించు!

లోలోపల ప్రార్థించాడు రాణా బేలగా.

రాణా ముదురుపసుపులోకి మారుతూ దట్టమౌతున్న పొగమంచులోకి ప్రవేశించాడు.

"ఇక్కడ ఆగాలి" అనుకున్నాడు రాణా పరిసరాలు పరికిస్తూ. 'ఇదే షాపింగ్ సెంటర్. తను కుడివేపుకు తిరిగితే మరాఠా దుర్గం వస్తుంది.'

మరాఠా మందిర్ ఓ చారిత్రాత్మక కట్టడం. విష మేఘం కీలకశక్తి, ఆ కోట దగ్గర్నుంచి వస్తున్నట్లు అభి ప్రాయపడ్డారు శాస్త్రవేత్తలు.

అతని వెనగ్గా పెంపుడు జంతువులా అనుసరిస్తున్న ట్రాలీ మీది సీసపు పెట్టె—వాక్యూమ్ క్లీనర్‌లా పని చేస్తుంది.

రకరకాల లోహపు గొట్టాలు ఆ పెట్టెకు ఒకవైపు తగిలించబడి వున్నాయి. వాటిని కలుపుతూ, పెట్టెకువున్న బలమైన, పొడవాటి హోస్ పైపును అమర్చవచ్చు. అప్పుడు అది పదిహేను అడుగుల పొడవు రాడ్‌లా కనబడుతుంది. ఆ పైపుని విషమేఘం అంతర్భాగంలోని న్యూక్లియస్‌లో అమర్చి, ఓ మీట నొక్కితే, ఆ పదార్థం అంతా ట్రాలీ లోని పెట్టెలోకి వస్తుంది.

ధైర్యం పుంజుకుంటూ, మరాఠా దుర్గం ఆవరణకు తీసుకువెళ్ళే వీధిలోకి వెళ్ళాడు రాణా.

వీధి యిరుగ్గా వుంది.

వారగా నడుస్తున్న రాణా, అద్దాలు పగిలి వున్న ఓ షాపుకేసి చూసి ఉలిక్కిపడ్డాడు.

కొంచెం ముందుకు వెళ్ళగానే అలాంటి మరోదృశ్యం ఎదురైంది అతనికి.

ప్రజలు పట్టణాన్ని ఖాళీచేయడం చూసి ఎవరైనా లూటీలు జరుపుతున్నారా??

ఇక్కడ వుండడం యెంత ప్రమాదమో ఆ దొంగలకి తెలీదా?

విషమేఘం ప్రభావంవల్ల మనుషులు పిచ్చివాళ్ళుగా మారతారని ప్రజలందరికీ తెల్సివుండాలి.

మరి లూటీదారులు యిక్కడెందుకున్నట్లు?

వాళ్ళకి ప్రాణాలపై తీపి వుండదా?

బహుశా ప్రమాదవశాత్తు యిలా జరిగిందేమో, ఇరుకు వీధిలో ప్రయాణించలేక ఏ ఆర్మీ వాహనమో షాపుకి గుద్దుకొని వుండాలి.

లేదా ప్రాణాలను రక్షించుకుదేందుకు, ఊరిని వదిలి పెట్టే గాభరాలో ఏదో వాహనం ఆ షాపు అద్దాల్ని గుద్దుకుని వుండాలి.

కాని రెండు షాపుల అద్దాలు....?

రాణా సునిశితంగా ఆ షాపు పరిసితిని అవలోకించాడు.

నగల దుకాణం!!

గుడ్ గాడ్! ఇది లూటీయే?

ఎవరో ఈ పరిసరాల్లో.... దాక్కున్నారు!

ప్రమాదాన్ని నిర్లక్ష్యం చేసి—

ప్రభుత్వ హెచ్చరికను పెడచెవిని పెట్టి....

దొంగతనాలు చేయడంకోసం....

వాళ్ళు యింకా ఈ చుట్టుప్రక్కలే ఉన్నారా?

లేక సులభంగా దోపిడీ పూర్తిచేసుకొని వెళ్లిపోయారా?

"లీవిట్!" తనను తాను హెచ్చరించుకుంటూ భుజాలెగరేశాడు రాణా.

అది తన సమస్య కాదు.

ఆ చారిత్రాత్మక కట్టడాన్ని సమీపించేకొలదీ రోడ్డుమీది మేఘం దట్టంగా మారి, రాణా దృష్టి మందగించసాగింది....కోటముందు ఉన్న పచ్చిక మైదానం వైపు అడుగులు వేశాడు రాణా, కళ్ళు చిట్లిస్తూ, మార్గం వెతుక్కుంటూ....

ఎక్కడుంది ఆ వెలుగు??

ఉంటే ఈపాటికి అది తనకు కనబడి వుండాలే?

కీలకమైన విషమేఘం మధ్యభాగం—ఈ భవనం చుట్టుప్రక్కల ఎక్కడో ఖచ్చితంగా ఉండాలని నొక్కి చెప్పారు సైంటిస్టులు.

ఈపాటికి కదిలి వెళ్లిపోయిందేమో?

కాని పొగమంచును కదిపేటంత గాలిలేదు, ఈ ఉదయం.

భవనం ప్రధాన ద్వారాన్ని సమీపిస్తుండగా రాణాకు హీనంగా, చిన్నగా మెరుస్తున్న....ఆ వెలుగు కనబడింది!

యిది సాధ్యమేనా?

రాణా బిగుసుకుపోయాడు....

ఆ న్యూక్లియస్ ........ వ్యాధిని రగిలించే మైక్రో

ప్లాస్మాకి గుండెకాయలాంటి న్యూక్లియస్.... ఈ పురాతన కట్టడంలో దాక్కొని వుందా?

గాలిలో తేలుకుంటూవచ్చి అది ఈ పురాతన గోడల మధ్య బందీ అయిపోయిందా?

మరో దారుణమైన ఆలోచన మస్తిష్కంలో ప్రకాశించడంతో రాణా ఎండుటాకులా వణికిపోయాడు.

అది తనకుతానుగా సంకల్పించుకొని, ఈ భవనంలో దాక్కుందేమో?

అది అసహజమైన ఆలోచనగా తట్టి రాణా దాన్ని మస్తిష్కంలోంచి త్రోసి పుచ్చడాన్కి విఫల ప్రయత్నం చేసాడు.

అది చాలా అసాధరణమైన ఆలోచన!

సైన్సు ఫిక్షన్ కథల్లో చదవడాన్కి బావుండే ఆలోచన.

కాని యింతకు ముందు జరిగిన దారుణ సంఘటనలన్నీ అసహజంగా లేవ్వూ?

ఒక పట్టణంలోని జనాభా నంతటినీ ఖాళీచేయించి పంపడం అసాధారణం కామా?

రాణా ముందుకు నడవసాగాడు, ఊపిరి బిగపట్టి ప్రతీ అడుగూ తూచితూచి వేస్తూ.

తను చూసిన వెలుగు ఖచ్చితంగా గుమ్మంలోంచి వచ్చింది.

చీకటి భవనంలో, లోపల దాగి ఉన్న పిశాచంలాంటి ఆ విచిత్ర శక్తి ఎదురుగా అడుగుపెట్టే ధైర్యం తనకు ఉందా?

గుమ్మందగ్గర తటతటాయిస్తూ లోనికి తల వొంచి చూసాడు రాణా.

ఊపిరి పీల్చడానిక్కి చాలా కష్టమౌతోంది రాణాకి.

గాలిలో, ఒక విధమైన వాసన బయల్దేరి అతని ముక్కు పుటాల్లోను, గొంతుకలోను మంట రేపింది.

ముఖానికున్న స్మోగ్ మాస్కు తొలగించి, భుజానికున్న ఆక్సిజన్ మాస్కు అందుకుంటుండగా రాణా కనుసన్నల చివరగా ఏదో కదిలినట్లయింది.

త్రుళ్లిపడి తలతిప్పి చూశాడు రాణా కళ్లు చిట్లిస్తూ, పొగమంచులో ఆ కదలిక ఏర్పడిన దిశగా.

తన ఊహా?

అక్కడ అతనికేం కనబడలేదు సుడులు తిరుగుతున్న మేఘం తప్ప....

చెవులు రిక్కించాడు....

ఎలాంటి అలికిడీ లేదు....తన గుండె కొట్టుకునే శబ్దంతప్ప.

రాణా మళ్లీ ఆ 'వెలుగు' ఉత్పత్తి స్థానం వైపు దృష్టి సారించాడు.

ఆ భవనం లోపల....మధ్య భాగంలో....

మరింత శక్తివంతంగా మెరుస్తూ....

ప్రత్యేకమైన ఆకృతిలేకుండా....

చుట్టూ ఉన్న చిక్కని పసుపుద్రవం.... నిర్విరామంగా కదుల్తూ అప్పుడప్పుడు మెరుపుని కప్పేస్తూ....

స్పష్టమైన....పరిశుభ్రమైన....పసుపురంగులో ఉన్న

న్యూక్లియస్!!

దాని చుట్టూ రక్షక తెరలా అల్లుకుని కాపాడుతున్న లేతరంగులో ఉన్న విషమేఘం!........

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చెరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులుకాని వారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును.



# ప్రేమలో నవ్వులాట

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## దెయ్యాల గోల!

అర్ధరాత్రి పన్నెండు గంటలయింది. కటిక చీకటి.

ఆ సమయంలో ఊరి చివరగా స్మశానానికి కొద్ది దూరంలో వున్న రోడ్డు మీదుగా నడచి పోతున్నాడొక వ్యక్తి.

హఠాత్తుగా అతని ముందు ఒక దయ్యం ప్రత్యక్షమయింది. గాల్లో వేలాడుతూ వుంది. జుట్టు విరబోసుకుని వుంది. ముక్కు ముందుకు పొడుచుకు వచ్చింది. కళ్ళు రక్తవర్ణంతో వున్నాయి. చేతివేళ్లు పొడుగ్గా వుండి కోరలు బాగా పెరిగిపోయాయి.

"ఏయ్ ఆగు! నిన్ను చంపేస్తాను" అంది అది.

నడుస్తున్న వ్యక్తి తిరిగి చూసాడు దానిని నిశితంగా.

"నువ్వు దయ్యానివా?" అడిగాడు.

"అవును.. నిన్ను చంపి రక్తం తాగుతా!" అంది.

దానికే ఆశ్చర్యంగా వుంది. ఇంతవరకు ఏ నరుడూ తన రూపం చూసి అలా మాట్లాడలేదు. చూడగానే గుండె ఆగి చచ్చేవారు.

"మేకప్ బాగుంది సినిమాల్లో చేరు రాణిస్తావు" అంటూ ఆ వ్యక్తి ముందుకు వెళ్ళిపోయాడు.

ఆశ్చర్యంగా వున్న ఆ దయ్యం దగ్గరకు మరో దయ్యం వచ్చింది. సంగతంతా చెప్పింది మొదటి దయ్యం.

"ఇది కలికాలం. నరులంతా అవేవో అపరాధ పరిశోధనలు చదివి మనల్ని నమ్మటం లేదు. భయపడటమూ లేదు" అంది రెండవ దయ్యం.

—వి. రమణమూర్తి, పార్వతీపురం.

## బుద్ధితక్కువ దొంగతనం!

సిటీ బస్‌లో ప్రయాణం చేస్తూ ఓ నిరుద్యోగి పెన్ను పోగొట్టుకున్నాడు. ఆ మర్నాటి నుంచి అతను "దొంగలున్నారు పెన్నులు, పర్సులు జాగ్రత్త" అని హెచ్చరించటం ప్రారంభించాడు.

ఓ వారం రోజుల తరువాత నిరుద్యోగి పెన్ను దొంగిలించిన వ్యక్తి ఆ నిరుద్యోగిని కలుసుకొని పెన్ను తిరిగి ఇచ్చివేస్తూ, "బాబు! బుద్ధితక్కువయి నీ పెన్ను దొంగిలించాను. ఇకమీదటనయినా ఆ హెచ్చరిక మానేయ్! లేకపోతే కడుపు మాడి చస్తాను" అన్నాడు.

—'విప్లవ' విజయవాడ-14

## కుక్క మొరిగింది?

వెంకట్రావు ఇంటికి భోజనానికి కామేశం అతిథిగా వచ్చాడు. అతను భోజనం చెయ్యడం ప్రారంభించినప్పటినించీ వెంకట్రావుగారి కుక్క మొరగడం ఆరంభించింది.

తన్ను చూసి ఆ కుక్క ఎందుకు మొరుగుతుందో అర్థం కాలేదు కామేశంకు. ఆ కుక్క ప్రక్కనే కూర్చుని వున్న వెంకట్రావు చిన్న కొడుకును చూసి,

"నన్ను చూసి మీ కుక్క ఎందుకలా మొరుగుతోంది?" అని అడిగాడు కామేశం.

"మరి మొరగదా ఏంటి? తను తినే ప్లేటులో మీరు భోంచేస్తుంటే??" చెప్పేశాడా గడుగ్గాయి.

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

## గురువుకు తగ్గ శిష్యులు

నా స్నేహితుడు విశాఖపట్నంకు దగ్గరున్న ఒక ప్రాథమిక పాఠశాలలో టీచర్‌గా వుంటున్నాడు. స్కూల్‌కు రాగానే పిల్లలకు క్లాస్ వర్కు యిచ్చి పడుకునేవాడు. మైల్ ప్రతీరోజూ పన్నెండు తర్వాత వెళ్ళడం స్కూల్ కిటికీలోంచి కనబడేది. మైల్ వెళ్ళగానే తనని లేపమని చెప్పేవాడు.

ఈ కార్యక్రమం నిర్విఘ్నంగా కొన్ని నెలలు జరిగింది.

ఒకసారి లైనులో ఏదో ఆక్సిడెంట్ జరిగి మైలు ఆరు గంటలు లేటయింది. పాపం! పిల్లలు చీకటి పడేదాకా మాష్టార్ని లేపకుండా అలాగే కూర్చున్నారు

నా స్నేహితుడికి తెలివి వచ్చి చూసేసరికి చీకట్లు కమ్ముకుంటున్నాయి.

"ఏమిరా లేపలేదు?" అని అడిగాడు కోపంగా.

"మైలు ఇంకా రాలేదు సార్!" అన్నారు పిల్లలు ఏకకంఠంతో.

మేస్టారి నోట మాట లేదు.

—ప్రభాకర్, తిరుచ్చి-14.

## పెట్టె పోయింది!

ఒకడు: (పోలీసుతో) నా పెట్టె పోయింది సార్!
పోలీసు: పెట్టె రంగు ఏమిటి?
ఒకడు: పసుపుపచ్చ రంగు సార్!
పోలీసు: దానిమీద యింకా ఏమైనా గుర్తులున్నాయి?
ఒకడు: ఆఁ-దానిమీద చార్మినార్ బొమ్మ వున్నదండి.
పోలీసు: ఆ పెట్టెలో ఏమేమి వున్నాయో?
ఒకడు: తొమ్మిది సిగరెట్లు ఉండాలండి. దానిలో నేను ఒక్కటే కాల్చాను.

—శ్యాంబాబు, ఆదవాని.

## మేడమీద హత్య?

లాయర్: హత్య ఎక్కడ జరిగింది? ఎన్ని గంటలకు జరిగింది? నీవెప్పుడు చూశావు?

సాక్షి: హత్య మేడమీద జరిగిందండి. సాయంత్రం 6-30 కు. పెద్దగా చావుకేక వినిపించేసరికి క్రింద వున్న నేను పరుగెత్తుకెళ్ళి చూసాను. అక్కడ ఎవరూ లేరు. రంగనాథం రక్తపు మడుగులో పడి వున్నాడు.

లాయర్: ఆ మేడమీదకి వెళ్ళటానికిగానీ, దిగటానికి గాని ఎన్ని దారులు వున్నాయి?

సాక్షి: ఒక్కటే దారి వుందండి. అదే నేను మేడ మీదకి ఎక్కిపోయిన మెట్లదారి.

లాయర్: నీవు ఎక్కివెళ్ళిన మేడమెట్లు ఎలా వున్నాయి?

సాక్షి: క్రిందినుంచి చూస్తే పైకి, పైనుండి చూస్తే క్రిందికి వున్నాయండి.

—శ్రీలక్ష్మి, సూర్యాపేట.

